# ప్రజాశక్తి అయోధ్యసమస్య-పూర్వాపరాలు

ప్రత్యేక అనుబంధం



మతోన్మాద వ్యూహంలో
శ్రీ రాముడు పావిక!
ఈ కుట్రలు సాగనీదు
జనచేతన వీచిక!!



చేయి కలిపి ఎగరేస్తాం
సమైక్యతా పతాక!
మతాలు వేరైనా
సామరస్య ప్రతీక!!

డిసెంబర్ 92 పేజీలు : 32 వెల : రు. 2

## చెలరేగే మతోన్మాదానికి లౌకికశక్తులసమైక్యతే సమాధానం

# కరసేవ కరాళవ్యూహాన్ని ఛిద్రంచేయాలి!



అయోధ్యను మరోసారి అగ్నిగుండంగా మార్చడానికే భారతీయ జనతా పార్టీ- వి.హెచ్.పి.- ఆర్.ఎస్.ఎస్.లు నిర్ణయించుకున్నాయి.

ఆర్.ఎస్.ఎస్. సంఘ పరివారం సంగతి సరిగ్గా తెలియని వాళ్ళు కరసేవ లాంఛనంగానే జరుగుతుంది తప్ప నిర్మాణ కార్యక్రమాలేవీ చేబట్టబోరని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం సుప్రీంకోర్టులో అఫిడవిట్ దాఖలు చేయగానే 'హమ్మయ్యా' అని ఊపిరి పీల్చుకున్నారు. పత్రికా వ్యాఖ్యాతలు బి.జె.పి. ఎందుకు వెనుకడుగు వేసింది అని విశ్లేషించి వ్యాసాలు రాశారు. కాని వారు పొరబడ్డారని రెండు రోజుల్లోనే తేలిపోయింది. ఊపిరి పీల్చుకున్న వారు మళ్ళీ ఉత్కంఠతో దాన్ని బిగపట్టాల్సిన ఉద్రిక్త పరిస్థితి ఏర్పడింది. సాక్షాత్తూ లాల్ కృష్ణ అద్వానీ, మురళీ మనోహర్ జోషిమహాశయులే చెరోవైపు నుంచి బయలుదేరి ఉత్తర ప్రదేశ్‌లో మరోసారి మతోన్మాదాన్ని రెచ్చగొట్టే మహత్తర కర్తవ్యం స్వీకరించారు. బి.జె.పి. ఎం.పి.లు ఎవరూ కరసేవలో పాల్గొనరాదని మొన్న చెప్పినవారు యిప్పుడు స్వయంగా తామే దగ్గరుండి మరీ 'కరసేవ' జరిపిస్తామంటున్నారు. లాంఛనప్రాయంగా భజనలకు పరిమితమయ్యే ప్రసక్తేలేదని, గుడికట్టి తీరతామని హూంకరిస్తున్నారు. వివాదాస్పద కట్టడానికి ముప్పు లేకుండా గుడి కట్టగలరా అంటే అది అసంభవమని జోషి స్పష్టంగా చెబుతున్నారు.

### వెయ్యి అసత్యాలు– లక్ష ఎత్తులు

అయితే డిసెంబర్ 6న ఏం చేసేదీ యిప్పటికీ ఖచ్చితంగా చెప్పడం లేదు. అది 4వ తేదీన జరిగే మార్గదర్శక మండల్ నిర్ణయిస్తుందంటూ ఈలోగా ఉద్రేకాలను రెచ్చగొట్టడానికి ఉపక్రమించారు. శ్రీరాముడిది "ఒకమాట – ఒకబాణం" అయితే ఆయన అభినవ భక్తులది "వెయ్యి అసత్యాలు – లక్షకుయుక్తులు" అన్న చందంగా పరిస్థితి పరిణమించింది.

ఈ పరిస్థితిలో ఆరవ తేదీన నిజంగా ఏమి జరుగుతుందనేది ఎవరికీ తెలియదు. ఒకేసారి వెనక్కు తగ్గితే పరువు తక్కువ గనక యిలా రకరకాలుగా మాట్లాడి తోక ముడవాలనుకోవచ్చు. కాని ఉద్రేకాలు పెంచుతున్న తీరు అందుకు భిన్నంగా వుంది. ఇదంతా ఊరికే జరుగుతుందని అనుకోలేము. దీని వెనుక స్పష్టమైన కుటిల వ్యూహం వుంటుంది. మూడోసారి కరసేవ పేర బి.జె.పి., వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్.లు మొదలు పెట్టిన ఈ తతంగం అంత తేలిగ్గా ముగియకపోవచ్చు. 1990లో రాష్ట్రంలో ములాయం సింగ్, కేంద్రంలో వి.పి. సింగ్ కరసేవను ఖచ్చితంగా ఆపాలనే వైఖరి తీసుకున్నప్పటికీ మతోన్మాద ప్రథమగణాలు (బహుశా కొందరు పోలీసు అధికారుల లాలూచీతో) మసీదు శిఖరాలపై కెక్కి విధ్వంసానికి పాల్పడ్డాయి. ఇప్పుడు రాష్ట్రంలో వారి ప్రభుత్వమే వుంది. గనక ఏదైనా సంభవమే. పైగా అద్వానీ వంటివారి మాటలు కూడా ఆ అనుమానాలు పెంచుతున్నాయి.

బి.జె.పి. మతోన్మాద రాజకీయాలు, అది దేశంలో ఈనాటి స్థితికి రావడానికి కారణాలు లోపలి పేజీల్లో వివరంగా ప్రస్తావించబడ్డాయి. రామమందిరం గాని, హిందూమత నినాదాలుగాని అధికారంలోకి ఎగబాకే సాధనంగా బి.జె.పి. చూస్తుందనేది స్పష్టం. అంతకు మినహా మరో నినాదంగాని, విధానంగాని బి.జె.పి.కి లేవు కూడా. అందుకే ఎప్పటికప్పుడు శిలాన్యాస్, కరసేవ, పాదుక పూజ వగైరా రకరకాల పేర్లతో దాన్ని రాజేస్తూ వుంటుంది. రామజన్మ భూమి / బాబ్రీ మసీదు సమస్యపై కేంద్ర కాంగ్రెస్ (ఐ) ప్రభుత్వం అనుసరించిన అవకాశ వాదం బి.జె.పి.కి లాభం కలుగుతుంది. కాంగ్రెస్ పట్ల పెరిగిన వ్యతిరేకతని కూడా ఆ పార్టీ సొమ్ము చేసుకోగలిగింది. బి.జె.పి. పూర్వపు అవతారమైన జనసంఘం 1977లో ఎమర్జన్సీ పట్ల ప్రజల్లో వ్యతిరేకత పెరిగినప్పుడు ఏర్పడిన జనతా పార్టీలో కలసిపోయి కేంద్రంలో, రాష్ట్రంలో కీలకమైన పదవులు సంపాదించింది. తర్వాత దానికే చిచ్చు పెట్టింది. 1989లో మళ్ళీ రాజీవ్ గాంధీ అసమర్థ – అవినీతి పాలనపై ప్రజలలో ఆగ్రహావేశాలు ప్రబలినప్పుడు బి.జె.పి. అలాగే దాన్ని ఉపయోగించుకోగలిగింది. వామపక్షాలు వద్దన్నా వినకుండా నేషనల్ ఫ్రంట్– జనతాదళ్ నాయకులు దానితో ఎన్నికల అవగాహన పెట్టుకున్నారు. ఫలితంగా ఆ ఎన్నికల్లో బి.జె.పి. బలం లోక్‌సభలో 2 స్థానాల నుంచి 89కి పెరిగింది. రెండు రాష్ట్రాలలో స్వయంగాను, రెండు రాష్ట్రాలలో మిశ్రమ సంఘటనగాను అధికారంలోకి రాగలిగింది. కేంద్రంలో మాత్రం వామపక్షాలకు తగినంత బలం వున్నందున వారు బి.జె.పి.కి ప్రభుత్వంలో చోటు చిక్కకుండా చేయగలిగారు. అందుకే 1990 అక్టోబర్‌కల్లా (అంటే ప్రజల తీర్పుకు ఏడాదిలోపలే) మళ్ళీ అయోధ్య అన్నారు అద్వానీ 'రథయాత్ర' అన్నారు. ఆయన రథం వెళ్ళిన ప్రతిచోటా రగిలింది మత కలహాలే. ఈ బెదిరింపులకు లొంగకుండా నిలబడిన వి.పి. సింగ్ ప్రభుత్వాన్ని కూలగొట్టడానికి నేరుగా కాంగ్రెస్‌తో, చంద్రశేఖర్ ముఠాతో చేతులు కలిపారు. పద్మవ్యూహంలో అభిమన్యుల్లా కౌరవ మూకలు చుట్టుముట్టి చంపినట్టే వి.పి. ప్రభుత్వాన్ని కూల్చివేశారు. ఆ విధంగా 1977లో గాని, 1990లోగాని దేశ ప్రజల తీర్పును దారుణంగా

### కృతజ్ఞతలు

అయోధ్య సమస్యపై కేంద్రీకరించి ఈ ప్రత్యేకానుబంధం ప్రచురించాం. ఇందులోని సమాచారం కొంత గతంలో వివిధ రూపాల్లో వచ్చినా, అంతా ఒకచోట వుండటం మంచిదనే ఉద్దేశ్యంతో సంకలనం చేశాం. వివిధ పత్రికలు, వ్యాసాల నుంచి, పుస్తకాల నుంచి ఈ సమాచారం తీసుకోవడం జరిగింది. వాటి రచయితలు, ప్రచురణకర్తలందరికీ మా కృతజ్ఞతలు. నేటి పరిస్థితుల్లో మా ఈ ప్రయత్నం ఏమేరకు ఉపయోగపడినా సంతోషమే. దీనిపై మీ సూచనలు, సలహాలు, విమర్శలు పంపితే భవిష్యత్తులో ప్రత్యేక సంచికల ప్రచురణకు ఎంతైనా మేలు చేసిన వారవుతారు.

–ఎడిటర్.

నమ్ముచేసిన కళంకిత చరిత్ర బి.జె.పి.ది.

1984లో ఏకాత్మతాయాత్రతో మొదలైన ఈ క్రమం అద్వానీ రథయాత్రతో పరాకాష్టకు చేరింది. దేశంలో లౌకిక పార్టీలు ఈ ప్రమాదాన్ని ముందే పసిగట్టి, ఎదుర్కొని వుంటే నేడు ఆర్.ఎస్.ఎస్. కూటమి యింతగా చెలరేగ గలిగేదికాదు. ఏ దశలోనూ వారితో రాజీపడకుండా నిలచిన విశిష్టత దేశంలో ఒక్క సి.పి.ఐ. (ఎం)కు మాత్రమే దక్కిందంటే అతిశయోక్తి కాదు. కాంగ్రెస్ నిరంకుశత్వ వ్యతిరేక పోరాటం ప్రాధాన్యతను గుర్తిస్తూనే మతోన్మాదాన్ని కూడా ఎదుర్కొనే ఎత్తుగడలు పార్టీ అనుసరించింది. జనతా పార్టీని మొదటి బలపరిచినా, 1979లో అందులో జన సంఘం పై చేయి సాధించినప్పుడు పార్టీ విడగొట్టుకోడానికి వెనుకాడలేదు అందుకుగాను సి పి ఐ (ఎం)ను విమర్శించే బూర్జువా పార్టీల మిత్రులు బి.జె.పి. పట్ల తాము అనుసరించిన మెతక వైఖరిని పునః పరిశీలించుకోవడం అవసరం. 1989లో కూడా దానికి అవకాశ మిచ్చింది వారే కాంగ్రెస్ (ఐ) మొదటి నుంచి అవకాశ వాదన్ని ప్రదర్శించింది జనతాదళ్ నాయకులు కూడా దాన్ని దూరంగా వుంచటానికి బదులు ఎన్నికల పొత్తు పెట్టుకుని బలం పెంచారు. తర్వాత దళ్‌లో చంద్రశేఖర్ వంటి విద్రోహులు, నాటి కాంగ్రి నేత రాజీవ్ గాంధీ దానితో నేరుగా చేతులు కలిపారు. ఆఖరుకు 1990 కరసేవ సందర్భంలోనైనా సూటిగా బి జె.పి ని వ్యతిరేకించకుండా, సద్భావనా యాత్ర పేరా నేషనల్ ఫ్రంట్‌పై దాడిచేశారు. వి.పి. సింగ్ ప్రభుత్వంపై కక్ష సాధింపుకు దాన్నే అవకాశంగా తీసుకున్నారు. ఒకనాడు దేశంలో ఏర్పడిన లౌకికవాద ప్రభుత్వాన్ని మతోన్మాదుల, ఫిరాయింపుదారుల సహాయంతో కూలదోసిన కాంగ్రి పాపం చెరిగేది కాదు. ఇప్పుడు ఈ సమస్యపై బి.జె.పి. కాంగ్రి ప్రభుత్వాన్ని ఓడించాలని చూస్తే వామపక్షాలు వ్యతిరేకిస్తాయి తప్ప అలా అవకాశ వాదంతో వాడుకోవు.

ఈనాడు కరసేవకు వ్యతిరేకంగా బి జె పి. యేతర పార్టీలన్నీ కలసికట్టుగా వ్యవహరించినట్టే 1990లో చేస్తే హిందూ మతోన్మాదం యింత



లౌకికతత్వాన్ని పరిరక్షించాలని డిమాండ్ చేస్తూ కొద్ది మాసాల క్రితం
పార్లమెంటు ఎదుట ధర్నా చేస్తున్న వామపక్షాలు, లౌకిక ప్రతిపక్షాల ఎం.పి.లు

పెరిగేదే కాదు. యు.పి.లో బి.జె.పి. ప్రభుత్వ ఏర్పాటు, లోక్‌సభలో ప్రధాన ప్రతిపక్షంగా ఎదగడం సాధ్యమయ్యేదికాదు. ఐక్య కృషిమాట అటుంచి జనతాదళ్ ముక్కలై పోవడంతో లౌకిక పార్టీల ఓట్లే చీలి బి.జె.పి. లాభపడింది.

అయితే ఉద్రేకాలు, ఉన్మాదాలు ఎల్లకాలం నిలబడవు. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో కొన్ని పార్టీలకు అత్యధిక మెజారిటీ నిచ్చే ప్రజలే, ఆ పార్టీల తీరు తెన్నులను బట్టి వ్యతిరేకించడమూ ప్రారంభిస్తారు. ఉదాహరణకు 1984లో రాజీవ్ గాంధీకి 400కు పైగా స్థానాలు వచ్చినా 1987 నుంచి ఆ ప్రభుత్వం తీవ్ర ప్రజా వ్యతిరేకతను చవిచూడాల్సి వచ్చింది అలాగే బి జె పి కూడా తాను అధికారంలో వున్న రాష్ట్రాలలో కాంగ్రి తరహా అపలక్షణాలన్నీ ప్రదర్శించింది అవినీతి, సంఘ వ్యతిరేక శక్తులకు ఆశ్రయం వంటి దుర్లక్షణాలకు తోడు వచ్చి హిందూ మతోన్మాదం, అగ్రవర్ణ దురహంకారం దానికి తోడైనాయి. బి జె పి. పాలిత రాష్ట్రాలలో మతకలహాల ప్రజ్వలన సర్వ సాధారణంగా పరిణమించింది. అవిగాక రాజస్థాన్ వంటిచోట్ల హరిజనులపైనా దాడులు పెరిగాయి. ఎస్.సి., ఎస్.టి. కమీషన్‌కు ఛైర్మన్‌గా పనిచేసి ఫ్యూడల్ శక్తులను తూర్పారబట్టిన మాజీ ఐ ఎ ఎస్. అధికారి ఎస్.ఎస్. శర్మను మధ్యప్రదేశ్‌లోని బస్తర్ జిల్లాలో బట్టలు విప్పించి, అమానుషంగా అవమానించిన ఘటన దేశాన్నే కలచివేసింది. యు.పి లో శాంతి భద్రతలు దిగజారడమేగాక, ఫిలిభిత్ వంటి చోట్ల ఉగ్రవాదం విజృంభించింది. నిర్విరామ రామభజన బి జె.పి. పాలన నిజస్వరూపాన్ని కప్పిపుచ్చలేకపోయింది. ఉప ఎన్నికలలో స్థానిక ఎన్నికలలో చాలాచోట్ల బి జె.పి. దెబ్బతిన్నది. సంస్థాగతంగా కూడా బి.జె.పి లో ముఠా తగాదాలు బహిర్గతమైనాయి. అద్వానీ–జోషిముఠాల తగాదా–గోవిందాచార్య, ఉమాభారతి – సుందర్‌లాల్ పట్వాల మధ్య తగాదాగా బయటకొచ్చింది. ఈసారి కొత్త అధ్యక్షు డెవరనే దానిమీద ముల్లగుల్లాలు సాగుతున్నాయి. ఇప్పుడు అయోధ్య సమస్యను కారణంగా చూపి, పార్టీ ఎన్నికలనే వాయిదా వేయడానికి కూడా కారణమదే!

ఈ తగాదాలు సంఘ పరివారంలో సంఘర్షణను కూడా ప్రతిబింబి స్తున్నాయి. కేవలం వచ్చి మతోన్మాదంతో ఎల్లకాలం చలామణీ కాలేమని వాజ్‌పాయ్ వంటివారు వాదిస్తున్నారని పత్రికలు రాస్తుంటాయి వాజ్‌పాయ్ అప్పుడప్పుడూ వాటిని ఖండించుతున్నా, తీవ్ర అంతరంగిక పోరాటం జరుగుతున్న మాట మాత్రం యదార్థం. అది ప్రస్తుత దర్భంలోనూ వెల్లడైంది. యు.పి. ముఖ్యమంత్రి కల్యాణ్ సింగ్ ఎలాగైనా ప్రభుత్వాన్ని కాపాడుకోవాలని చూస్తుంటారు. అందుకే ఆయన కేంద్రానికి, కోర్టులకు చట్టబద్ధ మైన సమాధానాలే ఇస్తుంటారు. పైకి ఎన్ని కబుర్లు చెప్పినా యు.పి. ప్రభుత్వాన్ని కాపాడు కోవాలనే దుగ్ధ వున్నందునే వి.హెచ్.పి. ఆర్.ఎస్.ఎస్. నాయకులు కూడా తాత్కాలికంగా వెనుక్కు తగ్గినట్లు నటిస్తారు. కొంచెం తెరిపి యిచ్చి మళ్ళీ దాన్నే మరో రూపంలో ముందుకు తెస్తారు. ఇదో విషవలయంగా తయారైంది.

ఉప ఎన్నికలలో దెబ్బతిన్న వెనువెంటనే గత జూలైలో బి జె.పి. కూటమి కరసేవ కార్యక్రమం ప్రకటించింది. యధాతథ స్థితిని కాపాడాలన్న కోర్టు ఉత్తర్వులకు 1991 నవంబర్ 2న ఎన్.ఐ సి. సమావేశంలో ముఖ్యమంత్రి కళ్యాణ్‌సింగ్ యిచ్చిన హామీలకు విరుద్ధంగా వివాదాస్పద స్థలంలో నిర్మాణ కార్యక్రమాలు ప్రారంభించారు. దానిపై వామపక్షాలు, జనతాదళ్ పార్లమెంటు లోపలా, వెలుపలా చాలా ఆందోళన చేసినా బి జె పి – కాంగీల మధ్య దోస్తీ కారణంగా పి వి. నరసింహారావు ప్రభుత్వం గట్టి చర్య

తీసుకోవడానికి నిరాకరించింది. పి.వి. ప్రభుత్వం పట్ల బి జె పి. మొదట్లో చాలా మెతకగా వ్యవహరించి, డిప్యూటీ స్పీకర్ స్థానం దక్కించుకుంది. ఈ ప్రభుత్వం అయిదేళ్ళు కొనసాగుతుందని అద్వానీగారు అమెరికాలో ప్రకటించారు. అయితే కాంగ్రెస్‌లోనే అర్జున్‌సింగ్, మాధవరావు సింధియా, రాజేష్ పైలట్ వంటివారు బి.జె.పి. పట్ల మెతక వైఖరి ప్రమాదమని, దానిపై తీవ్రంగా ధ్వజమెత్తారు. అర్జున్‌సింగ్ ప్రధానికి ఒక బహిరంగ లేఖ కూడా రాశారు. తన ప్రభుత్వ మనుగడ కోసం బి.జె.పి.తో మంచిగా వుండాలనేదే పి.వి. వ్యూహం కాగా, బి.జె.పి. పట్ల మెతగ్గా వుంటే ఉత్తరాదిన మనకున్న పునాది కూడా పోతుందని అర్జున్‌సింగ్ వంటివారి వాదన తాత్పర్యం. అం... కూడా తన వై... కొంత మార్చుకో... తప్పలేదు.

1990లో మొదటి కరసేవతో పోలిస్తే 1991లో రెండ... 'కరసేవ'కే ఊపు బాగా తగ్గింది కిరాయి మనుషులతో కార్యక్రమం జరపాల్సి వచ్చింది సుప్రీంకోర్టు రోజుకో తాఖీదు నిస్తుంటే రాష్ట్ర ప్రభుత్వం ఇరకాటంలో పడింది. కేంద్రం గట్టిగా వ్యవహరించి, వివాదాస్పద స్థలాన్ని అప్పుడే స్వాధీనం చేసుకుంటే సమస్య లేకుండా పోయేది. కా... పైన చెప్పినట్లు పి వి ప్రభుత్వ అవకాశవాద... అందుకు అడ్డుపడి... కరసేవను సాగి... ప్రభుత్వ ఉనికికే ముప్పులేకుండా బయటపడటమెలా అని కళ్యాణ్‌సింగ్ సతమతమవుతుంటే ప్రధాని ధర్మాచార్యులతో చర్చలంటూ జరిపి, మూడు నెలల గడువు సంపాదించినట్లు ప్రకటించి ఆయనకు ఊరట కలిగించారు. తర్వాత జరిపిన రామపాదుక పూజకు పెద్ద స్పందనే రాకపోవడం బి జె.పి కి చాలా ఆందోళన కలిగించింది. వేడి చల్లారనివ్వరాదనే మళ్ళీ ఈ తతంగం ప్రారంభించింది. బి.జె.పి.కి పెద్దబలంలేని దక్షిణాది రాష్ట్రాల నుంచి ఎక్కువ మంది కరసేవకులు వెళ్ళారంటే ఉత్తరదేశ ఊపు తగ్గిందని అర్థమవుతోంది. దక్షిణానికి ప్రమాదమూ పెరుగుతోంది.

కాని గతంలో వలేగాక ఈసారి మొదటి నుంచి ఇదో తీవ్ర రాజకీయ, రాజ్యాంగ సమస్యగా తయారైంది. నవంబరు 23న జాతీయ సమగ్రతా మండలి (ఎన్.ఐ.సి.) సమావేశం అయోధ్యలో పరిస్థితిని అదుపు చేసేందుకు ఏ చర్యనైనా తీసుకొమ్మని ప్రధానికి అధికారమిస్తూ ఏకగ్రీవంగా తీర్మానించి ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించింది. మరోవంక సుప్రీంకోర్టు వివాదాస్పద స్థలంలో నిర్మాణ కార్యక్రమాలను అనుమతించితే రాష్ట్ర ప్రభుత్వ రాజ్యాంగబద్ధత పోతుందని హెచ్చరించింది. ఆ స్థితిలో దిక్కుతోచక తాత్కాలిక తరుణోపాయంగా లాంఛన ప్రాయమైన కరసేవ అని, తప్పించుకున్నారు. అయితే దాన్ని పూర్తిగా నమ్మడానికి లేదని అప్పుడే స్పష్టమైంది. వి.హెచ్.పి. నాయకులు కొందరు ఆ ప్రకటనతో తమకు సంబంధం లేదన్నారు సంఘ పరివారంలో




భిన్నాభిప్రాయాలు తలెత్తాయి. అందుకే అద్వానీ, జోషిలనే నేరుగా రంగ ప్రవేశం చేయమని ఆర్.ఎస్.ఎస్. అధిష్టానం ఆదేశించింది.

## కిం కర్తవ్యం?

రాముడిపై విశ్వాసం న్యాయస్థానాలకు, రాజ్యాంగానికి అతీతమని అద్వానీతో సహా బి జె.పి. నేతలు పదే పదే ప్రకటిస్తున్నారు. కాని వారు ఈ రాజ్యాంగం ప్రకారమే పార్లమెంటుకు, శాసన సభలకు ఎన్నికయ్యారు. ప్రభుత్వాలు ఏర్పాటు చేసేటప్పుడు చట్టానికి కట్టుబడి వుంటామని ప్రమాణ స్వీకారాలు చేశారు. రాజ్యాంగ ప్రకారం అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు ఆదేశాలకు వారు కట్టుబడి వుండక తప్పదు. శాంతి భద్రతలను కాపాడే బాధ్యత కూడా యు.పి. రాష్ట్ర ప్రభుత్వంపై వుంటుంది. కోర్టులకు అతీతమని అన్న తర్వాత అధికారంలో వుండేందుకే దానికి అర్హత వుండదు. కరసేవకు గొడుగుపడితే దాన్ని రద్దు చేయడమూ అనివార్యమవుతుంది. రాజ్యాంగంలోని 356వ అధికరణాన్ని అప్రజాస్వామికంగా వినియోగించడం అనుమతించరానిదే అయినా నగ్నంగా మతోన్మాదాన్ని రెచ్చగొడుతూ, రాజ్యాంగాన్ని ఉల్లంఘించే రాష్ట్ర ప్రభుత్వాలకు దాన్ని వర్తింప చేయాల్సిందే.

అద్వానీ, కళ్యాణ్‌సింగ్‌లు తమ వాక్చాతుర్యంతో అటూయిటూ తిప్పి మాట్లాడవచ్చు కాని పరిస్థితి ఎప్పుడూ వారి అదుపులోనే వుండదు ఇప్పటికే వారు వి.హెచ్.పి చెప్పినట్లు వినక తప్పనిస్థితి వచ్చింది. తుది నిర్ణయం తీసుకునే... పెద్దలు, సన్యాసులనేవారు చెబుతున్నారు. ...తోన్మాదం తలకెక్కించి వేలాది ...ందిని అయోధ్యలో ...పాక ఏదైనా జరగవచ్చు వివాదాస్పద స్థలంలో గతంలో నిర్మించిన ప్లాట్ ఫారం అలాగే వుంది భజనలనో, మరొకటనో అక్కడకు కరసేవకులని చేరుస్తారు ఆ తర్వాత ఏం చేస్తారంటే అప్పుడే చె... అంటున్నారు. ఈ వాగుడు మూతలు, కుయుక్తులను తక్కువ అంచనా వేయడం తగదు. కేంద్రం నిక్కచ్చిగా వ్యవహరించక తప్పదు. తక్షణం అది వివాదాస్పద స్థలాన్ని స్వాధీన పరుచుకోవాలి రాష్ట్ర ప్రభుత్వం గనక చిత్త శుద్ధితో వ్యవహరించకపోతే దాన్ని రద్దుచేసి, తానే పగ్గాలు చేత పట్టాలి. దేశంలోని వామపక్ష లౌకిక పార్టీలన్నీ ఆ మేరకు కేంద్రానికి మద్దతునివ్వాలి. ప్రజానీకంలో కూడా మతోన్మాదుల నిజస్వరూపాన్ని బట్టబయలుచేసి, వారి కవ్వింపు ప్రచారాన్ని తిప్పి కొట్టాలి మన రాజధాని హైదరాబాద్‌తో సహా గతంలో మత కలహాలు ప్రజ్వరిల్లిన అనుభవాలదృష్ట్యా అలాటి స్థితి ఎక్కడా పునరావృతం గాకుండా అప్రమత్తత వహించాలి.

ఆ విధంగా మతోన్మాద శక్తుల సవాల్‌కు యావత్ శాంతికాముక, లౌకిక, దేశభక్తియుత శక్తులు సమైక్య సమాధానమివ్వాలి.

# గతంపట్ల శాస్త్రీయదృష్టి

గతంతో సంవిధానం లేకుండా ఏ సమాజం మనుగడ సాగించలేదు. అంతేకాదు అది అనేక విధాలుగా నేటికీ సజీవ వాస్తవం. సమకాలీన చైతన్యంలో అంతర్భాగంగా కూడా వుంటుంది మన సమాజం లాంటి సమాజాలలో సాంస్కృతిక సంఘర్షణ గల సుదీర్ఘ చరిత్ర వారసత్వంగా వచ్చింది. అందువల్ల తరచుగా చరిత్ర పైన వాదోపవాదాలు జరగడం ఆశ్చర్యమేమీ కాదు. అయితే ఆ వాదోపవాదాలు ఆరోగ్యకరమైన, ఆధునికమైన, సహేతుకమైన సమాజం ఏర్పాటుకు దోహదం చేసేవిగావుండాలి. ఈ నేపధ్యంలో ఇటీవల వివాదాస్పదంగా తయారైన రామజన్మభూమి- బాబ్రీ మసీదు విషయమై గత చరిత్ర మనకు అందజేసిన సమాచారంపైన మనం పునరాలోచించవలసిన అవసరంవుంది

చరిత్రపైన మన అభిప్రాయాలను ఖచ్చితంగా వెల్లడించవలసిన అవసరం గతంలో యింతగా ఏనాడూ రాలేదు. బాబ్రీ మసీదును కూల్చి వేయడంలేదా దాని స్థానం ఎక్కడో గుర్తించాలన్న డిమాండ్ముందుకు వచ్చిన సమయంలో గతంలో జరిగిన దానినంతటినీ విస్మరించవచ్చునన్న భ్రమను కొంతమంది కల్పించారు. అన్ని సమాజాలలోను సమాజపరిణామ క్రమంలో చోటుచేసుకున్న చారిత్రక అనుభవాలు ప్రజల చైతన్యానికి దోహదం చేస్తాయి. చారిత్రక అనుభవాల వారసత్వం వల్లనే నేటి సుసంపన్నమైన, గర్వకారణమైన, విశిష్టమైన సాంస్కృతిక సమాజం ఏర్పడింది

నేడు మన ముందున్న ప్రధాన అంశం ఏమంటే ఈ సుసంపన్నమైన సాంస్కృతిక వారసత్వాన్ని మొత్తంగా పరిరక్షించుకోవడమా లేక అందులో కొంత నాశనం చేసి తక్కిన దాన్ని రక్షించుకోవడమా అన్నది ప్రధానమైంది. చారిత్రక అనుభవాలనే వాటిలో భయంకరమైనవి ఉన్నప్పటికీ వాటికి విలువ వుంటుంది. ఏ సమాజమైనా గత చరిత్రను అందులో జయాలు, అపజయాలు ఎన్నివున్నప్పటికీ నెమరు వేసుకోకపోతే అది చాలా పేలవంగా తయారవుతుంది చారిత్రక అనుభవాలను మనం పరిశీలించి చరిత్ర పట్ల ఎలాంటి అవగాహన కలిగివుండాలి, ఏఏచారిత్రక అంశాలను నేటి సమాజంలో అంతర్భాగం చేసుకోవాలని నిర్ణయించుకుంటాము. బాబ్రీ మసీదు వివాదం విషయంలో ఈ ప్రశ్న ప్రధానమైనదని నేను భావిస్తున్నాను.

ఈమౌలికమైన అంశం అజెండాకు ప్రాతిపదికగా లేకపోవడంతో యిటీవల జరిగిన చర్చలు విఫలమయ్యాయి. ఈ వివాదాస్పదమైన అంశంపై అజెండా రూపొందించిన వి హెచ్ పి, బి ఎం.ఎ సి లు రెండూ మతతత్వ సంస్థలు. తామే హిందువులకు, ముస్లింలకు ప్రతినిధులుగా చెప్పుకుంటూ విర్రవీగుతునాయి. వీరు గత చరిత్రలోని మతతత్వాన్ని మాత్రమే పంటబట్టించుకున్నారనిపిస్తుంది. తానుబట్టిన కుందేటికు మూడేకాళ్ళు అన్న చందంగా పిడివాద చరిత్రను పరిరక్షించాలన్న ఏకైక లక్ష్యంగా వున్నదని చర్చల వల్ల తెలిసింది. అందువల్లే ముందు వూహించినట్టుగానే చర్చలు విఫలమయ్యాయి. విఫలంకాకపోతేనే ఆశ్చర్యపడాలి. చర్చలు విజయవంతమవుతాయని ఎవరూ వూహించలేదు. చర్చలలో తాము తీసుకున్న


కె.ఎన్.ఫణిక్కర్
చరిత్రప్రొఫెసర్, జె.ఎన్.యు.

నిర్ణయాలనుంచి ఎవరూ ప్రక్కకు తప్పుకోలేదు. వివాదాస్పద స్థలంలో ఆలయం వుందని చెప్పడానికి చరిత్ర ఆధారంవుందని నిరూపించేందుకు వి.హెచ్.పి. యత్నించగా, బి.ఎం.ఎ.సి. దాన్ని తిరస్కరించింది. ఇరుపక్షాలవారు చూపిన చారిత్రక సాక్ష్యాధారాలు చేసిన వాదనలు రుజువుకాలేదు. బహుశా వి.హెచ్.పి గాని, బి.ఎం.ఎ సి.లు గాని సాక్ష్యాలు నిరూపించబడగలవని కూడా ఆశించివుండవు.

వివాదాస్పద ప్రాంతానికి సంబంధించి బయటపెట్టిన చారిత్రక అంశం ఎంతో ఆశ్చర్యకరమైందిగా వుంది. చరిత్రలో ఏదైనా ఒక అంశానికి పరిష్కారం కావాలనుకున్నప్పుడు ఏదో ఒక నిబద్ధతకు కట్టుబడిన పంధాను అనుసరించాలి. నిజానిజాలను తెలుసుకుని తమ అభిప్రాయాలను వెల్లడించ వలసిందిగా కోరుతూ ప్రముఖ చరిత్రకారులు,భారతీయ చారిత్రక పరిశోధనామండలి సభ్యులు లేదా ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్సభ్యులతో ఒక కమిటీని వేసి వుండవలసింది. అయితే ప్రతి వ్యక్తి ఈ సమస్య పరిష్కారానికి చరిత్ర ప్రధానమైంది కాదని విశ్వసిస్తున్నారు. వి.హెచ్.పి. నాయకులు అనేకసార్లు రామజన్మభూమి చారిత్రక సత్యంపై ఆధారపడేదికాదని కేవలం విశ్వాసంపై మాత్రమే ఆధారపడేదని అనేకసార్లు చెప్పారు. అయితే అంతకుముందు రాముడి ఆలయం అక్కడేవుందన్న విషయం చర్చకు వీలులేని చారిత్రక సత్యమని అనేకమార్లు వాదించారు మరికొంతమంది. ఎప్పుడో జరిగినదాన్ని యిప్పుడు చర్యతీసుకునేందుకు మార్గదర్శకంగా తీసుకోరాదని చాలా చక్కగా తిరస్కరించారు చరిత్ర అనేక విధాలుగావుంటుంది. అందువల్ల దీనికిది ఖచ్చితమైన ఆధారం అనిచెప్పడానికి వీలుకాదు

అయినప్పటికీ చర్చలలో పోటీపడి మరీ చారిత్రక సత్యాలను సమావేశం ముందుంచారు వివాదాస్పద స్థలంలో రామాలయంవుందని చెప్పడానికి వి.హెచ్.పి. తన దృష్టినంతా కేంద్రీకరించింది. గతంలో ప్రభుత్వానికి సమర్పించిన సాక్ష్యాధారాలు మాత్రమేగాకుండా యిప్పుడు పురాతత్వ, సాహిత్య, న్యాయపరమైన, రెవెన్యూ సంబంధమైన సాక్ష్యాలను తమస్థానాన్ని మరింత పదిలపరచుకునేందుకు వి.హెచ్.పి సమర్పించింది. ఆప్రదేశంలో కొత్త సాక్ష్యాన్ని 'కనుగొన్నట్టు'గా చెపుతూయిప్పుడు కరసేవకులు పురాతత్వ శాస్త్రవేత్తలయ్యారు. 1949లో మసీదులో రామశిలను స్థాపించేందుకు అనుసరించిన ఎత్తుగడను అనుసరించేందుకే యిప్పుడు కూడా ప్రయత్నంచేస్తున్నారు అసలు యిప్పుడు వీరి వుద్దేశ్యం స్పష్టంగానేవున్నది సాక్ష్యం కాకతాళీయంగా బయటపడిందని నిరూపిస్తే అది ప్రతిపక్షాల ఆగ్రహానికి గురికాకుండావుంటుందని, ఆలయం సమస్య సులభంగా పరిష్కారం అవుతుందని వీరు భావిస్తున్నారు.

అయితే కరసేవకులే త్రవ్వకాలు జరపడాన్ని, వారు కనుగొన్న అంశాల చెల్లుబాటును పురాతత్వశాస్త్రవేత్తలు ప్రశ్నిస్తున్నారు.

చారిత్రక ఆధారాలకు సంబంధించి అనేక ప్రశ్నలు తలెత్తాయి. వి.హెచ్.పి. భావించినట్టుగా అవి అంత సులభంగా పరిష్కారమయ్యేవికావు ఆలయానికి సంబంధించిన పరికరాలు, ఆప్రదేశం, ఆలయవిధ్వంసానికి సంబంధించి శిధిలాలు- వీటిచుట్టే వి.హెచ్.పి.వాదనలు సాగాయి. ఒక ప్రవేశంలో ఆలయ శిధిలాలు వున్నట్టు చూపించడంతోనే సాక్ష్యం పూర్తికాదు ఒక

(మిగతా ఆరవ పేజీలో)

# దండోరా!

పిల్లలను, తల్లులను
ప్రేయసీ ప్రియులనే
మొండాలుగా నరికి
మురియు మతవైరాలు
మారణపు క్రూర్యాలురా!
అది,
మతమన్న నగుబాటురా!
క్రూరముగ చెలరేగి
కొల్లగాని సంపదలు
నిప్పుపాలేజేయు
నేరస్థుడెవడైన
దైవప్రతినిధి గాడురా!
తలచి,
దానవత్వపు పీడరా!
ఆవేశమున మనిషి
అవరాడు మృగముగా
భారతావనిలోన
బడబానలము రేపి
బాముకొనగలమేమిరా!
మనము,
ప్రగతికుంటు పడునురా!
బడబారిన నరుని
గుండెలో నెనరునకు
చోటు గనరాబోదు
మోటు దనమేదప్పు
ఏ మతము జెప్పిందిరా!
చూడ,
ఏనీతి నేర్పిందిరా!
ఒక్కొక్కనికి శివము
ఎక్కించి బరిమీద
దొమ్మిం కుసిగొల్పు
దుష్టశక్తుల బట్టి
పట్టి పల్లార్చాలిరా!
ఇప్పుడు,
ప్రజల గాపాడాలిరా!
నవనవోన్మేషముగు
నందనమ్మును పూడ్చ
కసిరేపి జంతువులు
గాజేయు క్రౌర్యమ్ము
ఏ ధర్మ నిర్ణయమురా!
ఇది,
ఏ ప్రవక్తల బోధరా!
మనిషి మనిషిగా
మలచినప్పుడె మతము
జగతి వర్ధిల్లునని
చాటి చెప్పగవలయు
దృఢముగా అడుగేయరా!
నేడు,
తడబడిన పెనుకీడురా!
అందాల హరివిల్లు
అవని మనదేశమ్ము
కుటిల మతులైదిని
కూలద్రోయగరాదు
రక్షింపుకొనవలయురా!
జగతి,
రాజిల్లు మనకీర్తిరా!

**-రావెళ్ళ**

## శాస్త్రీయ దృష్టిని ప్రదర్శించాలి

(ఐదవ పేజీ తరువాయి)

ఆలయానికి సంబంధించిన శిధిలాలు యితర ప్రాంతాలకు తీసుకు వెళ్ళడం,లేదా ఆశిధిలాలను యితర నిర్మాణాలలో వినియోగించుకోవడం చాలాసాధారణంగా జరుగుతూ వుంటుంది. అనేక ఆలయాలువున్న అయోధ్యలాంటిచోట యిది సాధారణమైన అంశం. పైగా ఆలయాన్ని కావాలని కూల్చివేశారని చెప్పడానికి వీలులేదు. కొన్ని ఆలయాలు వాటంతట అవే కూలిపోతాయి. లేదా పరిరక్షించలేక కొన్ని శిధిలమై పోతాయి. మరోమాటలో చెప్పాలంటే అక్కడే ఆలయం వుందని చెప్పడాన్ని మసీదుకు సంధానం చేయవలసిన అవసరం లేదు. ఒకవేళ కరసేవకులు చెపుతున్నట్టుగా సాక్ష్యాన్ని పరిగణనలోకి తీసుకున్నప్పటికీ అది వి.హెచ్.పి వాదనను నిరూపించడంలేదు.

తాము సమర్పించిన సాక్ష్యాధారాలతో వి హెచ్.పి, బి.ఎం.ఎ.సి.లు ఒక అంగీకారానికి రాలేకపోతే అప్పుడు ఎవరు నిర్ణయం తీసుకోవాలి. రామాలయం స్థావరంపై తీర్పుకోసం సుప్రీంకోర్టుకు ఏకాంశ ప్రతిపాదన చెయ్యాలని యిటీవల వచ్చిన ప్రతిపాదనకు ప్రధాని శ్రీ పి.వి.నరసింహారావు ఆశీర్వాదం వున్నట్టుగా భావించ బడుతున్నది. కోర్టు అభిప్రాయాల ప్రాతిపదికగా ప్రభుత్వం తన నిర్ణయం తెలియజేయవచ్చు. ఆవిధంగా కోర్టును ఆశ్రయిస్తే దానిపర్యవసానాలు ఏమిటి? ఇందులో రెండు విధాలుగా జరిగే అవకాశంవుంది. మొదటిది వి.హెచ్.పి.కి అనుకూలంగా తీర్పురావచ్చు. అప్పుడువి.హెచ్.పి. 400 సంవత్సరాలుగావున్న నిర్మాణాన్ని తొలగించి నూతన ఆలయం నిర్మించే అవకాశంవుంది. అలా గాకుండా ఆలయం అక్కడ వుండేది కాదని తీర్పు చెప్పినట్లయితే 1949 నాటికి ముందున్న మసీదు స్థానాన్ని పునరుద్ధరించాలి. అప్పుడు రామశిలను మసీదునుంచి తొలగించాలి. వివాదంపడుతున్న రెండు పక్షాలకు ఈ అంశాలు సమ్మతమేనా? వి.హెచ్.పి ఈ సూచనను తిరస్కరించింది. ఎల్.కె.అద్వానీ తిరిగి 'విశ్వాసం' అంశాన్ని మళ్ళీముందుకు తెచ్చారు. ఈ సూచన పట్ల వి.హెచ్.పి ప్రతిస్పందన దాని ద్వంద్వ విధానాన్ని తెలియజేస్తున్నది. విస్తృత ప్రచారం లభించిన 'చర్చలు' ఒక పెద్ద ప్రహసనంగా తయారయ్యాయి. చర్చలలో తమ వాదనను బలపరచుకునేందుకే వి.హెచ్.పి ప్రతిచర్యను(ప్రతిపేజీని) వినియోగించు కున్నది. తాము చెపుతున్న చారిత్రక సాక్ష్యాన్ని బలపరిచే వాదనలనే వి.హెచ్.పి. వినిపించింది పైగా తాము కనుగొన్నట్టుగా చెపుతున్న చారిత్రక ఆధారాలకు తమ 'నిపుణులను' మినహా మరెవరినీ వి.హెచ్.పి. అంగీకరించడంలేదు. చివరకు తమమాటే నెగ్గాలనిపట్టుబడుతున్నారు. అయితే ఈ విషయంలో బి.ఎం.ఎ.సి. వైఖరిని ప్రశంసించాలి. అది కోర్టు తీర్పుకు కట్టుబడి వుంటానని చెపుతున్నది.

వలసపాలకుల వలె వి.హెచ్.పి భారతదేశ గతాన్ని మత ప్రయుక్త ప్రాంతాలుగా విభజించి చూడాలని చూస్తున్నది. జేమ్స్‌మిల్ చరిత్రను హిందూ, ముస్లిం చరిత్రలుగా విడగొట్టారు వి.హెచ్.పి సైద్ధాంతిక ప్రవక్త వీర్‌సావర్కర్ భారతదేశ చరిత్రను ఇతరులపైన, హిందువులపై పోరాటంగా చిత్రీకరించారు. అంతేకాదు చివరకు జాతీయ ఉద్యమం కూడా బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా హిందువులు జరిపిన పోరాటంగా ఆయన చిత్రీకరిస్తున్నారు.

ఇలా చరిత్రను నిర్వచించడం వెనుకగల వుద్దేశ్యం సుస్పష్టమే. భారతదేశ గతం హిందూ చరిత్రగా సృష్టించడమే ఆయన వుద్దేశ్యం. చరిత్ర అంతా హిందూకాదు భారత చరిత్రకాదు, వీటిని వదలివేయాలి. ఆభారతీయ గతాన్ని చెప్పడానికి చిహ్నంగానే బాబ్రీమసీదు వద్ద కరసేవ తలపెట్టారు. వి.హెచ్.పి. నిర్వచనానికి విరుద్ధంగా బి.ఎం.ఎ.సి. ముస్లింల వాదనను వినిపించడం సహజం.

గతానికి సంబంధించిన పరస్పర విరుద్ధ, భిన్నమైన అభిప్రాయాలు, యిప్పుడు బాబ్రీమసీదుకు సంబంధించి వెలిబుచ్చుతున్న అభిప్రాయాలు గతంపైన వాదప్రతివాదాలకు దారితీశాయి. ఇప్పుడు కూడా రెండు పక్షాలకు పిడివాదనలు చేసే హక్కు లేదు. 11వ శతాబ్దినాటికి ఆలయానికి, రామజన్మస్థానానికి వి.హెచ్.పి. ఎలా వారసురాలవుతుంది? అలాగే 16వ శతాబ్దినాటి మసీదుకు బి.ఎం.ఎ.సి. ఎలా పరిరక్షకురాలవుతుంది? వీరి నాయకులు రెండు మతాలకు సంబంధించిన నాయకులు కారు. వివాదాస్పద స్థలంపైన వీరికి ఎలాంటి హక్కువుంది? వీరు చెప్పుకుంటున్నవన్నీ నిజంగా హిందువులు, ముస్లింలకు సంబంధించిన మొత్తం సాధారణ పురాతత్వ అంశాలలో భాగమే. వీటిపైన ప్రతి వారికి హక్కువుంది. అవి జాతీయ సంపద. ప్రజల ఉమ్మడి సంపదపైన వీరు తర్జనభర్జనలు చేస్తున్నారు. అందువల్ల ప్రభుత్వం ఈ సంస్థల, పార్టీల వత్తిళ్ళకు లొంగకుండా ప్రజల హక్కులను పరిరక్షించాలి.

## మైనారిటీలపై మతోన్మాదుల ప్రచారం

# అబద్ధాలు – అసలు నిజాలు

ప్రశ్నలు

జవాబులు

**ప్రశ్న: భారత దేశంపై దండయాత్రలు జరిపినపుడు, తర్వాత ఆక్రమించి పాలించినపుడు ముస్లిం రాజులు హిందూ దేవాలయాలను నాశనం చేసి, సంపదలు కొల్లగొట్టిన మాట నిజం కాదా?**

**జవాబు:** కాదు. రాజ్యాల విస్తరణ కోసం జరిగిన యుద్ధాలలో భాగంగా ఒక మతంవారు మరో మతం వారుఎక్కువగా వుండే దేశాలపై దాడులు చేశారు. అదే విధంగా యవనులు, అరబ్బులు, పోర్చుగీసు, డచ్చి, బ్రిటిష్‌వారు మన దేశంపైకి వచ్చారు. దీనికీ మతానికి సంబంధంలేదు. ఆమాటకొస్తే మన ఆర్.ఎస్.ఎస్. సోదరులు ఘనంగా కీర్తించే ఆర్యన్ సంస్కృతికి మూల పురుషులైన ఆర్యులు ప్రస్తుతం అతి ఛాందస ముస్లిం దేశంగా వున్న ఇరాన్ నుంచే వచ్చారు! 2 ముస్లిం సుల్తానులు మన దేశం మీద దాడి చేసిన కాలంలోనూ, రాజ్య విస్తరణ కాలంలోనూ కొంత హింస, దేవాలయాల విధ్వంసం జరిగిన మాట నిజమే. కాని వాటిని అతిగా చిత్రించడం తప్పు. రెండు భిన్న సంస్కృతులు మొదటిసారి ఎదురైతే కొంత ఘర్షణ తప్పదు. ఆర్యులు కూడా సింధూనది మైదాన ప్రాంతాల ప్రజలను దాస్యులని పిలిచారు. అనేక విధాల దూషించారు. హిందువులపై ముస్లింరాజులు "జిజియా పన్ను" విధించినట్లే ఇతర మతాలవారిపై హిందూ రాజులు కూడా విధించారు. శశాంకుడి వంటి రాజులు బౌద్ధ ఆరామాలను దేవాలయాలుగా మార్చారు 11-12శతాబ్దంలో చాలా రాజులు జైనమందిరాలను నాశనం చేసి, వారిపై తలపన్ను విధించారు. కనుక ఇది హిందూ-ముస్లింల సమస్య కాదు. చరిత్రలో ఒక దశ మాత్రమే.

3 దేవాలయాలు దోచుకున్న వారిలో హిందూ రాజులు వున్నారు. అత్యవసరమైతే రాజు ఆలయాలు, ధర్మ సంస్థల ధనాన్ని తీసుకోవచ్చని కౌటిల్యుడు అర్థశాస్త్రంలోచెప్పాడు. హర్ష చక్రవర్తి రాజ్యంలోని దేవాలయాల సొత్తు దోచుకోడమే గాక, వెండి, బంగారు దేవతా విగ్రహాలను కరిగించి వాడుకున్నాడని కల్హణుడు "రాజ తరంగిణి"లో రాశాడు.

4. ఈ యుద్ధాలలో హిందూ రాజుల కింద ముస్లిం సైనికులు, సైన్యాధికారులు, ముస్లిం సైన్యంలో హిందువులు పాల్గొన్నారని మరిచిపోరాదు. ఆలయాల దోపిడీలో ఈ హిందువులూ పాల్గొనేవారు. 1579లో గోల్కొండ నవాబు సేనాధిపతిగా వున్న మురహరిరావ్ అనే మరాఠీ బ్రాహ్మణుడు అహోబిలంలోని నరసింహస్వామి ఆలయం దోచుకున్నట్లు చారిత్రకాధారాలు చెబుతున్నాయి. అసలు ఆలయాలపై కన్ను పడడానికి మూల కారణం వాటిలో గల ధన, కనక వస్తువాహనాలేగాని మత కక్షకాదు. ముస్లిం మసీదులు సాదాగా వుంటాయి గనుక వాటినెవరూ పట్టించుకోలేదు. ఆలయాల విధ్వంసం కొన్ని సార్లు జరిగిన తర్వాత ముస్లిం పాదుషాలు ప్రత్యేక జాగ్రత్తలు తీసుకున్నారు ఒక్క ఔరంగజేబు మాత్రమే మతోన్మాదం ప్రదర్శించారు. హిందువులు ఢిల్లీ సుల్తానుల భవనాల ముందు నుంచే వెళ్ళి తను స్నాన సంధ్యాదులు పూర్తి చేసుకుని వచ్చేవారట.

చివరగా – ఒకవేళ చరిత్రలో కొన్ని తప్పిదాలు జరిగాయని అనుకున్నా వాటిని సరిదిద్దే పేరుతో ఇప్పుడు చిచ్చు పెట్టడం తప్పే అవుతుంది.

**ప్రశ్న: అందరికి కలిపి మానవ హక్కుల కమీషన్ పెట్టే బదులు మైనారిటీ కమీషన్ ఎందుకు?**

**జవాబు:** ఈ అంశంపై బి జె పి చాలా తప్పుడు ప్రచారం చేసింది. ఉత్తర ప్రదేశ్‌లోనైతే రాష్ట్ర మైనారిటీ కమీషన్‌ను రద్దు చేసింది. పైకి సత్యంగా కనిపించే ఈ వాదన నిజానికి పూర్తిగా తప్పు. మైనారిటీలను బుజ్జగించే విధానాలు

మనం అనుసరిస్తున్నామని బి జె పి.వారు చెబుతుంటారు. "మైనారిటీయిజం" అనేది అద్వానీకి ప్రీతిపాత్రమైనమాట. ఈ మాట కనిపెట్టింది గోపాల్‌సింగ్ అనే ఆయన. సింగ్ ఈ మాటను వాడిన సందర్భం వేరు ఆయన అధ్యక్షతన గల ఉన్నత స్థాయి కమిటీ మైనారిటీల హక్కులపై పరిశీలన జరిపి పెద్ద నివేదిక నిచ్చింది దేశంలో మైనారిటీల హక్కులు ఎలా ఉల్లంఘించబడుతున్నాయో దానిలో పేర్కొన్నారు 1990లో నేషనల్ ఫ్రంట్ అధికారంలోకి వచ్చే వరకు ఆ నివేదిక వెలుగు చూడలేదు. మైనారిటీ కమీషన్‌ను నియమించిన జనతా ప్రభుత్వంలో అద్వానీ, వాజ్‌పాయ్ సభ్యులని కూడా మరచిపోరాదు

కాని తర్వాత వారే మైనారిటీల హక్కులంటే ప్రత్యేక సదుపాయాలన్నట్లు, సమానత్వ సూత్రానికి విరుద్ధమన్నట్లు ప్రచారం చేస్తున్నారు. కాని ఆధునిక రాజ్యాంగ సూత్రాల ప్రకారం మైనారిటీల హక్కుల రక్షణ అనేది సమగ్ర మానవ హక్కుల రక్షణలో భాగమే. పౌర, రాజకీయ హక్కులకు సంబంధించిన అంతర్జాతీయ ఛార్టర్ "జాతి, మత, భాషాపరమైన మైనారిటీలు వున్నచోట్ల ఆ వర్గానికి చెందిన వారి హక్కులు నిరాకరించరాదు" అని చెబుతున్నది "వారు తమ సంస్కృతిని అనుభవించడానికి, తమ మతాన్ని ప్రచారం చేసి, ఆచరించడానికి, తమ భాష తాము వాడుకోవడానికి సమాజంలో ఇతరులతో సమానమైన హక్కు కలిగి వుండాలి" అని కూడా అది చెబుతోంది 1979 మార్చి 27న ఇండియా ఈ ఛార్టర్‌ను బేషరతుగా ఆమోదించింది ఆ ప్రకారం ప్రతి ఏటా అంతర్జాతీయ మానవ హక్కుల కమీషన్‌కు నివేదికలు సమర్పిస్తుంది. నిజానికి మన రాజ్యాంగంలోని 25, 26,29,30 అధికరణలు మైనారిటీలకు ఈపూర్తి హామీలు ఇస్తున్నాయి. ఈ మైనారిటీలకు ఇచ్చిన ఈ హక్కులను కాపాడటానికి గట్టి చర్యలు చేపట్టడం పోయి, ఆ ప్రత్యేక హక్కులే హుళక్కి చేయాలనటం మతోన్మాద ఫలితమేగాని ం. రొకటి కాదు ఈ దేశంలో

వున్న ప్రతివారూ హిందూ ధర్మాన్ని అనుసరించాలని చెప్పేవారు మైనారిటీ మతం హక్కులెలా గుర్తిస్తారు? కాని, పంజాబ్‌లో సిక్కులకన్నా, కాశ్మీర్‌లో ముస్లింలకన్నా హిందువులు మైనారిటీలుగా వున్నారని మరువరాదు. ఇదిగాక చాలా గల్ఫ్ దేశాల్లో భారతీయులు స్థిరపడ్డారు. పాకిస్తాన్‌లో చాలా మంది మిగిలిపోయారు. అమెరికాలోనూ వున్నారు. ఇక్కడ మైనారిటీల పట్ల మన ప్రవర్తన అక్కడ వారిపట్ల ప్రవర్తనను ప్రభావితం చేస్తుందనే స్పృహే బి.జె.పి.కి లేదు. పైగా పాకిస్తాన్‌లో కన్నా, చాలా అరబ్ దేశాలలో కన్నా ఎక్కువమంది ముస్లింలు మన దేశంలో వున్నప్పుడు మైనారిటీలుగా వారి హక్కులు నిరాకరించడం, వారు మెజారిటీనే అనుసరించాలనడం అర్థరహితం.

**ప్రశ్న : ముస్లిమ్‌లు కుటుంబ నియంత్రణ పాటించకుండా తమ జనాభా పెంచుకుంటూవుండే, హిందువుల సంఖ్య తగ్గిపోవడం లేదా?**

జవాబు: ఆర్.ఎస్.ఎస్. పరివారం ప్రచారం యిటో ప్రధానాంశం. 1991లో వారు పంచిన ఒక విధాన పత్రంలో ముస్లింలకు బహుభార్యత్వాన్ని అనుమతించినందువల్ల వారి జనాభా పెరుగుతోందని రాశారు. దేశ విభజన నాడు 2.5 కోట్లు వున్నా ముస్లింల సంఖ్య ఈనాడు 10 కోట్లకు చేరిందని, హిందువుల జనాభా రెట్టింపు మాత్రమే పెరిగిందని రాశారు. 1991 సెప్టెంబర్ 22న మరో హిందూ మతోన్మాద సంస్థ "హిందూ మున్నాని" కూడా యిలా కరపత్రాలే మద్రాసులో పంచింది. వి.హెచ్.పి. బొంబాయిలో పంచిన ఒక కరపత్రంలో ముస్లింలు "మేము అయిదుగురం (భర్త+నలుగురు భార్యలు), మాకు 25 మంది పిల్లలు" అని చెబుతున్నట్లు రాశారు. ఇవన్నీ నిజం కాదని జనాభా లెక్కలు చెబుతున్నాయి.

జనాభా గణాంకశాఖ లెక్కల ప్రకారం దేశ విభజనకు ముందు ముస్లిం జనాభాలో 4 2 కోట్లు. 1951లో తీసిన మొదటి జనాభా లెక్కల్లో వారి జనాభా 3.5 కోట్లు. 1981కి అది 7 6 కోట్లకు (81 శాతం) పెరిగింది. ఈ కాలంలో హిందువుల జనాభా 23.8 కోట్ల నుంచి 55 కోట్లకు (131 శాతం) పెరిగింది. తాజాగా 1991లో వచ్చిన లెక్కల ప్రకారం చూసినా రెండు మతాలవారి పెరుగుదల రేటులో పెద్ద



దేశ విభజన సమయంలో మత కల్లోల ఫలితంగా తరలి వెళ్తున్న ప్రజానీకం

మార్పులేదని తేలింది. గత 80 ఏళ్ళలో ఎన్నడూ హిందువుల జనాభా 75 శాతం కంటే తగ్గలేదని, ముస్లింల జనాభా 15 శాతం మించలేదని లెక్కలు చెబుతున్నాయి. ఇంకో 25 ఏళ్ళ తరువాతకు అంచనాలు వేసి చూసినా వారు దేశ జనాభాలో 13.55 శాతం మాత్రమే వుంటారు. 350 ఏళ్ళు గడిచినా ముస్లిం జనాభా మెజారిటీగా మారే అవకాశం లేదని గణాంక శాస్త్రజ్ఞులు గట్టిగా చెబుతున్నారు. ఇక బహుభార్యత్వం ఏ మతంలోనూ మంచిది కాదు. ఇది ముస్లింలకే పరిమితం కాదు. 30 ఏళ్ళ లెక్కలు (శాతాలలో) చూస్తే బహుభార్యత్వం ఎవరిలో ఎక్కువో తెలుస్తుంది.

| | 1931-41 | 41-51 | 51-61 |
|---|---|---|---|
| హిందువులు | 6.79 | 7 15 | 5 06 |
| ముస్లింలు | 7.29 | 7 06 | 4.31 |

ముస్లింలలో జననాల రేటు ఎక్కువగా వుండటానికి కారణం వారి పేదరికం, ముస్లిం మహిళల నిరక్షరాస్యతతో ముడిపడి వుంది" అని ప్రముఖ సామాజిక, గణాంక శాస్త్రజ్ఞుడు ఆర్.హెచ్. చౌదరి చెప్పారు. మామూలుగా కూడా కుటుంబ నియంత్రణకు, ఆర్థిక సాంస్కృతిక వికాసానికి సంబంధముంటుందనేది సామాజిక శాస్త్రజ్ఞులు, జనాభా అధికారులు అంగీకరించిన సత్యమే. అయినా దేశ జనాభా పెరుగుదల రేటు తగ్గనందుకు బాధపడాలిగాని, ఒక మతంవారో, కులంవారో పెరిగారని బాధపడటం మానవసత్యమా?

**ప్రశ్న: మైనారిటీ అయిన ముస్లింలపట్ల బుజ్జగింపు, మెజారిటీ అయిన హిందువుల పట్ల నిర్లక్ష్యం సమంజసమా?**

జవాబు : ఈ దోపిడీ వ్యవస్థ, పెట్టుబడిదారీ ప్రభుత్వం పాలన మొత్తం ప్రజలందరినీ కష్టాల పాలు చేశాయని చెప్పకుండా మతపరంగా చీల్చి చెప్పడం పీడిత ప్రజలను దారితప్పించే ప్రయత్నం మాత్రమే. ఉన్నంతలో కూడా ముస్లింలే వెనుకబడి వున్నారని లెక్కలు చెబుతున్నాయి. హిందువులలో దారిద్ర్య రేఖకు దిగువన వున్నవారు 34.8 శాతం, ముస్లింలలో 52.1 శాతం వున్నారు. హెకోర్టు కంటే తక్కువ భూమి గలవారు హిందువులలో ప్రతి వెయ్యిమందికి 539 మంది, ముస్లింలలో 647 మంది వున్నారు. హిందు పురుషులలో 25 3 శాతం, స్త్రీలలో 42.2 శాతం నిరక్షరాస్యులుంటే ముస్లింలలో ఆ సంఖ్య 42.4 శాతం 59 6 శాతంగా వుంది. ప్రతి 1000 మంది హిందువులలో 467 మంది ఉద్యోగాలలో వుంటే, ముస్లింలలో 289 మందే వున్నారు. ఐ.ఎ.ఎస్. అధికారులలో ముస్లింలు నూటికి ముగ్గురు మాత్రమేనని లెక్కలు చెబుతున్నారు.

ఈ వ్యవస్థలో అన్నిమతాల వారు వెనుకబడి వున్నారని గ్రహించి, దాన్ని మార్చడానికి ఐక్యంగా కృషి చేయడమే కర్తవ్యంగాని మతాల మారణహోమం రగిలించడం కాదు.

–హరిశ్చంద్ర

# భారత రాజకీయరంగంలో బిజెపి పెరుగుదలకు కారణాలు

## సిద్ధాంత, రాజకీయ పరిశీలన

భారతీయ జనతాపార్టీ స్వభావాన్ని పేర్కొనడంతోనే ఆపార్టీపై ఎటువంటి చర్చనయినా ప్రారంభించాలి 1986నుండి ఆపార్టీ మెజారిటీ హిందూ మతతత్వాన్ని గట్టిగా పట్టుకున్నది. మార్క్సిస్టు పరిభాషలో [illegible] స్వభావాన్ని నిర్వచించేందుకు కేవలం ఆపార్టీ మతతత్వం గురించి పేర్కొంటేనే చాలదు. ఒక సమయంలో బి.జె.పి.ని చాలమంది విశ్లేషకులు చెబుతున్నట్లుగా మధ్యే మితవాద జాతీయ పార్టీ అనడం కూడా సరికాదు

బి జె పి ఖచ్చితంగా ఒక మితవాద పార్టీ దానికి ప్రత్యేకమైన అభివృద్ధి నిరోధక మతతత్వ వేదిక ఉంది. బి.జె.పి. సాధారణ మితవాద పార్టీలకు భిన్నమైనది. ఇటువంటి పార్టీలు పాలక వర్గ ప్రయోజనాలను బహిరంగంగా సమర్థిస్తూ, యథాతథ పరిస్థితిని పరిరక్షిస్తూ ఉంటాయి. ఇతర పాలక వర్గ పార్టీలు తమ వర్గ ప్రయోజనాలను ఇంత నగ్నంగా బహిరంగ పరచవు. సంక్షేమ రాజ్యంలాంటి సోషల్ డెమోక్రటిక్ పరిష్కారాల మాటున తమ వర్గ స్వభావాన్ని దాచుకుంటూ కార్యక్రమాలను రూపొందిస్తాయి.

సాధారణ మితవాద పార్టీలకు, నయామితవాద పార్టీలకు మధ్య ఒక తేడా వుంది. నయా మితవాద పార్టీలలో 'అతివాదం' ఉంటుంది. ప్రజా బాహుళ్య రాజకీయాలను చేపడతాయి. ప్రజా ఉద్యమాలను ప్రారంభిస్తాయి. సాధారణ మితవాద పార్టీల పరిధిని అతిక్రమించి ప్రస్తుత సమాజ పరిస్థితిని విమర్శిస్తుంటాయి. ఇటువంటి పార్టీలు చేపట్టే ప్రజా బాహుళ్య రాజకీయాలను అభివృద్ధి నిరోధక- పిడివాద వేదిక ప్రధానంగా నడిపిస్తుంది ఇతర జాతి, లేదా మతానికి చెందిన వారే సమాజంలోని సమస్యలన్నింటికీ బాధ్యులంటూ వారిని 'శత్రువు'గా పేర్కొని, వారిని లక్ష్యంగా పెట్టుకొని రాజకీయాలను నడుపుతాయి ఫ్రాన్స్‌లో



లెపెన్ నాయకత్వంలోని నేషనల్ ఫ్రంట్ ఇటువంటి నయా మితవాద పార్టీయే. జాతి వివక్షతతో కూడిన తీవ్రమైన ఫ్రెంచి జాతీయ వాదాన్ని ఈ పార్టీ ప్రచారం చేస్తుంది. ప్రవాసుల మీద పెద్ద ఎత్తున దాడులు చేస్తుంది. వీటి ఆధారంగానే ఆపార్టీ పెరిగింది. జర్మనీలో క్రిస్టియన్ డెమోక్రటిక్ పార్టీ కూడా విదేశస్థులకు వ్యతిరేకంగా జర్మన్ దురహంకారాన్ని ప్రోత్సహించడం ద్వారానే బలపడింది. పశ్చిమాసియాలోని ఇస్లామిక్ ఛాందసవాద పార్టీలు, ఇరాక్‌లోని ఖొమేనీ వాద పార్టీ అయినా, అల్జీరియాలోని ఇస్లామిక్ పార్టీ అయిన తీవ్రవాద ప్రజా స్వభావాన్ని కలిగి వున్నాయి. ఇటువంటి అత్యధిక పార్టీలు, సమాజాలు తీవ్ర సంక్షోభంలో ఉన్నప్పుడు సాధారణ పాలక పార్టీలు సమాజాన్ని నిర్వహించలేని దశలోనే ఇవి పెరుగుతాయి.

భారతదేశానికి సంబంధించి బి.జె.పి. అటువంటి పార్టీయే.

భారత రాజకీయరంగంలో ఒక మితవాద పార్టీ పెరగటానికి సమీప భవిష్యత్తులో అవకాశాలు కనిపించవు. అత్యధిక ప్రజానీకం దారిద్ర్యంలో మగ్గడం, తీవ్రమైన ఆర్థిక, సామాజిక అసమానతలు, ఎన్నికల రాజకీయావసరాలు వీటి రీత్యా అన్ని బూర్జువా, భూస్వామ్య పార్టీలు సామాజిక సమానత్వం, ఆర్థిక అసమానత్వాల తొలగింపు లాంటి నినాదాలను చేపడతాయి.

భారత జాతీయరంగంలో ఒకపటిష్టమైన మితవాద పార్టీగా రూపొందేందుకు అవసరమైన కీలకాంశాన్ని బి.జె.పి. ఎట్టకేలకు కనుగొన్నది ముస్లిం మైనారిటీని అంతర్గత శత్రువుగా భావించే హిందూ జాతీయ వాదం బి.జె పి కి మతతత్వ స్వభావాన్ని కలుగచేసింది. దీనితో పాటు బి జె పి కత్తికి మరో అంచున, మితవాద ఆర్థిక విధానం సరళీకృత విధానాలను, ప్రైవేటీకరణను సమర్థించడం ఈరెండు అంశాల కలయికే బూర్జువా, భూస్వామ్య వర్గాలలోని అభివృద్ధి నిరోధక సెక్షన్‌కు ప్రాతినిధ్యం వహించే ఒక ప్రత్యేక రాజకీయ శక్తిగా బి.జె.పి.ని నిలబెడుతున్నది.

బి జె పి. తన పరిణామ క్రమంలో ఈ దశకు చేరుకోవడానికి బాహ్య, అంతర్గత అంశాల ప్రభావం వుంది. బాహ్య అంశాన్ని ఇలా చెప్పుకోవచ్చు. బూర్జువా భూస్వామ్య వ్యవస్థ సంక్షోభం 80వ దశకంలో నూతన దశకు చేరింది. పాలక వర్గాలలో చెప్పుకోదగిన సెక్షన్లు నెహ్రూ పంథానుండి ప్రక్కకు మరలేలా చేసింది అంతర్జాతీయంగా, అమెరికాలో రీగన్, బ్రిటన్‌లో థాచర్, జర్మనీలో కోల్ ప్రభుత్వాలు మితవాద శక్తులు బలపడటాన్ని ప్రతిబింబించాయి. తూర్పు యూరప్ పరిణామాలు, సోవియట్ విచ్ఛిన్నంలాంటి నాటకీయాలు చోటు

చేసుకున్నాయి. 1980వ దశకం మొత్తంగా తృతీయ ప్రపంచ దేశాలలో మత ఛాందసవాదం బలపడింది.

అంతర్గతంగా బి.జె.పి. 1984 ఎన్నికల్లో కేవలం రెండు లోక్‌సభ స్థానాలు మాత్రమే సంపాదించి సంక్షోభంలో పడిపోయింది. దాని ఉనికి గుర్తింపు ప్రమాదంలో పడినట్లుగా కనిపించింది. బి.జె.పి. నూతన వ్యూహం రూపొందించుకుందనేందుకు తన మూల కార్యక్రమాన్ని, సిద్ధాంతాన్ని పునరాలోచించు కోవలసి వచ్చింది.

## వేదికకై అన్వేషణ

జనతా ప్రయోగం విఫలమయిన తర్వాత 1980లో బి.జె.పి. ఆవిర్భవించింది. పాత భారతీయ జనసంఘ్ నూతన బి.జె పి. అవతారాన్నెత్తడం గుణాత్మకమైన మార్పుగా కనిపించింది. పాత జన సంఘ్ ఆర్ ఎస్ ఎస్. సిద్ధాంతం నుండి ఈ కొత్త పార్టీ విడగొట్ట కుంటున్నట్లు తోచింది. ఈ స్వల్ప వ్యవధిలో బి జె పి. చేపట్టిన "గాంధీ వాదసోషలిజం' ఆర్ ఎస్.ఎస్ ఆధిపత్యంలో ఉన్న ఆపార్టీ కార్యకర్తలను ఇబ్బంది పెట్టింది ఎ బి. వాజ్‌పాయ్ అధ్యక్షత (1985-86) పార్టీ మతతత్వ ప్రచారాన్ని కొంత తగ్గించి గిరిజనులు, హరిజనులు, గ్రామీణ పౌరుల పట్ల పేదలు మొదలైన వారిసమస్యలను చేపట్టి విస్తృతమైన పార్టీగా రూపొందాలని ప్రయత్నించింది జనతా పార్టీ అనుభవం, ఆపార్టీలు పూర్వపు జనసంఘ్ పార్టీలకూ, ఆర్.ఎస్ ఎస్ లో కూడా సభ్యత్వ మండలిపై తలెత్తిన వివాదం ఇవి జనతాపార్టీ చీలికకు దారితీశాయి కొత్తగా ఏర్పడిన బి జె.పి. మధ్యేవాద బూర్జువా పార్టీలను అనుకరించడానికి ప్రయత్నించింది. ఈ ప్రయత్నాలకు 1984 ఎన్నికల్లో ఘోర పరాజయం ద్వారా ఆ పార్టీ మూల్యం చెల్లించింది హిందూ ఓట్లను ఇందిరాగాంధీ ఆకర్షించ కల్గింది. ఇందిరా గాంధీ హత్యపై ప్రజల్లో తీవ్ర ప్రతిస్పందన వ్యక్తమయింది ఈ పరిణామాలను గమనించిన బి జె పి. తన అసలు వేదికను కాంగ్రెస్(ఐ) కాజేసి లాభపడుతున్నదని గుర్తించింది. 1980 ఎన్నికల్లో అనేక చోట్ల ఆర్.ఎస్.ఎస్, కాంగ్రెస్(ఐ) విజయం కోసం పనిచేసిన విషయాన్ని ఈ సందర్భంగా గుర్తు తెచ్చుకోవాలి.




## మళ్ళీ హిందూతత్వం

మధ్యేవాద బూర్జువా వేదిక నుండి బి.జె పి. హిందూత్వానికి మళ్ళీ మార్పు చెందడం 1986-89 మధ్య మూడేళ్ళ కాలంలో ఒక క్రమపద్ధతిలో జరిగిన పరివర్తన, ఈ కాలంలో పార్టీ ఎల్.కె. అద్వానీ అధ్యక్షతన ఉంది. ఈ పరివర్తన ఆర్.ఎస్.ఎస్. సూచనలకు అనుగుణంగా, అద్వానీ సారథిగా జరిగింది. అద్వానీ నాయకత్వంలోనే బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్.తో తనకు సంబంధాలున్నాయని బహిరంగంగా ప్రకటించింది. హిందూతత్వ రక్షణ, రామాలయా నిర్మాణం పార్టీ ప్రధాన ఎజెండాగా ప్రకటించబడ్డాయి.

హిందూ మతతత్వ వేదికలో ఎటువంటి అంశాలున్నాయి? ఇందులోని కొన్ని అంశాలు జనసంఘ్, ఆర్.ఎస్.ఎస్ లు సంప్రదాయంగా కొనసాగిస్తున్న వైఖరిలోనివే బి జె.పి తానే ఏకైక జాతీయతా వాద పార్టీగా ఫోజుపెట్టడానికి మరి కొన్ని అంశాలను తోడు చేసింది పెట్టుబడి దారీ విధానంలో నేడు, కమ్యూనిజమే కాదు పెట్టే బూర్జువా వైఖరిలో దీన్‌దయాళ్ ఉపాధ్యాయ ప్రతిపాదించిన సమగ్ర మానవతా వాదంలోని కొంత భాగాన్నిస్వీకరించింది. ముస్లిం వ్యతిరేక భావాలను రెచ్చగొట్టడానికి ఉపయోగ పడుతుందనుకున్న ప్రతిఅంశాన్నీ తోడు చేసుకుంది ఇదంతా జనసంఘ్ ఆర్.ఎస్.ఎస్.లనుండి బి జె పి.కి సంక్రమించిన సైద్ధాంతిక-రాజకీయ సిద్ధాంతంలో భాగమే.

1986 తర్వాత కాలంలో బి.జె పి. పాత సమస్యలకే కొత్త అంశాలను తోడు చేసి మరింత రెచ్చిపోయి వ్యవహరించింది. మీనాక్షిపురం మతమార్పిడులు హిందూసమాజాన్ని అంతర్గతంగా కూల్చివేయడానికి ముస్లిములు పన్నిన కుట్ర అని ఆర్.ఎస్ ఎస్., వి.హెచ్.పి.లతో కలిసి బి జె.పి. ఆరోపించింది. అయోధ్యలో రామాలయాన్ని నిర్మించాలంటూ వి.హెచ్.పి. కూడగట్టిన మద్దతును చివరికి బి జె.పి. సొమ్ము చేసుకొంది. 1989లో ఆపార్టీ పాలంపూర్ జాతీయ కార్యవర్గ సమావేశం ఆలయ నిర్మాణం సమస్యను లాంఛన పూర్వకంగా చేపట్టింది. కాశ్మీర్‌లో వేర్పాటు వాద ఉగ్రవాద చర్యలు పెచ్చరిల్లడం రాజ్యాంగంలోని 370వ అధికరణాన్ని రద్దు చేయమని బి జె.పి. డిమాండ్ చేయడానికి వీలు కల్పించింది. బంగ్లాదేశ్ నుండి ముస్లింలు వలసరావడాన్ని ముస్లిం వ్యతిరేక భావాలను రెచ్చగొట్టడానికి బి.జె.పి. ఉపయోగించుకొంది. అదే సమయంలో బంగ్లాదేశ్ నుండి వచ్చే హిందువులకు ఆపార్టీ స్వాగతం పలికింది. మైనారిటీలను బుజ్జగించడానికే మైనారిటీల కమీషన్ అని బి జె.పి. ఖండించింది.

ముస్లిం మైనారిటీని శత్రువుగా చూపించాలన్న కేంద్ర అంశం చుట్టూ ఈ అంశాలన్నీ అల్లబడ్డాయి. బి.జె.పి. వైఖరిని ఈ క్రింది విధంగా చెప్పవచ్చు.

కుహనా లౌకిక వాదానికి బి.జె పి. వ్యతిరేకం అది "మైనారిటీ తత్వం" తప్ప మరేమీ కాదని ఆ పార్టీ అంటున్నది. భారత దేశపు హిందూ మౌలిక స్వభావాన్ని గుర్తించని అన్ని పార్టీలు ఈ కుహనా లౌకిక వాదాన్ని ఆచరిస్తున్నాయి. ఓట్లకోసం మైనారిటీతత్వాన్ని ప్రోత్సహిస్తున్నాయి. బుజ్జగిస్తు న్నాయి. భారత సమాజపు సాంస్కృతిక పోరాటం, దానిని ఏకంగా కట్టి వుంచేది హిందూతత్వమేనని సిసలైన లౌకిక వాదం గుర్తించాలి. 1986మేలో బి.జె.పి. జాతీయ కౌన్సిల్‌నుద్దేశించి చేసిన తనతొలి అధ్యక్ష ప్రసంగంలో అద్వానీ ఈ వైఖరిని ఇలా స్పష్టం చేశారు. "దురదృష్టవశాత్తూ చాలా మంది రాజకీయ వేత్తలు, రాజకీయ పార్టీలు మైనారిటీలను బుజ్జగించి, వారి ఓట్లను మొత్తంగా కాజేసేందుకు లౌకికతత్వం అనేజపాన్ని చేస్తున్నారు". ఆ మరుసటి అధ్యక్ష ప్రసంగంలో కుహనా లౌకిక తత్వాన్ని తిరస్కరించాలని పిలుపునిస్తూ ఆయన ఈక్రింది విధంగా ప్రకటించారు. "వాస్తవ మేమంటే చాలామంది రాజకీయ వేత్తలకు, మేధావులకు లౌకికతత్వమనేది తమ హిందూ వ్యతిరేకతను కనపడనీయకుండా ఉండేందుకు ముసుగు మాత్రమే".

కుహనా లౌకికతత్వం, మైనారిటీతత్వం అనే ముద్దు మాటలను బి.జె.పి. తన హిందూతత్వ సిద్ధాంతాన్ని, మెజారిటీ మతతత్వాన్ని కప్పిపుచ్చుకునేందుకు ఉపయోగించుకుంటున్నది. హిందూతత్వాన్ని అంగీకరించడమే సిసలైన లౌకికతత్వమని బి.జె.పి. చెబుతున్నది దీనికి 'సానుకూల లౌకిక తత్వం' అని పేరు

పెట్టింది. చట్టబద్ధమైన మైనారిటీల హక్కుల రక్షణకోసం ఎటువంటి చర్యకు పూనుకున్నా అది మైనారిటీ తత్వమేనని ఆరోపిస్తుంది.

ఇటువంటి వికృత సిద్ధాంతంలో ప్రచారంలోకి తేవడంలో బి.జె.పి. విజయవంత మవడం చాలామందిని ఆశ్చర్యపరిచింది. ఎందువల్ల ఈ పాతనినాదాలకు కొత్తరూపంలో ఇంకా ప్రతిస్పందన లభించింది. ఎందువల్ల ఈనినాదాలు విస్తృత ప్రజానీకాన్ని ఆకర్షించాయి.

వీటికి సమాధానం చెప్పుకోవాలంటే, రాజకీయ ప్రధాన స్రవంతిలో మతతత్వ నినాదాలను ముందుకు తెచ్చిన ఘటనా పరంపరను పరిశీలించాలి.

## బూర్జువా–భూస్వామ్య సంక్షోభం–ఒక ప్రతిస్పందన

పాలకవర్గాలు నెహ్రూ పంథా నుండి వైదొలగటం పట్ల ఆ వర్గాలకు ప్రాతినిధ్యం వచ్చే వేర్వేరు పార్టీలు వేర్వేరుగా ప్రతిస్పందించాయి. కాంగ్రెస్(ఐ)కి సంబంధించి రాజీవ్‌గాంధీ ప్రభుత్వం సరళీకృత విధానాలను చేపట్టింది. అయితే ఈ విధానాలు 1988-89 కల్లా దేశాన్ని తీవ్ర ఆర్థిక సంక్షోభంలో పడవేశాయి. రాజకీయంగా ఈ విధానాలు లౌకిక సూత్రాలతోను, వేర్పాటువాద శక్తులతోను మరింతగా రాజీపడటానికి దారితీసింది.

ఈ స్థితిలో బి.జె.పి. తన హిందూతత్వమనే ప్రత్యామ్నాయాన్ని ముందుకు తెచ్చింది. దీని ఆధారంగా జాతీయ సమైక్యతను సాధించవచ్చునని, వేర్పాటువాదాన్ని అదుపు చేయవచ్చునని చెప్పింది. మెజారిటీ హిందూ ప్రయోజనాలకు అనుగుణంగా భారతతరహా సరళీకృత వ్యవస్థను రూపొందించవచ్చునని తెలిపింది.

మధ్యతరగతి వర్గాల నుండి, గ్రామీణ సంపన్న వర్గాల నుండి బి.జె.పి. మద్దతు సంపాదించడానికి రాజీవ్‌గాంధీ ప్రభుత్వ దివాళాకోరుతనం, అవినీతి ఎంతవరకు ఉపయోగపడ్డాయన్న విషయాన్ని ఆలోచించాలి. రాజీవ్ ప్రభుత్వం పట్ల భ్రమలు వీడటమే బి జె పి. పెరుగుదల క్రమానికి ఆరంభం. ఈ మధ్యకాలంలో వి.పి.సింగ్, జనతాదళ్ ఈ అసంతృప్తిని కొంత ఉపయోగించుకున్నప్పటికీ, నేషనల్ ఫ్రంట్, జనతాదళ్‌లతో పొత్తుపెట్టుకొని బి జె.పి. కాంగ్రెస్ వ్యతిరేకతను సొమ్ము చేసుకోగలిగింది.

బయటకి చూసినప్పుడు, బోఫోర్స్ కుంభకోణం రాజీవ్‌గాంధీ ప్రభుత్వ అవినీతిని బట్టబయలు చేయగా, షాబాను ఉదంతం మైనారిటీ మతతత్వాన్ని బుజ్జగించడాన్ని వెల్లడించింది. ప్రస్తుత వ్యవస్థలో కాంగ్రెస్ (ఐ)కి పరిశుద్ధ ప్రత్యామ్నాయంగా బి.జె.పి. ఫోజుపెట్టింది. షాబాను విషయంలో ముస్లిం మతతత్వంతో రాజీవ్ ప్రభుత్వ రాజీని ఖండించిన బి జె.పి., అయోధ్యలో వివాదాస్పద కట్టడానికి తలుపులు తెరిపించి హిందూమతతత్వంతో రాజీపడ్డప్పుడు హర్షం వెలిబుచ్చింది.

రాజీవ్‌గాంధీ స్వప్నం భగ్నం కావడం మధ్యతరగతి వర్గాలలో చెప్పుకోదగినంత మంది బి జె.పి. తప్పుడు మాటలకు కొట్టుకుపోవడానికి దారితీసింది. సరళీకృత విధానాలు సత్వర ఫలితాలిస్తాయన్న ఆశలు వమ్మయ్యాయి. పంజాబ్, కాశ్మీర్‌లలో జాతీయ సమైక్యతపైన, హిందూ మైనారిటీలపైన దాడులు అధికమయ్యాయి. స్వతంత్ర భారతదేశంలో హిందువులు "ద్వితీయశ్రేణి పౌరులు"గా పరిగణించబడుతున్నారని బి.జె పి. ప్రచారానికి ఇవి బలం చేకూర్చాయి. రాజీవ్ ప్రభుత్వం ఎన్నో ఆశలు కల్పించి ప్రవేశపెట్టిన ఆర్థికవిధానాలు ఘోరవైఫల్యానికి గురికావడం, జాతీయ సమైక్యతపై దాడులు జరగటం జాతీయత గురించి లౌకికతత్వం గురించి బి.జె.పి. వికృత పద్ధతిలో పిలుపునివ్వడానికి అనుకూల వాతావరణాన్ని కల్పించాయి.

నేరుకల్గిన ఈ మధ్యతరగతి వర్గాలలో లౌకికభావాలు ఇంకేమన్నా మిగిలివుంటే అవి 1990 ఆగస్టులో వి.పి.సింగ్ ప్రభుత్వం మండల్ కమీషన్‌ను అమలు చర్చడానికి పూనుకోవడంతో బెదిరిపోయాయి. తాము విద్యా, ఉద్యోగాలలో పైకి రావడానికి జనతాదళ్ ప్రభుత్వం అడ్డంకిగా ఉన్నదని అత్యధికంగా అగ్రవర్ణాలకు చెందిన ఈవిద్యాధికవర్గాలు భావించాయి. చారిత్రకంగా, సామాజికంగా వెనుకబడ్డ వర్గాలకు రక్షణ కల్పించాలన్న ప్రజాతంత్ర హక్కును వీరు వ్యతిరేకించేందుకు ఇది దారి తీసింది. రిజర్వేషన్ వ్యతిరేక ఉద్యమం, అద్వానీ రథయాత్ర ద్వారా బి.జె.పి. పెద్దసెక్షన్ల మద్దతు సంపాదించడానికి ఉపయోగపడింది.

## బడా బూర్జువా ప్రతిస్పందన

నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం తమ ప్రయోజనాలను సమర్థవంతంగా కాపాడలేదని భావించిన బడాబూర్జువా వర్గంలోని ఒక సెక్షన్ బి జె పి. పట్ల ఆకర్షితమయింది. వాస్తవానికి మార్వాడీ బడా బూర్జువాల లాంటి వారు ప్రగాఢమైన మత భావాలు కలిగినవారు. హిందూ ప్రయోజనాలకు వారు అనుకూలమే. అయినప్పటికీ లౌకిక వర్గ ప్రయోజనాల రీత్యా వారు ఎల్లప్పుడు కాంగ్రెస్ (ఐ)కేసమర్థించేవారు. మొట్టమొదటిసారిగా 1990-91లో ఈ వైఖరిలో పెద్ద మార్పు వచ్చింది. రథయాత్ర తర్వాత అద్వానీ మొదటిసారి కలకత్తా వచ్చినపుడు బిర్లాలు బ్రహ్మాండమైన స్వాగతం పలికారు. 1991 లోక్‌సభ ఎన్నికల్లో కూడా ఈ వైఖరి కొనసాగింది. మొట్టమొదటి సారిగా బడాబూర్జువా వర్గంలోని ఒక సెక్షన్ బి జె.పి లో కాంగ్రెస్ (ఐ) ఒక పటిష్టమైన ప్రత్యామ్నాయాన్ని చూసింది. అదేవిధంగా బి.జె.పి.కి ఎన్నికల నిధులు కూడా లభించాయి. అధికారం కోల్పోయి ఇబ్బందుల్లో ఉన్న కాంగ్రెస్ (ఐ) కన్నా కొన్ని చోట్ల బి.జె.పి.యే అధికంగా ఖర్చు పెట్టింది.

అయితే ఈ పరిస్థితి దీర్ఘకాలం కొనసాగలేదు. నరసింహారావు నాయకత్వాన కాంగ్రెస్(ఐ) ప్రభుత్వం నూతన ఆర్థిక విధానాలను అమలు పర్చడం ఆరంభించిన తర్వాత బి.జె.పి. పట్ల బడా బూర్జువా వర్గ వైఖరిలో మార్పు వచ్చింది. ఈ నూతన ఆర్థిక విధానాలను అమలుపర్చడం ఆరంభించిన తర్వాత బి.జె పి పట్ల బడా బూర్జువా వర్గ వైఖరిలో మార్పు వచ్చింది. ఈ నూతన ఆర్థిక విధానాలు కాంగ్రెస్ (ఐ) ప్రభుత్వం పట్ల బడాబూర్జువా వర్గపు విశ్వాసాన్ని పునరుద్ధరించాయి. దానితో ఆవర్గాలకు బి.జె.పి. పట్ల ఆసక్తి, మద్దతు తగ్గిపోయింది. బడాబూర్జువా, భూస్వామ్య ప్రయోజనాలకు బి.జె.పి. బహిరంగంగా మద్దతు పలుకుతున్నప్పటికీ, నూతన ఆర్థికవిధానాన్ని పెటీబూర్జువా దృక్పథంతో ఆపార్టీ విమర్శించడం, ప్రజామద్దతును కాపాడుకోవడానికి అవకాశవాద నినాదాలకు పాల్పడటం బి.జె.పి.ని బడాబూర్జువాలు సందేహించడానికి కారణమయ్యాయి.

## ఆర్థిక విధానం

బి.జె.పి. సరళీకృత విధానాలను, ప్రైవేటీకరణను సమర్థిస్తున్నది. 1992 మేలో గాంధీనగర్‌లో జరిగిన ఆపార్టీ జాతీయ కార్యవర్గం ఆమోదించిన ఆర్థిక విధాన ప్రకటన గుత్త పెట్టుబడిదారులపై అన్ని కంట్రోళ్ళను ఎత్తివేయాలని డిమాండ్ చేసింది. గుత్తసంస్థల పరిమితిని రు.100కోట్ల నుండి రు.1000కోట్లకు పెంచాలని కోరింది. రక్షణ, కొన్ని మౌలిక సదుపాయ పరిశ్రమలు మినహా మిలిగిన అన్ని ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేటీకరించాలని చెప్పింది. బ్యాంకులు, ఫైనాన్స్ రంగాన్ని కూడా ప్రైవేటీకరించాలని కోరింది. భూసంస్కరణల గురించి బి జె.పి. డొంకతిరుగుడుగా మాట్లాడుతున్నప్పటికీ, ఆపార్టీ వీటికి బద్ధ వ్యతిరేకం. ఆపార్టీ ఆధ్వర్యంలోని రాష్ట్రప్రభుత్వాల ఆచరణే దీనికి ప్రత్యక్ష సాక్ష్యం.

మౌలికమైన ఆర్థిక విధానాలలో కాంగ్రెస్ (ఐ)కి, బి జె.పి.కి ఏమీ తేడాలేదని పై అంశాల వల్ల తెలుస్తున్నది. అయితే ఇటీవల కాలంలో ఆపార్టీ 'స్వదేశీ' అనే నినాదాన్ని చేపట్టింది. స్వదేశీ గుత్తపెట్టుబడిదారులకు రక్షణ కల్పిస్తూ, విదేశీ గుత్త పెట్టుబడిదారులను వ్యతిరేకించాలన్న బి జె.పి. అర్థంకాని వైఖరి, ఆపార్టీ వారిని సైతం గందరగోళంలో పడవేసింది. ఒకవైపున భారత గుత్త పెట్టుబడిదారులు, బహుళజాతి సంస్థలతో మిలాఖత్తుకై ఉరుకులు, పరుగులు పెడ్తుండగా

బి.జె.పి. 'స్వదేశీ' అంటూ ఈవిధంగా చెప్పడం వారికి విడ్డూరంగా తోచింది.

ఆగస్టు 1992లో భోపాల్‌లో జరిగిన బి.జె.పి. జాతీయ కార్యవర్గం "స్వావలంబనతో కూడిన సరళీకృత విధానాలు"అనే మరింత విలక్షణమైన నినాదాన్ని చేపట్టింది. స్వావలంబనకు, సరళీకృత విధానాలకు పొంతన ఎలా కుదురుతోంది!

## కుహనా జాతీయవాదం

బి.జె.పి. చెబుతున్న జాతీయవాదం, అంతకుముందు జన సంఘ్ చెప్పిన హిందీ–హిందూ–హిందుస్థాన్‌సిద్ధాంతాన్ని దాటి పోలేదు. హిందూత్వమనే సాంస్కృతిక సిద్ధాంతానికి ఆర్.ఎస్.ఎస్. చెప్పే 'హిందూ రాష్ట్ర' సిద్ధాంతం పునాదిగా ఉంది పంజాబు, కాశ్మీర్‌లోను అంతకు ముందు ఈశాన్య ప్రాంతంలోను చెలరేగిన ఉగ్రవాద, విచ్ఛిన్నకర కార్యకలాపాలు బి.జె.పి. మెజారిటీ హిందూతత్వాన్ని రెచ్చగొట్టడానికి సహాయపడ్డాయి.

ఎన్నికల ప్రయోజనాల నాశించి బూర్జువా సెక్యులర్ పార్టీలు, బి.జె.పి.తో అవకాశవాద పొత్తులు కుదుర్చుకోవడం వల్ల కూడా ఆపార్టీ బలపడింది. ప్రజల్లో కాంగ్రెస్ పట్ల వ్యతిరేకతను ఉపయోగించుకొని చట్టబద్ధతను సంపాదించడానికి బి.జె.పి.కి ఇది దోహదపడింది. సెక్యులర్ బూర్జువా పార్టీలు మైనారిటీ మతానికి చెందిన వారిని బుజ్జగించడానికి చేసిన ప్రయత్నాలు కూడా బి.జె.పి.కి ఉపయోగపడ్డాయి. షాబానూ ఉదంతం, రాజీవ్‌గాంధీ హిందూ మతతత్వ వాదులతో రాజీ, తొమ్మిదవ సార్వత్రిక ఎన్నికల్లో జుమా మసీదు ఇమామ్ మద్దతు అర్థించడానికి వి.పి.సింగ్ వెళ్ళటం–ఇటువంటి అంశాలు.

బి.జె.పి. చెబుతున్న జాతీయ సమైక్యత, కార్మికవర్గం, ఇతర ప్రజాతంత్ర సెక్షన్లు చెబుతున్న దానికి భిన్నమైంది. భారతదేశపు భిన్నత్వంలో ఏకత్వాన్ని కార్మికవర్గం గుర్తిస్తుంది. దాని ఆధారంగానే జాతీయ సమైక్యత సాధించబడుతుందని చెబుతుంది. కాని బి.జె.పి. మెజారిటీ హిందూ రాజ్యాన్ని బలవంతంగా రుద్దడం ద్వారా జాతీయ సమైక్యతను సాధించాలని చెబుతోంది.

రాష్ట్రాలకు మరిన్ని అధికారాలు కల్పించి కేంద్ర రాష్ట్ర సంబంధాలను పునర్వ్యవస్థీకరించి నిజమైన ఫెడరల్‌వ్యవస్థను సాధించడానికి బి.జె.పి. వ్యతిరేకం. భాషా ప్రయుక్త రాష్ట్రాలకు బి.జె.పి. వ్యతిరేకం. మొత్తం దేశాన్ని కనీసం 60 రాష్ట్రాలుగా పునర్విభజించాలని ఆపార్టీ అభిప్రాయపడుతున్నది ఇటువంటి చిన్న రాష్ట్రాల ద్వారా కేంద్రంలో నిరంకుశ పెత్తనాన్ని చెలాయించవచ్చునని భావిస్తున్నది. ఇటువంటి కేంద్రీకృత అధికారానికి దోహదపడే అధ్యక్షతరహా పాలనను కూడా ఆపార్టీ కోరుతున్నది.

## మతకల్లోలల ద్వారా పెరుగుదల

బి.జె.పి. మౌలికంగా మధ్యే మితవాద పార్టీ అని భావించే కొందరు ఉదారవాదులు ఇప్పటికీ ఉన్నారు. మత సమస్యపై ఆపార్టీని ఒప్పించవచ్చునని వారు ఆశపడుతున్నారు. అయోధ్య సమస్యను ఆపార్టీ యాదృచ్ఛికంగా చేపట్టిందని, ఇతర సామాజిక, ఆర్థిక సమస్యలపై బాధ్యతాయుతమైన వైఖరిగైకొనే మధ్యే మితవాద పార్టీగా అది మార్పు చెందుతుందని వారు అంటున్నారు. కాని ఇది వట్టి భ్రమ మాత్రమే.

మతకల్లోలలకు, బి.జె.పి. పెరుగుదలకు విడదీయరాని సంబంధమున్నది. దీనికి గుజరాత్ ఒక చక్కటి ఉదాహరణ. గత రెండు దశాబ్దాలుగా గుజరాత్‌లోని అహ్మదాబాద్, బరోడా, సూరత్, ఇంకా ఇతర నగరాలలో, పట్టణాలలో మతకల్లోలాలు తరచు సంభవిస్తున్నాయి. మతాలపరంగా విభజన పెరిగిపోయింది. పోలీసులు, ఇతర రాజ్యాంగయంత్రంలోను మతతత్వం చోటు చేసుకున్నది. ఈ విధంగా బి.జె.పి. బలపడింది. 1991 లోక్‌సభ ఎన్నికల్లో గుజరాత్‌లో మొత్తం పోలైన ఓట్లలో 51శాతం ఈ పార్టీకి లభించాయి.

కర్నాటక మరొక ఉదాహరణ. కర్నాటకలో బి.జె.పి. బలం పుంజుకోవడానికి చాలాకాలం నుండీ ప్రయత్నిస్తున్నప్పటికీ ఫలితముండటం లేదు. కాని ఇటీవలి కాలంలో బెల్గాం, దేవనగిరి మొదలైన చోట్ల మతకట్లడాలు జరిగాయి. ఆర్.ఎస్.ఎస్. ఇప్పటివరకు దక్షిణ రకకోర పరిమితమయి ఉంది ఇప్పుడు ఇతర చోట్లకు విస్తరించింది. గత లోక్‌సభ ఎన్నికల్లో కర్నాటకలో ఈపార్టీకి 28శాతం ఓట్లు లభించాయి.

## కమ్యూనిస్టు వ్యతిరేకత, సామ్రాజ్యవాద అనుకూలత

బి.జె.పి.కి కమ్యూనిస్టు వ్యతిరేకత నరనరాన జీర్ణించుకుపోయింది. వామపక్ష ఉద్యమం బలంగా ఉన్న పశ్చిమ బెంగాలు, కేరళలలో స్థానం సంపాదించేందుకు నానాతంటాలు పడుతున్నది. ఆరాష్ట్రాలలో కమ్యూనిస్టులను దెబ్బతీయడానికి ఎవ్వరితోనైనా కలవడానికి సిద్ధపడుతున్నది. గత లోక్‌సభ ఎన్నికల్లో కేరళలో ఎల్.డి.ఎఫ్ అభ్యర్థులను ఓడించడానికి, చాలాచోట్ల బి.జె.పి. యు.డి.ఎఫ్. అభ్యర్థులకు మద్దతిచ్చింది. కమ్యూనిస్టులపై ముఖ్యంగా సి.పి.ఎం. కార్యకర్తలపై దాడులకు కూడా పూనుకుంటున్నది. ప్రపంచవ్యాపితంగా సోషలిజం దెబ్బతిన్న పరిస్థితిని ఇక్కడ కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా ఉపయోగించుకోవాలని ప్రయత్నిస్తున్నది.

బి.జె.పి., దాని పెద్ద సంస్థ జనసంఘ్, జాతీయ ప్రయోజనాలు, సార్వభౌమాధిపత్యం గురించి ఎంతగా గగ్గోలుపెట్టినప్పటికీ, సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరిని ఎన్నడూ గైకొనలేదు. సామ్రాజ్యవాద దోపిడీ అన్నవాస్తవాన్ని బి.జె.పి. గుర్తించదు. 1977–79లో జనతాప్రభుత్వం పాశ్చాత్యదేశాలతో భారత సంబంధాలను మెరుగుపరిచి, అలీన విధాన ప్రతిష్టను పెంచడానికి ప్రయత్నించిందని 1986లో అద్వానీ తన అధ్యక్ష ప్రసంగంలో చెప్పారు. అంతేకాదు 1992 జనవరిలో అమెరికాలో పర్యటించిన అద్వానీ హెరిటేజ్ ఫౌండేషన్ లాంటి మితవాద వేదికలపై ఉపన్యాసాలివ్వడం ఆపార్టీ సామ్రాజ్యవాద అనుకూలతకు నిదర్శనం. బి.జె.పి. అమెరికాతో సన్నిహిత సంబంధాన్ని కోరుకుంటున్నదని ఆయన చెప్పారు. అమెరికా దక్షిణాసియాలో పాకిస్తాన్‌ను కాకుండా, భారత్‌ను సమర్థించాలన్నది ఆపార్టీ ఉద్దేశ్యం.

అంతర్జాతీయ విషయాలలో బి.జె.పి. వైఖరి ముస్లిం వ్యతిరేక స్వభావంతో ముడివడి ఉంటుంది ఇజ్రాయిల్‌తో పి.వి.నరసింహారావు ప్రభుత్వం పూర్తి దౌత్యసంబంధాలు పెట్టుకున్నపుడు బి.జె.పి. అందరికన్నా ఎక్కువ సంతోషాన్ని ప్రకటించింది. మధ్య ఆసియాలో ఇస్లాముకు వ్యతిరేకంగా యూదు దురహంకార ఇజ్రాయిల్ బలపడాలని బి.జె.పి. కోరుకోవడమే దీనికి కారణం. ఇరాక్‌లో అమెరికా, దాని కూటమి జరిపిన విధ్వంసాన్ని బి.జె.పి. ఖండించలేదు పైగా జార్జిబుష్‌ను కీర్తించే నినాదాలు చేపట్టింది.

## ఏంచేయాలి

1980వ దశకంలో వర్గపోరాటాలు, ప్రజాపోరాటాలు ద్వారా వామపక్షాలు దేశవ్యాపితంగా పుంజుకోలేదు. వామపక్షాలు పునాదివర్గాలలో బలంపెంచుకొని, కొత్త ప్రాంతాలకు విస్తరించలేకపోవడం బి.జె.పి.కిడపయోగపడింది బూర్జువా, భూస్వామ్యవ్యవస్థ సంక్షోభం వల్ల ప్రజల్లో పెరిగిన అసంతృప్తిని బి.జె.పి. సొమ్ము చేసుకొంది. కాంగ్రెస్ ప్రజాపునాది తరిగిపోయింది

బి.జె.పి. మతతత్వ సిద్ధాంతాలకు, రాజకీయాలకు వ్యతిరేకంగా పోరాడాలి. బి.జె.పి. అభివృద్ధి నిరోధక వర్గ స్వభావాన్ని మొత్తంగా బహిర్గతం చేసినప్పుడు మాత్రమే ఈ పోరాటం సమర్థవంతంగా జరగదు. ఆపార్టీ ఆధీనంలోని ప్రభుత్వాలు అనుసరించే ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా సమరశీలపోరాటాలను చేపట్టడం కీలకమైన అంశం. జాతీయ సమైక్యతా పరిరక్షణ, వేర్పాటువాదానికి వ్యతిరేకంగా పోరాటాలను బి.జె.పి., హిందూ మతతత్వవాదాలు తమకు అనుకూలంగా ఉపయోగించుకునేందుకు వీలు కల్పించరాదు. వామపక్షాలు నికరమైన వైఖరిని అవలంబిన్నానే, ఇతర సెక్యులర్–ప్రజాతంత్రశక్తులను కూడా సమీకరించాలి

# అయోధ్యవివాదం నూరేళ్ళచరిత్ర

అయోధ్య! అయోధ్య! అయోధ్య! కొంత కాలం నుండి ఆర్.ఎస్.ఎస్. వి హెచ్ పి కూటమి యొక్క నిరంతరస్మరణ ఇదే. అయోధ్య అనే మాట తప్పితే మరో మాట వాళ్ళనోళ్ళ లోంచి రావడం లేదు. సయోధ్య అనే పదం వాళ్ళ చెవులకు అసలు విన్పించడం లేదు

బి జె పి. కూటమి వాదన ప్రకారం "అయోధ్యలో యీనాడు బాబ్రీ మసీదుగా పిలవబడుతున్న కట్టడం యొక్క మధ్య గోపురం ఉన్న స్థలంలో భగవాన్ శ్రీ రామ చంద్రజీ జన్మించాడు. ఆ స్థలంలో మొదట శ్రీరాముని కుమారుడైన కుశ మహారాజు దేవాలయం కట్టించాడు. అది కాలక్రమేణా శిథిలమై పోగా విక్రమార్క మహారాజు పునర్నిర్మించాడు. దానిని క్రీ శ 1528లో బాబరు కూలగొట్టి మసీదు నిర్మించాడు. ఈనాడు దానిని కూలగొట్టి రామాలయం నిర్మించితే జాతి గౌరవం పెరుగుంది "

మొత్తానికి మసీదుని కూలగొట్టాలి అదే వారి వాదన సారాంశం. మసీదును కూలగొట్టడం కాదు. తరలింపు మాత్రమే అని బి.జె.పి. అగ్రనాయకుడు శ్రీ అద్వాని తరచూ సన్నాయి నొక్కులు నొక్కుతారు. "తరలింపు అంటే ప్రతి రాయినీ తరలించడం కాదు. మసీదు కూలగొడతాం బాబర్ సేనాని మీర్ బఖీ చెక్కించిన రాతి పలకను తీసుకు వెళ్ళేందుకు ముస్లింలకు అనుమతి ఇస్తాం అంటూ ఆ వెనుకే వి హెచ్ పి ప్రధాన కార్యదర్శి శ్రీ అశోక్ సింఘాల్ వివరణ ఇస్తారు మసీదును కూలగొడితే ముస్లింలే కాక, క్రైస్తవులు, సిక్కులు, బౌద్ధులు మొదలైన మైనారిటీల మనోభావాలు దెబ్బ తింటాయనీ, మత కలహాలు చెలరేగి రక్తపుటేరులు పారవచ్చునని, దేశ సమగ్రతకే ప్రమాదం ఏర్పడవచ్చునని తెలిసీ బి.జె.పి. కూటమి వారు యీ మతోన్మాద ప్రచారానికి పూనుకున్నారంటే వారి ఆశయం ఈ దేశంలోని ప్రజలు మతం పేరుతో నిరంతరం కొట్టుకు చావడమేనన్నమాట. వీరు ఎవరి ప్రేరణతో ఈ పనిచేస్తున్నారు? ఒక్కసారి మనదేశ చరిత్రలో బ్రిటిష్ వారి హయాంలోకి పోతే ఈ ప్రశ్నకు సమాధానం, అయోధ్య సమస్యకు ఆదిమధ్యాలు అర్థమవుతాయి.

బ్రిటిషువారు భారత దేశానికి రాకముందు మనదేశంలో హిందూ–ముస్లిం ప్రజల మధ్య పెద్ద కలహాలులేవు. హిందూ శైవులు, బౌద్ధుల మధ్య శైవులు వైష్ణవుల మధ్య తీవ్రమైన రక్తపాత కలహాలు జరిగాయని చరిత్ర చెబుతోంది. శైవులు అనేక బౌద్ధారామాలు నాశనం చేశారు. ఉదాహరణకు ఆంధ్రదేశంలో అమరారామం అనే బౌద్ధ ఆరామాన్ని నాశనం చేసి అమరావతిగా మార్చారు. ఆరామంలోని "ఆయక స్థంభం శివలింగంగా మార్చబడిందని చరిత్రకారులు చెబుతున్నారు. 'దక్షిణకాశి'గా



ప్రసిద్ధిగాంచిన చౌజెర్లలోని శివాలయం పై భాగాన చిత్రితమైన బౌద్ధజాతక కథలు అది ఆలయంగా మార్చబడ్డ ఆరామమని నిరూపిస్తోంది. అయితే హిందూ–ముస్లింల మధ్య ఆంగ్లేయులు వచ్చేనాటికి ఎట్టి ద్వేషభావనలూ లేవు. హిందూ రాజులకి ముస్లింలు మంత్రులు, సేనానులు, సలహాదార్లు గానూ, ముస్లిం రాజుల వద్ద హిందువులు ఉన్నతోద్యోగాలలోనూ ఉండేవారు ఉదాహరణకు అక్బర్ మంత్రులు తోడర్‌మల్, బీర్‌బల్, సేనాధిపతి మాన్‌సింగ్ హిందువులు, ఔరంగజేబు సేనాధిపతి రాజాజయసింగ్ హిందువు. టిప్పు సుల్తాన్ మహామంత్రి పూర్ణయ్య పండితుడు హిందువుడే. ఛత్రపతి శివాజీ యొక్క నౌకాదళాధిపతి దర్యా సారంగ్ ముస్లిం. అలాగే శివాజీ యొక్క ఇద్దరు ప్రముఖ సేనానులు ఇబ్రహీం ఖాన్, దౌలత్ ఖాన్‌లు ముస్లింలు. అఫ్‌జుల్ ఖాన్‌తో ఎదురైన భయంకర పోరాటంలో శివాజీ ననుసరించిన విశ్వాస పాత్రులైన పదిమంది అంగరక్షకులలోనూ ముగ్గురు ముస్లిములున్నారు. శివాజీతో పాటు ఆగ్రాకు వెళ్ళి మరల తప్పించుకొనే నాటకంలో ప్రముఖ పాత్ర వహించిన పద్దెనిమిళ్ళ యువకుడు మదారి మెహతార్ ముస్లియుడే! ఈ విధమైన హిందూ–ముస్లింల అన్యోన్యతను ఆంగ్లేయులు కూడ అంగీకరించారు ఉదాహరణకు సైమన్ కమీషన్ ప్రతినిధి సైమన్ ఇలా అంటాడు "బ్రిటిష్ ఇండియాలో ఒక తరానికి ముందు హిందూ–ముస్లిం మత ద్వేషం ప్రజా శాంతికి ప్రమాదం అతి తక్కువగా ఉంది " అయితే బ్రిటీషు సామ్రాజ్యవాదులకు యీ ఐక్యత ఎంతమాత్రం అంగీకారంగా లేదు. వారు ఈ రెండు మతాల మధ్య ద్వేషాన్ని కాంక్షించారు.

ఇక మొదలైంది బ్రిటిష్ వారి విభజించి–పాలించు అనే పాలన భారతదేశంలో హిందూ–ముస్లింల మధ్య ద్వేషాలు పెంచడానికి రాజకీయంగానూ, విద్యారంగంలోనూ, సాంస్కృతిక రంగంలోనూ తీవ్రంగా కృషి చేయనారంభించారు. అయోధ్య విషయంలోనూ వారే అపార్థాలకు అంకురార్పణ చేశారు 1860లో ఇలియట్ అనే ఆంగ్ల రచయిత బాబరు గుడి కూల్చినట్లు తొలిసారి రాశారు.

**రాజకీయ రంగంలో విభజించి–పాలించు నీతి 1909లో మింటో–మార్లే సంస్కరణలతో ప్రారంభమైంది. 1930వ దశకంలో నాజీజం జర్మనీలో వెలిగిపోతున్న రోజుల్లో సంఘనాయకులు తమ ముసుగు తొలగించుకొని బయట పడ్డారు. 1939లో వారినాయకుడు గోల్వాల్కర్ మనము లేక నిర్వచించబడిన మనజాతీయత" అనే గ్రంథంలో ఇలా వ్రాశాడు "హిందుస్థాన్‌లో గల విదేశీ జాతుల వారు హిందూ సంస్కృతిని, బాషను, మతాన్ని గౌరవించాలి. వారు హిందూ జాతిలో కలిసిపోవాలి లేదా హిందూ జాతికి పూర్తిగా లోబడి బ్రతకాలి. వారు ఎలాంటి ప్రత్యేక సదుపాయం ఆఖరకు పౌరహక్కులు కూడ వారు అడగకూడదు. " అలా లోబడని వారినేం చేయాలి? అనే ప్రశ్నకు సమాధానంగా "జాతి పవిత్రతను, సంస్కృతిని కాపాడేందుకు సమైక్య జర్మనీ ప్రపంచాన్ని దిగ్భ్రాంతి పరిచే విధంగా యూదులను తుడిచి పెట్టింది. హిందూస్థాన్‌లోని మనం నేర్చుకొని, ఉపయోగించవలసిన చక్కటి పాఠమిది".**

నాయకుడి ఆజ్ఞ అయింది ఇంకేం! అనుచరగణం విజృంభించింది. ముస్లిములను "తుడిచి పెట్టేందుకు కంకణం కట్టుకున్నది సాకుల కోసం వెదక నారంభించింది చిన్న సమస్యలను భూతద్దంలో చూపసాగింది లేసి

సమస్యలను సృష్టించడం మొదలెట్టింది. వాళ్ళ జర్మనీ గురువు గోబెల్స్ లాగా ఒక అబద్ధాన్ని పదిసార్లు చెబితే అదే నిజం అవుతుందనే సూత్రాన్ని అనుసరించింది. మొత్తానికి ప్రజల మనస్సులలో మతోన్మాదాన్ని నింపడం అనే కార్యక్రమం కొనసాగించింది. సరిగ్గా ఈ సమయంలోనే ఆర్.ఎస్.ఎస్. కూటమి దృష్టి బాబ్రీ మసీదుపై పడింది. 1949లో బాబ్రీ మసీదు-రామ్ చబూత్రా సమస్య విషయంలో ఒక సంఘటన జరిగింది. ఆ సంవత్సరం రామ్ చబూత్రా పై దేవాలయ నిర్మాణానికి చబూత్రా మహంత్, మరియు కొందరు హిందువులు ప్రయత్నించారు. చబూత్రా స్థలాన్ని దేవాలయ నిర్మాణం కొరకు తమకు అప్పగించవలసినదిగా వారు యు.పి. ప్రభుత్వాన్ని (ఆనాటి యునైటెడ్ ప్రావిన్స్ ప్రభుత్వాన్ని) కోరారు. దానిపై 1949 జులై 20న హిందువులు మందిర నిర్మాణానికి ప్రతిపాదించిన స్థలం నాజుల్/మునిసిపల్ స్థలం అవునో కాదో తెలుపవలసినదిగా ఆనాటి ఫైజాబాద్ జిల్లా మెజిస్ట్రేటుగాను, డిప్యూటీ మేయర్‌గాను ఉన్న కె.కె.నయ్యర్‌ను యు.పి.ప్రభుత్వం కోరింది. కాని ఎన్నిసార్లు రాష్ట్ర ప్రభుత్వం కోరినా, సమాధానం పంపకుండా ఆయన దాటవేశారు. చివరకు 10-10-49న ఫైజాబాద్ పట్టణ మేజిస్ట్రేటు ప్రభుత్వానికి నివేదిక సమర్పించాడు. దానిలో ఇలా ఉంది "మీ ఉత్తర్వుల మేరకు నేను ఆ స్థలానికి వెళ్ళి అన్ని విషయాలను వివరంగా సేకరించాను. మసీదు, దేవాలయము ప్రక్కప్రక్కనే ఉన్నాయి. హిందువులు ముస్లింలు తమ తమ మతకలాపాలను నిర్వహించుకొంటున్నారు. ప్రస్తుతం ఉన్న చిన్న దానికి బదులుగా కళాత్మకమైన, విశాల మందిరాన్ని నిర్మించుకోవాలని హిందువులు కోరుతున్నారు. ఇందుకు అడ్డు చెప్పవలసిందిఏమీ లేదు. భగవాన్ రామచంద్రజీ జన్మించిన స్థలంలో చక్కని మందిరాన్ని నిర్మించాలని హిందువులు కోరుకుంటున్నందున అనుమతి ఇవ్వవచ్చు. దేవాలయం నిర్మించాలనుకొంటున్న స్థలం నజూల్(ప్రభుత్వానికి) చెందినదే".

పై నివేదికను బట్టి అర్థమయ్యే దేమిటంటే 1949 అక్టోబరు నాటి వరకు హిందువులు చబూత్రానే రామజన్మ స్థాన్‌గా పరిగణిస్తూన్నారని ఈ ప్రదేశంలో రామాలయం కడితే ఈ సమస్య పరిష్కారమై ఉండేది. ఇది ఆర్.ఎస్.ఎస్. కూటమికి ఎంత మాత్రం నచ్చలేదు. సమస్యలు పరిష్కారమై హిందూ-ముస్లిం సామరస్యం నెలకొంటే వారికి నచ్చదు కదా? అందుకని భారత దేశ చరిత్రలోని అత్యంత నికృష్టసంఘటనలలో ఒక దానిని వాళ్ళు సృష్టించారు. 1949 నవంబరులో మసీదు సమీపంలోని ముస్లింల సమాధులను త్రవ్వి తొలగించారు. ఆ తరువాత డిసెంబరు 14 నుండి 9 రోజుల పాటు నిరంతరం 'రామ చరిత మానస్ పఠనం జరిగింది. ఆ ప్రదేశంలో ఒక విధమైన ఉన్మాద వాతావరణం రెచ్చగొట్టబడింది. దానికి పరాకాష్టగా 1949 డిసెంబరు 22 నాటి రాత్రిపూట 50,60 మంది మసీదులోకి బలవంతంగా ప్రవేశించి అక్కడి మధ్యగోపురంలో బాలరాముని విగ్రహాన్ని ఉంచారు. డ్యూటీలో ఉన్న హంసరాజ్



అనే కానిస్టేబుల్ ఆపనిమానుకోమని వారిని కోరాడు వారు వినలేదు. అందుబాటులో ఉన్న పి.ఏ.సి గార్డులను పిలిచేలోగానే వారు మసీదులోనికి ప్రవేశించారు. ఈ వివరాలన్నిటినీ నాటి అయోధ్య పోలీస్ స్టేషన్ సబ్ ఇనస్పెక్టర్ రామ్‌దూబే ఎఫ్.ఐ.ఆర్‌లో వ్రాసి జిల్లా మేజిస్ట్రేటు శ్రీ కె కె నయ్యర్‌కు పంపారు. 1949 డిసెంబరు 23న ఉదయం పదిన్నర గంటలకు శ్రీ నాయర్ ముఖ్యమంత్రి శ్రీ గోవింద వల్లభపంత్‌కూ చీఫ్ సెక్రటరీకి,హోమ్ సెక్రటరీకి రేడియో సందేశం పంపారు. దానిలో ఇలా ఉంది. "నిన్న రాత్రి కొద్ది మంది హిందువులు బాబ్రీ మసీదులో ప్రవేశించి అక్కడ విగ్రహాలు ఉంచారు. డి.యంగారు, ఎస్.పిగారు ఇప్పుడా ప్రదేశంలో ఉన్నారు. పరిస్థితి అదుపులో ఉంది. రాత్రి 15 మందితో కూడిన పోలీసు బృందం అక్కడ డ్యూటీలో ఉంది. కాని వారు ఎలాంటి చర్యలు తీసుకోలేదు.

జరిగిన విషయాన్ని విన్న ప్రధాని నెహ్రూగారు, నాటి హోం మంత్రి సర్దార్ పటేల్‌ను మండి పడ్డారు. విగ్రహాన్ని అక్కడి నుండి తొలగించమని ఆదేశించారు. అయితే దీనివల్ల చాలా ఇబ్బందులు ఎదురవుతాయని పలువురు అమాయకులు ప్రాణాలు కోల్పోతారనీ వాదిస్తూ జిల్లా మేజిస్ట్రేట్ శ్రీ నాయర్ విగ్రహం తొలగింపుకు అడ్డుపడ్డారు. చివరకు ఆయన స్థానంలో కొత్త మేజిస్ట్రేటు శ్రీ మార్కండేయ సింహను నియమించడం జరిగింది. కొత్త మేజిస్ట్రేటు ఆదేశం ప్రకారం 1949 డిసెంబరు 29న ఆ ఆవరణకు తాళాలు వేయబడ్డాయి.

ఇక్కడ ఆసక్తి దాయకమైన అంశమేమంటే కె కె.నయ్యర్ ఆ తర్వాత పదవికి రాజీనామా చేసి, జనసంఘ్ అభ్యర్థిగా పోటిచేసి, పార్లమెంటు సభ్యుడయ్యాడు. ఆయన ఫోటో ఇప్పటికీ మసీదులో వేలాడుతూ ఉంటుంది.

కొందరు దుండగులు మసీదులో రామ్‌లాలా విగ్రహాన్నుంచడం వాస్తవం కాగా, దీనిని హిందూ మతోన్మాదులెట్లాంటి కల్పనలో ఉపయోగించడానికి ప్రయత్నించారో గమనించండి. వారు వర్తమాన చరిత్రకే మసిబూసి మారేడు కాయ చేయడానికి ప్రయత్నించారు. 1987 మార్చి 29 నాటి 'ఆర్గనైజర్ పత్రికలో 1949 డిసెంబరు 22 నాటి సంఘటనలను వాళ్ళు ఇలా పత్రికీకరించారు. "ఆనాడు అర్థరాత్రి దాటిన తర్వాత బ్రహ్మాండమైన వెలుగు ఒక్కసారి ఆ ప్రదేశాన్ని ఆవరించింది. అందరు భక్తుల కళ్ళు మిరుమిట్లు గొలిపాయి. అందరూ దిగ్భ్రాంతి నుండి కోలుకొనేటప్పటికే అక్కడ వెలుగు అంతరించి రామ్‌లాలా విగ్రహం ప్రత్యక్షమయింది. వేలాది మంది భక్తులు ఆనందపరవశులయ్యారు. దీనిని స్వయంగా అల్లా బక్షు అనే ముస్లిం హవల్దార్ జిల్లా మేజిస్ట్రేటు శ్రీ కె.కె. నయ్యర్‌కు విన్నవించుకున్నాడు".

ఈ కాకమ్మ కథకు పోలీసు ఎఫ్.ఐ.ఆర్. తిరుగులేని సమాధానమిస్తోంది. మసీదుకు తాళాలు వేయబడటంతో, బి.జె.పి. కూటమి కార్యక్రమాలకు తాత్కాలికంగా తెరపడింది. అయినా వాళ్ళు మరలా శక్తిని కూడగట్టుకొని 1984లో 'తాళాఖోల్' ఉద్యమం ఆరంభించారు కాని పెద్దగా సఫలీకృతులు కాలేదు.

1986లో వారు మరో ప్రయత్నం ఆరంభించారు. 1986 జనవరి 25న ఒక స్థానిక న్యాయవాది మున్సిఫ్ కోర్టులో గేట్లు తాళాలు తెరవాలని కోరుతూ ఒక దరఖాస్తు పెట్టుకున్నాడు. "ఆస్తికిసంబంధించిన వివాదం హైకోర్టులో పెండింగులో ఉంది కాబట్టి ఆదేశాలు అక్కడి నుండే తెచ్చుకోవాల"ని పేర్కొంటూ మున్సిఫ్

యీ దరఖాస్తును తిరస్కరిస్తూ తీర్పు చెప్పారు. అయితే కేవలం 6 రోజుల తర్వాత 1986 జనవరి 31వ తేదీన ఆ న్యాయవాది ఫైజాబాద్ జిల్లా జడ్జి ముందు అప్పీలు చేసుకున్నాడు. విచారణ, ఆ మరునాడు, అంటే ఫిబ్రవరి 1వ తేదీన ప్రారంభమైంది. విచారణ విషయం తెలిసిన మహమ్మదు హాషీదు అనే స్థానిక లాయరు, పై కేసులో తనను కూడ ప్రతివాదిగా చేర్చుకొమ్మని కోరాడు. అతని కోరికను కోర్టు తిస్కరించింది. జిల్లా కలెక్టరును, ఎస్.పి.ని పిలిపించి, "పై కట్టడం తాళాలు తెరిపిస్తే శాంతి భద్రతలకేమైనా భంగంవాటిలుతుందని అని వారిని ప్రశ్నించడం జరిగింది. వారు శాంతి భద్రతల పరిస్థితి కేమి భంగవాటిల్లదని సమాధానమిచ్చారు. కేసు విచారణ కేవలం 40 నిముషాలలో పూర్తయింది. జిల్లా జడ్జి శ్రీ కె ఎం. పాండే తన తీర్పులో, ఇలా పేర్కొన్నాడు." వాదప్రతివాదాలు విన్న తర్వాత పై కట్టడం తాళాలు తీయించినంత మాత్రాన శాంతిభద్రతలకు భంగం వాటిల్లదని కోర్టు నిర్ధారించుకొని తాళాలు తీయమని ఆదేశిస్తున్నది" అదే రోజు సాయంత్రం వివాదాస్పద కట్టడం తాళాలు తీయబడటం, పూజా కార్యక్రమాలు నిర్వహించబడటం, ఆ వార్తను వివరంగా దూరదర్శన్‌లో ప్రసారం చేయడం జరిగింది. ఇది ఎలా జరిగింది?

"తనను ప్రతివాదిగా చేర్చుకొమ్మని" కోరితే తిరస్కరించిన న్యాయమూర్తి తన తీర్పులో "వాదప్రతివాదాలు విన్న తర్వాత" అని పేర్కొనడం ఎందుకు జరిగింది? 37 సంవత్సరాలుగా నలుగుతున్న ఒక కేసు విచారణ కేవలం 40 నిముషాలలో ఎలా ముగిసింది? దీని వెనుక ఏ బలమైన స్వార్థపరశక్తులు న్నాయి? దీనికి సమాధానం **శ్రీ అరుణ్‌నెహ్రూ మాటల్లో** తెలుసుకుందాం. ఆయన 'అక్బర్-ఎ-నావు' అనే పత్రిక కిచ్చిన ఇంటర్వ్యూలో ఇలా అన్నాడు. **"వివాదాస్పద కట్టడంపై విచారణ తతంగం, అదేరోజు తాళాలు తీయబడటం, ఆ కార్యక్రమాన్ని దూరదర్శన్‌లో చూపబడటం ఎలాజరిగింది? దీనికి బాధ్యులెవరని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీని నేనడిగితే ఆయన నవ్వి "ఇది ముస్లిం మహిళల రక్షణ బిల్లుకు 9.11.89 గా నిర్ణయించారు. అయితే అట్టి ప్రయత్నాన్ని వ్యతిరేకిస్తు దాఖలైన కేసులో విరుగుడు అని సమాధానమిచ్చాడు.** అంటే అటు ఛాందసవాద ముస్లిములను, ఇటు మతోన్మాద హిందువులను ఏకకాలంలో సంతృప్తి పరిచేకుట్ర రాజకీయాలకు పరాకాష్టయే ఆ వివాదాస్పద కట్టడం తాళాలు తీయించబడిన డ్రామా అని అర్థం కావడంలేదా?

దానితో మతోన్మాదులకు ఉత్సాహం పెరిగింది. వారు విజృంభించి ప్రవర్తించనారంభించారు. మసీదుమధ్య బాగమే రామ జన్మభూమియని, అదిగర్భగృహంగా వచ్చేట్లుగా బ్రహ్మాండమైన దేవాలయం నిర్మిస్తామని ప్రచారం మొదలెట్టారు. విరాళాలు సేకరించడం ఆరంభించారు. ఆ దేవాలయ నిర్మాణానికి శిలాన్యాస్ (శంకుస్థాపన) తేదీని 14 8.89న అలహాబాద్ హైకోర్టు యొక్క లక్నోబెంచి తీర్పుచెబుతూ "మరల కోర్టు ఆదేశాలు యిచ్చేవరకు ఇప్పుడున్న ఆస్తి స్వరూపాన్ని మార్చరాదు" అని ఆదేశించింది. దానికి వివరణగా 7.11.89న ఇచ్చిన తీర్పులో "14 8.89న ఇచ్చిన ఆదేశంలో చెప్పినట్లుగా కేసులో మొత్తం ఆస్తి, 586వ నంబరు ప్లాటుతో సహా ( శిలాన్యాస్ ఉద్దేశించబడింది యీప్లాటులోనే) నిర్మాణ స్వరూపం మార్చరాదు" అని ఆదేశించింది విచిత్రమైన విషయం ఏమిటంటే

"వివాదాస్పద కట్టడంపై విచారణ తతంగం, అదేరోజు తాళాలు తీయబడటం, ఆ కార్యక్రమాన్ని దూరదర్శన్‌లో చూపబడటం ఎలాజరిగింది? దీనికి బాధ్యులెవరని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీని నేనడిగితే ఆయన నవ్వి "ఇది ముస్లిం మహిళల రక్షణ బిల్లుకు 9.11.89 గా నిర్ణయించారు. అయితే అట్టి ప్రయత్నాన్ని వ్యతిరేకిస్తు దాఖలైన కేసులో విరుగుడు అని సమాధానమిచ్చాడు.

27 9.89న విశ్వహిందూ పరిషత్, ప్రభుత్వంతో ఒక ఒప్పందాన్ని కుదుర్చుకుంది దానిపై అశోక్ సింఘాల్, మహంత్ అవైద్యనాథ్ కూడా సంతకాలు చేశారు. దానిలోని 'ఎఫ్' క్లాజులో ఇలా వుంది. "14 8 89న అలహాబాద్ హైకోర్టు యొక్క లక్నో బెంచి ఆదేశానికి అనుగుణంగా వ్యవహరిస్తామని వి హెచ్.పి అంగీకరిస్తోంది." అయితే ఈ ఒప్పందం కొద్ది రోజుల్లోనే గాలికి వదలివేయబడింది. 9 11 89న రాజీవ్‌గాంధీ ప్రభుత్వ అంగీకారంతో 586వ నంబరు ప్లాటులో శిలాన్యాస్ జరిగింది. హైకోర్టుతీర్పు ఉల్లంఘించబడింది. ఇక ఇక్కడినుంచి కోర్టుల ఉల్లంఘన, రాజ్యాంగ ఉల్లంఘనల పర్వం ఆరంభమైంది. ఆ తర్వాత జరిగిన 1989 ఎన్నికల్లో బి జె.పి. అంతకుముందున్న 2 స్థానాల నుండి 82 స్థానాలకు పెరిగింది. దీనితో బి.జె పి. కూటమివారు అయోధ్య సమస్యను రెచ్చగొట్టడమే అధికారానికి సోపానమనే నిర్ణయానికి వచ్చారు. 1990 అక్టోబరు 30న కరసేవా దినంగా నిర్ణయించారు. బి జె పి నాయకుడు అద్వానీ ఎ.సి. రథయాత్ర ఆరంభమయింది. యాత్రలో కార్యకర్తల నినాదాలీవిధంగా ఉండేవి.

"కొట్టు,కొట్టు,కొట్టు, ఇంకోదెబ్బకొట్టు బాబ్రీ మసీదును కూలగొట్టు"

"ముస్లింలారా! వెళ్తే పాకిస్తాన్ వెళ్ళండి! లేదా ఖబర్‌స్తాన్ (స్మశానం) పంపిస్తాం!"

అద్వానీ వేదికలెక్కి అత్యంత విషపూరితమైన అబద్ధప్రచారం చేశాడు. సర్దార్ పటేల్ బ్రతికుంటే యీనాడు మసీదును కూలగొట్టి మందిరం నిర్మించేవాడంటూ చరిత్రను, సర్దార్‌పటేల్ వ్యక్తిత్వాన్ని వక్రీకరించాడు కాని చరిత్రకారులు 1949 డిశంబరు 22 సంఘటన తర్వాత సర్దార్ పటేల్, గోవిందవల్లభపంత్‌కు వ్రాసిన లేఖనొకదాన్ని వెలికి తీశారు దానిలో ఆయన మసీదులో విగ్రహాలను బలవంతంగా ఉంచడం అనే చర్యను ఖండిస్తూ" ఇటువంటి వివాదాలను దౌర్జన్యంతో పరిష్కరించడానికి ఎవరూ ప్రయత్నించరాదు. అట్టి పరిస్థితులలో శాంతిభద్రతల యంత్రాంగం ఎట్టి పరిస్థితులలోనైనా శాంతిని కాపాడటానికి ప్రయత్నించాలి దౌర్జన్యం, బలవంతంతో కూడిన ఏకపక్ష చర్యలను సహించరాదు" అని వ్రాస్తాడు అయినా అద్వానీ విషపూరిత ప్రచారం ఆగలేదు కొన్ని బడా పత్రికలు ఆయన అబద్ధ ప్రచారానికి అత్యంత ప్రాధాన్యతనీయడం, భారత దేశ దురదృష్టం. చివరకు అద్వానీ రథాన్ని బీహారులో నిలవరించడం, వి పి సింగ్ ప్రభుత్వానికి బి జె పి మద్దతు ఉపసంహరించడం, ఆకారణంగా జనతాదళ్ ప్రభుత్వం పడిపోవడం జరిగింది. ఆ తర్వాత జరిగిన 1991 ఎన్నికల్లో బి.జె పి. బలం 117కి పెరిగింది. దురదృష్టవశాత్తు మతోన్మాదుల బలం మరింత పెరిగింది. వారి ఉత్సాహం ఇనుమడించింది.

కరసేవ ప్రయత్నం అనంతరం మరో విషపూరిత ప్రచారాన్ని బి జె.పి. కూటమి చేపట్టింది. కరసేవ సందర్భంగా 59మంది చనిపోయినారనీ, వారి చితా భస్మాన్ని దేశమంతా తిప్పుతున్నాం, శ్రద్ధాంజలి ఘటించండని కోరుతూ, కొంతచితా భస్మాన్ని దేశమంతటా త్రిప్పింది. అయితే వారు ప్రకటించిన మృతుల జాబితాను పరిశోధించిన 'ఫ్రంట్ లైన్' పరిశోధక బృంధం వారిలో నలుగురు సజీవంగా ఉన్నారనీ, ఐదుగురు అంతకు ముందెప్పుడో వారిగ్రామాలలో చనిపోయినారనీ, ఫోటోలు, సాక్ష్యాలతో ప్రకటించి మతోన్మాదుల అబద్దాలపుట్టలను మరోసారి బద్దలు కొట్టింది.

# బ్రిటిష్ హయాంలో నడిచిన అయోధ్యా వ్యాజ్యాలు

ఆనాడు చెప్పిన రామజన్మభూమి వేరు– ఈనాడు చెబుతున్నది వేరు

1838లోనే యాంట్‌గోమరీ మార్టిన్ అనే ఆయన అయోధ్య–ఫైజాబాద్ అనే జంట నగరాలను పేర్కొని అయోధ్యను హిందూనగరంగానూ, ఫైజాబాద్‌ను ముస్లిం నగరంగాను పేర్కొన్నాడు. కాని 1869 సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం అయోధ్యలో హిందువుల శాతం 66 4 ఫైజాబాద్‌లో హిందువుల శాతం 66. మార్టిన్ విభజనకు కారణం బ్రిటిష్ వారి కుటిలత్వం తప్ప మరొకటి కానరాదు.

హెచ్.ఎమ్.ఇలియట్ అనే ఆంగ్ల రచయిత మరీ బరితెగించాడు. అతను 1860లో ఇలా వ్రాశాడు. "విక్రమ్ జిత్ అనే పేరుగల విక్రమాదిత్యుడు అయోధ్యకు వచ్చి 360 దేవాలయాలు నిర్మించాడు. వానిలో జన్మస్థాన్ దేవాలయాన్ని బాబర్ పడగొట్టి మసీదు నిర్మించాడు" దీని కతను ఏ చారిత్రికాధారమూ చూపలేదు. మతోన్మాదులీనాడు ఇటువంటి విషపూరిత రాతలనే ప్రబలమైన సాక్ష్యాలుగా పేర్కొంటున్నారు. వాటిని ప్రముఖ చరిత్రకారులు సోదాహరణంగా ఖండించారు.

1870లో బ్రిటీషు ఉద్యోగి పి.కార్నెగీ "ఫైజాబాద్ తహసీల్ యొక్క చారిత్రిక సమాచారం" అనే గ్రంథంలో మొగలుల చేత అయోధ్యలో మూడు దేవాలయాలు పడగొట్టబడ్డాయి" అని వ్రాస్తూ, మహమ్మదీయులు తాము జయించిన ప్రదేశాల్లో తమ మతాన్ని బలవంతంగా అంగీకరింప చేయడమనే నియమం దీనికి కారణంగా చెప్తాడు. 1905లో ఫైజాబాద్ గజటీర్‌లో హెచ్ఆర్ నెవెల్లీ కార్నెగి రాతలనే మక్కీకి మక్కీదించాడు. 1923లో మిసెస్ బెవరిడ్జ్ అనే ఆంగ్లవనిత బాబర్ నామాను ఆంగ్లంలోకి అనువదించి దానిలో బాబర్ అయోధ్యలో రామాలయాన్ని కూలగొట్టాడని వ్రాసి దానికి కార్నెగీ చూపిన కారణాన్నే చూపింది. అయితే నిజంగానే బాబర్ పరమత సహనం లేని మతోన్మాదా? పరిశీలిద్దాం.




బాబర్ పెషావర్‌లోని గురుఖత్రీ ఆలయాన్ని సందర్శించారు. హిందూ యోగులతో పాటు ఒక ముస్లిం కూడా ధ్యానం చేసిన కబ్వా అనే చోటకి వెళ్ళాడు. గ్వాలియర్‌లో మసీదు ప్రక్కనే ఉన్న దేవాలయాన్ని దర్శించాడు. ఆ దేవాలయాల శిల్పశోభను మెచ్చుకున్నాడు. కాని వాటిని పడగొట్టించలేదు. అయోధ్యలోనే ఉన్న ఒక సన్యాసికి శిస్తులేని విధంగా పెద్ద భూభాగాన్ని దానం చేశాడు. (అనాటమీ ఆఫ్ కన్‌ఫ్రన్‌టేషన్ రచన. ఎస్. గోపాల్ పేజీ 12) ఇంత పరమత సహనమున్న బాబర్ "ముస్లిం మత నియమానుసారం" అయోధ్యలోని ఆలయాన్ని కూల్చాడని వ్రాయటం కుట్ర కాక మరేమి అవుతుంది?

అయోధ్యలో 1855లో ఒక ముఖ్య సంఘటన జరిగింది. దానిని ప్రముఖ చరిత్రకారుడు ప్రొ॥ కె ఎన్ ఫణిక్కర్ ఇలా వర్ణిస్తారు. కొంతమంది ఛాందస సున్నీ ముస్లిం ప్రజలు షాగులామ్ హుస్సేన్ అనే ఆయన నాయకత్వంలో అయోధ్యలో హనుమాన్ ఘరీ అనే దేవాలయం స్థానంలో మొదట ఒక మసీదు ఉండేదనే సాకుతో ఆ దేవాలయం మీద దాడి చేశారు. కాని హిందూ బైరాగులు స్థానిక భూస్వాముల సహాయంతో వారిని తరిమి కొట్టడమేకాక పారిపోయి బాబ్రీ మసీదులో తలదాచుకున్న వారిని ఊచకోత కోశారు. విచిత్రమైన విషయం ఏమిటంటే ఆ తర్వాత ఆ బైరాగులు హనుమాన్ ఘరీకి తిరిగి వెళ్ళారు. అంతే కాని బాబ్రీ మసీదును ఆక్రమించలేదు. కనీసం దానిపై తమ హక్కును కూడా ప్రకటించలేదు.

ఇంతటితో హనుమాన్ ఘరీ వివాదం సమసి పోలేదు. ఇరు వర్గాలలో మత ఉద్రేకాలు పెరుగుతున్న సమయంలో అవధ్ నవాబు దానిపై ఒక కమిటీ వేశాడు. ఆ కమిటీ హనుమాన్ ఘరీ స్థలంలో అంతకు ముందెన్నడూ మసీదు లేదనే నిర్ణయానికి వచ్చింది. ఈ తీర్పు నచ్చని ముస్లింలు మౌల్వీ అమీర్ ఆలీ నాయకత్వంలో హనుమాన్ ఘరీని స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. ఇప్పటి వరకూ బాబ్రీ మసీదు ఒక వివాదాస్పద స్థలం కాకపోవడం అత్యంత ప్రధాన విషయం. అయితే ఎప్పుడైతే హనుమాన్ ఘరీ దేవాలయం కోసం ముస్లింలు తీవ్ర ప్రయత్నాలు మొదలెట్టారో దానికి ప్రతిగా ఆ దేవాలయ మహంత్ బాబ్రీ మసీదు స్థలాన్ని వివాదాస్పదం చేయనిశ్చయించాడు. 1857 ప్రప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ఆయన బ్రిటిష్‌వారికి సహకరించిన కారణంగా ఆయనకు వారి అండ లభించింది. 1858లో బాబ్రీ మసీదు బయటి ఆవరణలో కొంత స్థలాన్ని ఆక్రమించి అక్కడ ఒకవేదిక నిర్మించి దానిపై సీతారాముల విగ్రహాలను ప్రతిష్టించాడు. దానిని రామ జన్మస్థాన్‌గా ప్రకటించాడు. 1858 నవంబర్ 30న బాబ్రీ మసీదు యొక్క ఖతిర్ మరియు మువాజిన్ అయిన మౌల్వీ మహమ్మద్ అస్ఘర్ అనే ఆయన మేజిస్ట్రేటు కోర్టులో ఇలా నివేదించుకున్నాడు. "హిందూ బైరాగులు మసీదుకు దగ్గరగా ఒక వేదిక నిర్మించి, మసీదు గోడలపై "రామ, రామ" అనే పదాలు వ్రాశారు" 1860, 1877, 1883,1884లలో కూడా పై విషయం కోర్టు వారికి విన్నవించుకున్నా ఫలితం లేకపోయింది. ఇదీ అయోధ్యలోని బాబ్రీమసీదు రామజన్మభూమి వివాదం ఆరంభఘట్టం.

రామజన్మస్థాన్ చబుత్రా మహంత్‌గా ప్రకటించుకున్న రఘువరదాస్ 1885లో ఎదురుదాడి ప్రారంభించాడు. ఆ సంవత్సరం జనవరి 19న ఆయన రామజన్మ స్థాన్ అయిన రామచబుత్రాపై దేవాలయం నిర్మించడానికి అనుమతించాలని ఫైజాబాద్ సబ్ జడ్జీ కోర్టులో వ్యాజ్యం ప్రారంభించాడు. 1885 ఫిబ్రవరి 24న సబ్ జడ్జీ పండిట్ హరికిషన్ చబుత్రాను రామజన్మస్థాన్‌గా అంగీకరిస్తూనే, అది మసీదు ప్రక్కనే ఉందనే కారణంతో ఆలయ నిర్మాణానికి అనుమతిని నిరాకరించాడు. రఘువరదాస్ జిల్లా జడ్జీకి అప్పీలు చేసుకున్నాడు. 1886 మార్చి 17న జిల్లా జడ్జీ కర్నల్ జె.యు.ఎ. ఛాంబియర్ ఆ ప్రదేశాన్ని స్వయంగా చూసి 1886 మార్చి 26న తీర్పు చెప్పారు. దానిలో ఆయన ఇలా పేర్కొన్నాడు. "మసీదు ఆవరణ ప్రవేశ ద్వారం దాటిన వెంటనే ఎడమ ప్రక్క హిందువుల ఆధీనంలో చబుత్రా అనే వేదిక ఉంది. దాని మీద చెక్కలతో తయారయిన శిబిరం లాంటినిర్మాణం ఉంది. ఈ చబుత్రాయే రామచంద్రుని జన్మస్థలాన్ని సూచిస్తుందని వాది పేర్కొంటున్నాడు" తన తీర్పులో ఆయన "ఇరువర్గాల వారు ఇప్పుడున్నట్లు ఉండాలనటమే ఇప్పుడు మనం చేయగలిగింది" అని చెప్పారు. 1886 మే 25న ఔధ్ జ్యుడిషియల్ కమీషనర్ ముందు రఘువరదాస్ చేసుకున్న అప్పీలు కూడా కొట్టి వేయబడింది

మనం గమనించవలసిన విషయమేమంటే ఆనాడు రామ్ చబుత్రా మహంత్ చబుత్రాను జన్మస్థాన్‌గా చెప్పాడే గాని మసీదును కాదు. ఇంతటితో మహంత్ తన ప్రయత్నాలను నిలిపివేశాడు. అయితే బ్రిటిష్ ప్రభుత్వం యీ వివాదాన్ని కొనసాగించడం కోసం 1902లో మరో ప్రయత్నం చేసింది. ఆ సంవత్సరంలో ఫైజాబాద్ జిల్లా మెజిస్ట్రేట్ మసీదు ముందు "నంబర్-1 రామజన్మభూమి" అనే శిలా ఫలకాన్ని పెట్టించాడు. అయినా సమస్య రాజుకోలేదు. పరిస్థితులలో మార్పేమీ రాలేదు. 1949 వరకు పరిస్థితి అదే రకంగా కొనసాగింది.

అసమర్థతకు, ప్రజావ్యతిరేకతకు [illegible]

# బిజెపి రాష్ట్ర ప్రభుత్వాలు

కాంగ్రెస్ (ఐ) పాలనవల్ల ఏర్పడిన దుష్ఫలితాలన్నింటినీ పరిష్కరిస్తానని బి.జె.పి. గొప్పలు చెప్పుకుంటున్నది. ఈ దేశానికి తానే ఏకైక ప్రత్యామ్నాయమని పోజులు పెడుతున్నది. కాని ఈ పార్టీ దేశంలోని అతి పెద్ద రాష్ట్రమైన యు.పి.తో సహా నాలుగు రాష్ట్రాలలో ప్రభుత్వాలను వెలగబెడుతున్నది. బి.జె.పి. నిజ స్వరూపాన్ని బట్టబయలు చేయడానికి ఈ రాష్ట్రాలలో పరిపాలన తీరు సరిపోతుంది

హిమాచల్ ప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల సమ్మెను క్రూరంగా అణచివేసింది. వందలాది కార్మికులను తొలగించింది. సైన్యాన్ని వినియోగించింది. ఎస్మా, నాసా, టాడా, వంటి నిరంకుశ చట్టాలను అమలు చేసింది. పైగా కార్మికులకు వ్యతిరేకంగా ఈ నిర్బంధ విధానాలు విజయవంతమైనాయని ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి శాంతకుమార్ గొప్పగా ప్రకటించుకున్నాడు. రాజస్థాన్‌లోని కుమ్హేర్‌లో షెడ్యూల్డ్ కులాలకు చెందిన 14 మంది దారుణంగా ఊచకోత కోయబడ్డారు. అక్కడ ఘర్షణ తలెత్తే అవకాశం గురించి ముందుగా హెచ్చరికలు చేసినా ఫలితం లేకపోయింది. ఎస్.సి.లకు రక్షణ కల్పించటంలో అధికార యంత్రాంగం ఘోరంగా విఫలమైంది.

మధ్యప్రదేశ్‌లోని భిలాయ్‌లో పోలీసులు కాల్పులు జరిపి 16 మంది కార్మికులను దుర్మార్గంగా చంపి వేశారు. పెట్టుబడిదారీ అనుకూల విధానాలను అనుసరిస్తూ, కార్మిక నాయకుడు శంకర్ గుహనియోగిని హత్య చేసిన వారికి రక్షణ కల్పిస్తున్న రాష్ట్ర ప్రభుత్వాన్ని నిరసించడమే వారి నేరం. బలహీన వర్గాలపైన, మహిళలపైన అణచివేత బాగా అధికమైంది. రాష్ట్రంలో అవినీతి అవధులు లేకుండా పెరిగిపోతున్నది. ఆర్.ఎస్.ఎస్. ఆధ్వర్యంలోని సహకార సంఘాలకు కేటాయించడం ద్వారా ప్రజా పంపిణీ వ్యవస్థ అర్థరహితమైన దిగామార్చి వేశారు. అవినీతి గురించి ప్రతిపక్షాలే కాదు, బి.జె.పి.కి చెందిన వారే ధ్రువీకరిస్తున్నారు. మధ్యప్రదేశ్ ప్రభుత్వం ప్రైవేటీకరణను అమిత వేగంతో ముందుకు తీసుకువెళ్తున్నది బింద్వారా థర్మల్ విద్యుత్ కేంద్రాన్ని ఇప్పటికే బిర్లాలకు



కట్ట బెట్టింది విద్యుత్ బోర్డు, వాటర్ వర్క్స్, పి.డబ్ల్యు.డి., ఇరిగేషన్ మొదలైన శాఖలలో అనేక ఉద్యోగాలు కంట్రాక్టర్లకు అప్పగించబడుతున్నాయి. అనేక ప్రభుత్వ రంగ, సంయుక్త రంగ సంస్థలను ప్రైవేటు వ్యక్తులకు అప్పగించేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి.

షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, ఇతర బలహీన వర్గాలపై జరుగుచున్న అత్యాచారాలు అరికట్టాలంటే కేవలం శాంతిభద్రతల చర్యలే సరిపోవు. అసలు సమస్య భూ సంబంధాలలో ఉంది. సమగ్రమైన భూ సంస్కరణలను అమలు చేసినపుడు మాత్రమే ఈ సమస్యకు అసలైన పరిష్కారం లభిస్తుంది కాని బిజెపి ప్రభుత్వాలేవీ భూసంస్కరణాల ఊసే ఎత్తడం లేదు.

గత ఏడాది ఉత్తర ప్రదేశ్‌కు ఋతుపవనాలు ఆలస్యంగా రావటంతో పంటకు విపరీతమైన నష్టం వాటిల్లింది. దీనితో రైతాంగానికి కొన్ని వందల కోట్ల రూపాయల మేరనష్టం వాటిల్లింది. యుద్ధ ప్రాతిపదికపై ఈ పరిస్థితిని ఎదుర్కోవటానికి బదులు బి జె పి ప్రభుత్వం రామమందిర నిర్మాణం గురించి చెప్పసాగింది. గత అక్టోబర్ 20న ఉత్తరప్రదేశ్‌లో సంభవించిన భూకంప బాధితులను ఆదుకోవటంలో కూడా ప్రభుత్వం యిదే వైఖరిని అవలంభించింది. ఉత్తర ప్రాంతానికి చెందిన మూడు జిల్లాలో భూకంపం కారణంగా ప్రజల ఆస్తులకు, ప్రాణాలకు తీవ్ర నష్టం వాటిల్లిన సంగతి అందరకూ తెలిసిందే. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలే కాక అనేక స్వచ్ఛంద సంస్థలు, రాజకీయ పార్టీలు చేతనైన మేరకు సహాయాన్ని అందించేటందుకై భూకంప ప్రాంతాలకు వెళ్ళాయి. అయితే బి.జె.పి. ప్రభుత్వం మాత్రం పార్టీ ప్రచారంగానే యీ కార్యక్రమాన్ని చేపట్టింది ఆర్.ఎస్.ఎస్. అధీనంలోని సంస్థలు కాషాయి వర్ణ పతాకాల నీడన సహాయక సామగ్రిని బాధితులకు అందజేసింది. ఇదీ ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్దానాలలో ఒకటైన 'రోటీ'కి సంబంధించిన బి.జె.పి. వ్యవహరిస్తున్న తీరు ఈ ఏడాది సైతం రాష్ట్రంలో అనేక ప్రాంతాలలో అనావృష్టి పరిస్థితి నెలకొన్నది. సాధారణంగా 56 లక్షల హెక్టార్లలో వరి సాగవుతూ వుంటుంది అయితే ఈ ఏడాది వర్షపాతం తక్కువగా వుండటంతో సగం ప్రాంతాలలో మాత్రమే వరిని నాటగలిగారు. విద్యుత్ సరఫరా అరకొరగా వుండటం, కాలువలకు గండ్లు పడటం, భూసారం క్షీణించి పోవటం, నీరింకిన బావుల కారణంగా వేసిన పంట కూడా తీవ్రంగా దెబ్బతిన్నది.

గత 14 నెలల కాలంలో కాలంలో యు.పి.లో ప్రజా పంపిణీ వ్యవస్థ దాదాపు కుప్పకూలిపోయింది. దీనితో గోధుమలు, బియ్యం, కిరోసిన్, వంట నూనెలు తదితరమైన వాటిని కొనలేక పేద ప్రజలు సతమతమవు తున్నారు. ఈ నిత్యావసర సరుకులు ప్రత్యేకించి గ్రామీణ ప్రాంతాలలోని చౌక డిపోలలో ఎప్పుడోగాని కనిపించటం లేదు. ఇది చాలదన్నట్లుగా రేషన్‌కార్డులను దొంగ కార్డులనే పేరుతో రద్దు చేశారు కొత్తవాటిని జారీ చేయలేదు బ్లాక్ మార్కెట్‌లో అందివేసేవ [illegible] చౌకదుకాణాలను అప్పచెప్పారు. [illegible] మద్దతుదారులేకాక ఆర్థిక పోషకులు కూడా తత్కారణంగానే వారికి చౌకడిపోలను అప్పచెప్పటం జరిగింది. ఆ విధంగా వారు

ప్రజలకు తిండిపెట్టడం కాక వారి తిండిని కూడా లాగివేసుకొంటున్నారు.

ప్రజలకు ఉపాధి కలిగించే అభివృద్ధి పథకాలు ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నట్లుగా వుండిపోయాయి. ఇందుకు కొన్ని ఉదాహరణలు చూపవచ్చును.

ఇంతకు ముందు ములాయంసింగ్ ప్రభుత్వం రు 20 కోట్లతో పూర్వాంచల్ అభివృద్ధి నిధిని ఏర్పాటు చేసింది దీనిని రద్దు చేయటంతో తూర్పు ప్రాంతంలోని ప్రజలు కోసరా ఉద్దేశించిన అభివృద్ధి కార్యక్రమాలు త్రిశంకు స్వర్గంలో పడిపోయాయి

ఎన్ డి. తివారీ కాంగి ప్రభుత్వం ప్రవేశపెట్టిన 554 పథకాలలో 40 పథకాలను, ములాయంసింగ్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన 397 పథకాలలో 237 పథకాలను బి.జె.పి. ప్రభుత్వం నిలిపివేసింది. ఈ పథకాలపై వెచ్చించిన కోట్లాది రూపాయలు గంగపాలయ్యాయి

పైన పేర్కొన్న రెండు ప్రభుత్వాలు ప్రాథమిక పాఠశాలల నిమిత్తం 1989-90, 1990-91లో వరుసగా రు.59,07,60,000, రు.45,77,40,000 కేటాయించాయి. ఈ కాలంలో 4604 ప్రాథమిక పాఠశాల భవనాలను నిర్మించటంతో పాటు 402 భవనాలకు మరమ్మతులు చేపట్టాయి. అయితే గత 14 మాసాల బి జె పి. పాలనలో ఒక్క భవనాన్ని కూడా నిర్మించలేదు. కేవలం 96 భవనాలకు మాత్రం మరమ్మతులు చేయడం జరిగింది. రహదారులు, చిన్న చిన్న వంతెనల నిర్మాణం వంటి కొద్దిపాటి పథకాలను కూడా నిలిపివేయడం జరిగింది

గత ప్రభుత్వాలు చేపట్టిన ఈ కార్యక్రమాలకు పథకం అంటూ లేదని వనరులను దృష్టిలో పెట్టుకోకుండా రూపొందించిన వని బి.జె పి నాయకులు ఆరోపిస్తున్నారు. కనుక వాటిని నిలిపివేయటం జరిగింది 1992-93 బడ్జెట్‌లో రాష్ట్ర ప్రభుత్వం కొంత మొత్తాన్ని కేటాయించింది. అయితే శాసనసభ ముగిసిన రెండు వారాల తరువాత 20 శాతం కోత విధించడం జరిగింది.

శాంతి భద్రతల పరిస్థితి క్షీణించిపోయింది. ఆ ..వద్నాలుగు మాసాల కాలాన్ని పరిశీలించినట్లయితే రాష్ట్ర రాజధానియైన లక్నోలో సగటున ప్రతిరోజూ ఒక హత్య, రెండు దారిదోపిళ్ళు జరిగాయి. 1991 జనవరి-ఏప్రిల్ మధ్య కాలంతో పోల్చితే 1992 జనవరి - ఏప్రిల్ కాలంలో దొంగతనాలు 18 62 శాతం, ఘర్షణలు 8 శాతం, దారిదోపిడీలు 15.10 శాతం, హత్యలు 8 51 శాతం, ఇళ్ళను దోచుకోవటం 16 33 శాతం, ఇతర నేరాలు 15 శాతం పెరిగాయి. ఈ కాలంలోనే ఉగ్రవాదులు 90 మందిని హతమార్చారు. శాంతిభద్రతల సమస్యపై ఇటీవలే రాష్ట్ర పోలీసుశాఖ విడుదల చేసిన నివేదిక నుండి ఈ గణాంక వివరాలను ఉదహరించడం జరిగింది ఈ ఏడాది మొదటి మూడు మాసాలలో 74 మంది హరిజనులు హత్య గావించబడ్డారని కూడా ఈ నివేదిక తెలుపుతోంది. కాగా, 1991లో 65 మంది, 1990లో 57 మంది హతులయ్యారు. వరకట్న మరణాలు, మానభంగాల కేసులు విపరీతంగా పెరిగాయి. బి జె.పి. నెలకొల్పిన భయరహిత సమాజం ఇదే .

విదారంగంలో ప్రభుత్వం అనేక ప్రతీఘాత చర్యలను చేపట్టింది. ఇంకా యీ క్రమం కొనసాగుతున్నది. విద్యలో మత భావాలను, చొప్పించేటందుకై పాఠ్య పుస్తకాలలో మార్పులు చరిత్రను తిరగరాయటం, బోధనాంశలలో మతాన్ని చొప్పించటం, వేద గణితం మొదలైనవి కొన్ని ఉదాహరణలు.

హిమాచల్ ప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల సమ్మెను క్రూరంగా అణచివేసింది. వందలాది కార్మికులను తొలగించింది. సైన్యాన్ని వినియోగించింది. ఎస్మా, నాసా, టాడా, వంటి నిరంకుశ చట్టాలను అమలు చేసింది. పైగా కార్మికులకు వ్యతిరేకంగా ఈ నిర్బంధ విధానాలు విజయవంతమైనాయని ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి శాంతకుమార్ గొప్పగా ప్రకటించుకున్నాడు. రాజస్థాన్‌లోని కుమ్హేర్‌లో షెడ్యూల్డ్ కులాలకు చెందిన 14 మంది దారుణంగా ఊచకోత కోయబడ్డారు.

విద్యుత్ సంక్షోభమునేది రాష్ట్రంలో శాశ్వతత్వాన్ని సంతరించుకున్నది. బి.జె పి. పాలనలో ఇది మరింత తీవ్రమైంది. ఆగస్టు రెండవ వారంలో అంతకుమునుపెన్నడూ లేనివిధంగా విద్యుదుత్పత్తి తగ్గిపోయింది. ఆగస్టు 9న ఫ్యాక్టరీలకు విద్యుత్‌ను నిలిపివేశారు. దీనివల్ల 1500 పెద్ద పరిశ్రమలు 25 వేల చిన్న, మధ్య తరహా పరిశ్రమలు దెబ్బతిన్నాయి. తత్ఫలితంగా రోజుకు రు. వంద కోట్ల నష్టం వాటిల్లింది. ఉత్తరప్రదేశ్‌లో పెట్టుబడులను పెట్టటం అంటే నష్టాలు తెచ్చుకోవటమేనని వాణిజ్య, పారిశ్రామికవేత్తలు భావిస్తున్నారు.

విద్యుత్ సంక్షోభం ఖరీఫ్ పంటలను కూడా తీవ్రంగా దెబ్బతీసింది. అక్టోబరులో యీ సంక్షోభం మరింత తీవ్రం కాగలదని అనుమానిస్తున్నారు. విద్యుత్ పరిస్థితి యీ విధంగా దిగజారిపోవటానికి కారణం కేంద్రమేనని రాష్ట్ర ప్రభుత్వం చెప్తుంది. రాష్ట్ర ప్రభుత్వం చెప్పేదేమిటంటే బొగ్గు సరఫరాను సింగ్రూలి నుంచి కాక బీహార్ నుంచి, చమురు మధుర నుంచి కాక హల్దియా నుంచి సరఫరా అవుతుందని అంటున్నది. బొగ్గ నాణ్యమైనది కాకపోవటంతో విద్యుదుత్పత్తిని కూడా దెబ్బతీసిందని రాష్ట్ర ప్రభుత్వం చెపున్నది.

రాష్ట్ర ప్రభుత్వాన్ని వేదించే చర్యలను చేపట్టే అవకాశం కేంద్రానికి వున్నదనటంలో ఎంత మాత్రం అనుమానంలేదు. అయితే ప్రస్తుత పరిస్థితికి పూర్తిగా కేంద్రానిదే. బాధ్యతని చెప్పలేము. రాష్ట్రంలోని బి.జె.పి. ప్రభుత్వం కూడా ఇందుకు బాధ్యతను వహించవలసి వుంటుంది. తగినంత బొగ్గు సరఫరా లేనందున ఎక్కువగా ఆయిల్‌నుడపయోగించవలసి వస్తున్నట్లు రాష్ట్ర విద్యుత్ బోర్డు అధికారులు వదంతులను వ్యాప్తి చేస్తున్నట్లు బి జె పి. అనుకూల పత్రిక దైనిక్ జాగరణ్ సైతం వ్యాఖ్యానించింది. పెద్ద మొత్తంలో ఆయిల్ దొంగతనాలు జరిగినట్లుగా కూడా వార్తలు అందుతున్నాయి.

ఆగస్టు 9న విద్యుత్ సరఫరా పూర్తిగా నిలిచిపోయినప్పుడు ఓబ్రా విద్యుత్ కేంద్రంలో 65,277 టన్నుల బొగ్గు నిల్వలు వున్నాయి. అంపరీ. వరీక్ష. హర్దుగంజ్‌లలో వరుసగా 1,65,050 75,000, 70,000 టన్నుల బొగ్గు నిల్వ వున్నట.ఇది 20 రోజులకు పైగా వస్తుంది. అంతేకాక ఆదేరోజు టాటా విద్యుత్ కేంద్రానికి ఝరిలా, ధన్‌బాద్‌ల నుంచి బొగ్గు సరఫరా జరిగింది.

సంక్షోభం తీవ్రతరం కావటానికి మూలకారణంగా వున్న విద్యుత్ బోర్డు అధికారుల అవినీతిని అరికట్టడంలో రాష్ట్ర ప్రభుత్వం ఘోరంగా విఫలమైంది. వాస్తవానికి బి.జె.పి. ప్రభుత్వం నియామకాలలో పక్షపాతాన్ని ప్రదర్శిస్తుంది. రాష్ట్ర విద్యుత్ బోర్డులోని ముగ్గురుసభ్యులకు ఏడాదిలోనే మూడుసార్లు పదవీకాలాన్ని పెంచింది. మరొకరి విషయంలో మళ్ళీ ఉత్తర్వులు వచ్చే వరకూ అంటూ నిరవధికంగా సభ్యత్వ కాలాన్ని పెంచింది. విద్యుదుత్పత్తి 1524 మెగావాట్ల నుంచి 3129 మెగావాట్లకు పడిపోయింది. సమర్థవంతమైన ప్రభుత్వాన్ని ఏర్పరుస్తామని బి.జె.పి. చేసిన వాగ్దానం ఎంత బూటకమో యీ గణాంక వివరాలు తెలియజేస్తున్నాయి. ఉత్తరప్రదేశ్ ప్రజానీకంలో బి.జె పి. వట్ల భ్రమలు త్వరితగతిని తొలగిపోతున్నాయి.

హిందూ మతోన్మాదుల అబద్ధ ప్రచారం

# పురాణమూ కాదు, చరిత్రా కాదు!

అయోధ్యపై హిందూ మతోన్మాదుల వక్రీకరణలను భారత పరిశోధకులు, ప్రభుత్వ రికార్డుల ఆధారంతో ఖండిస్తూంటే వారు కొత్త అబద్ధాలతో టన్నులకొద్దీ సాహిత్యాన్ని సృష్టించారు. సృషిస్తున్నారు. వాటిని వివరంగా తెలుసుకుందాం.

శ్రీరామచంద్రుడు అయోధ్యలో మసీదు మధ్యభాగంలో పుట్టాడనేది వాళ్ళ వాదనలోని మొదటిపాయింటు.



రామకథకుమూలాధారమయిన వాల్మీకి రామాయణం ప్రకారం శ్రీరాముడు త్రేతాయుగంలో జన్మించాడు. పురాణాల ప్రకారం త్రేతాయుగం తర్వాత ద్వాపరయుగం, తర్వాత కలియుగం ప్రవేశించాయి. ద్వాపరయుగకాలం 8,64,000 సంవత్సరాలు. కలియుగం ప్రవేశించి యిప్పటికి 5000 సంవత్సరాలు దాటింది. శ్రీరాముడు త్రేతాయుగం చివరలో పుట్టాడనుకొన్నా ఇప్పటికి 8,69,000 సం॥లకు పూర్వమే పుట్టాడని నిర్ణయించాల్సి వస్తుంది. కానీ జీవ పరిణామశాస్త్రం ఏం నిరూపించింది? కోతి దశనుండి మానవుడుగా పరిణామం చెందింది యిప్పటికి 5 లక్షల సంవత్సరాల క్రిందట మాత్రమేనని ఆ అనాగరిక ఆదిమానవుడు దాదాపు యిప్పటికి 20,000 సంవత్సరాల క్రిందటి వరకూ అదే స్థితిలో జీవించాడనీ నిరూపించింది. మరి 8,69,000 ఏళ్ళక్రితం వానరుడు నరుడుగానే పరిణామం చెందినప్పుడు, అత్యంత నాగరిక మానవుడైన శ్రీరాముడు, అయోధ్య నాగరికత వున్నాయనడం కల్పితమని అర్థం కావడంలేదా? అంతేకాదు. భారతీయ విద్యాభవన్ నిర్మాత, అధ్యాత్మికవాది 'భవాన్స్ జర్నల్' వ్యవస్థాపక సంపాదకులు స్వర్గీయ కె.ఎం. మున్షీ అభిప్రాయం ప్రకారం రామాయణ, మహాభారత, భాగవతాలు, అష్టాదశ పురాణాలు కీ.శ 4వ శతాబ్దినుండి 14వ శతాబ్ది మధ్యలో రచింపబడినవి. "బౌద్ధజాతక కథల ఆకర్షణనుండి హిందూపామర జనాన్ని తప్పించడానికి గుప్తరాజులచే ప్రారంభించబడి, తర్వాతి హిందూ రాజులచే కొనసాగింపబడినవే కొంతమంది కవులు చేసిన యీ రచనలు" అని ఆయన తెలియజేశారు.

అయితే శ్రీరాముని చారిత్రక వ్యక్తిగా చిత్రించడం కోసం కొంతమంది 'హిందూ' పండితులు ఆయన జీవిత కాలాన్ని క్రీ పూ. 5050 ప్రాంతాల వరకు తగ్గించి చెపుతున్నారు. భారత యుద్ధానికి 65 తరాలముందు రామ దాశరథి అనేవ్యక్తి ఉన్నాడనే ఆధారంతో ఆ పండితులు, భారత యుద్ధ కాలాన్ని కలియుగారంభానికి కొంచెం ముందుగా అంటే క్రీ.పూ. 3102గా గుర్తించి, దానికిముందు 65 తరాలు, అంటే 65×30=1950 సంవత్సరాలుగాగణించి, శ్రీరాముని కాలాన్ని దాదాపు క్రీ.పూ. 5050గాపరిగణిస్తున్నారు. ఎ.కె. మజుందార్ వంటి చరిత్రకారులు ఆ కాలాన్ని మరింతముందుకు జరిపి శ్రీరాముడు క్రీ.పూ. 15-14 శతాబ్దాల్లో జీవించి వుండొచ్చన్నారు. కాని పురాతత్వశాస్త్రం యీ విషయంలో ఏం చెబుతోంది? 1975 నుండి 1980 వరకూ 'భారత పురాతత్వ పరిశోధనా సంస్థ' 'రామాయణ ప్రదేశాల పురావస్తు పరిశోధన పేరిట ప్రొ॥ బి.బి. లాల్ నాయకత్వంలో వాల్మీకి రామాయణంలో పేర్కొన్న ఐదు ప్రదేశాల్లో త్రవ్వకాలు ప్రారంభించింది. అందులో అయోధ్యలో, సరిగ్గా బాబ్రీ మసీదు వెనుకనే 11 మీటర్ల లోతున త్రవ్వారు. అయోధ్యలో మరో 14 ప్రదేశాల్లో త్రవ్వకాలు జరిపారు. వారు సేకరించిన సాక్ష్యాధారాల ప్రకారం క్రీ.పూ. 8వ శతాబ్దానికి ముందు అయోధ్యలో మానవులు నివశించలేదు. క్రీ పూ. 8వ శతాబ్దంలో నివసించినవారు కూడా అనాగరికులేగాని వాల్మీకి రామాయణంలో పేర్కొన్నట్లు నాగరికులు కాదు. రామాయణంలో పేర్కొన్న మహాప్రసాదాలుగానీ, నాగరిక చిహ్నాలుగానీ ఏవీపురావస్తు పరిశోధనల్లో కన్పించలేదు.

అసలు బి జె పి.నాయకులే రామజన్మ స్థలాన్ని గూర్చిన తమ సందేహాలను ఆంతరంగిక వాదనల్లో అంగీకరిస్తుంటారు. ప్రొ॥ హీరేన్ ముఖర్జీ లేఖకు సమాధానంవ్రాస్తూ బి జె.పి. నాయకుడు శ్రీ వాజ్‌పాయ్ "రాముడు జన్మించిన స్థలాన్ని ఖచ్చితంగా గుర్తించడం అసాధ్యం" అని వ్రాశారు (ఆర్గనైజర్ వీక్‌పత్రిక 24-9-89).

ఇక బాబరు 'పడగొట్టిన' రామాలయం విక్రమాదిత్యుడు నిర్మించాడని ప్రచారం చేస్తూ బండ్లకొద్దీ సాహిత్యాన్ని బి జె పి. కూటమివారు ప్రచురించారు. మొదట్లో క్రీ.శ. 1వ శతాబ్దంలో విక్రమార్క మహారాజు ఆ దేవాలయాన్ని పునర్నిర్మించాడన్నారు. విక్రమార్కుడనే చారిత్రక వ్యక్తి ఎవరూ క్రీ.శ. 1వ శతాబ్దంలో లేడని చరిత్రకారులు ఖండించేసరికి, కాదు, కాదు 4వ శతాబ్దంలోని విక్రమాదిత్య మహారాజు నిర్మించాడంటూ వాదన మార్చారు. ఇది 84 స్తంభాల బ్రహ్మాండమైన దేవాలయమనీ, 1528లో బాబరు పడగొట్టే వరకూ వుందనీ వాదిస్తున్నారు దీనికి చరిత్రకారుల సమాధానమేమిటి?

ప్రముఖ చరిత్రకారులు డా॥ సర్వేపల్లి గోపాల్, రొమిల్లా థాపర్, బిపిన్ చంద్ర, కె ఎన్ పణిక్కర్, ఆర్. చంపకలక్ష్మి మొదలైన మొత్తం

25 మంది కలిసి "చరిత్రను కలుషితంచేస్తున్న రాజకీయాలు" అనే శీర్షికతో ఒక పరిశోధనా పత్రం తయారు చేశారు దానిలో వారు ఇలా పేర్కొన్నారు:

క్రీ శ. 7వ శతాబ్దిలో భారతదేశాన్ని దర్శించిన చైనా యాత్రికుడు హ్యూయన్‌త్సాంగ్ అయోధ్యను కూడా దర్శించాడు. ఆయన అయోధ్య ఒక గొప్ప బౌద్ధ క్షేత్రమనీ, అక్కడ అనేక స్థూపాలు, బౌద్ధ విహారాలు వున్నాయని పేర్కొన్నాడు. అచ్చట దేవాలయాల ఉనికినాతడు పేర్కొనలేదు. హిందువుల కత్యంత పవిత్రమైన, 84 స్తంభాల బ్రహ్మాండమైన దేవాలయం ఉనికిలో వుంటే అతడు దానిని పేర్కొనేవాడు కాదా? అతడే ధాన్యకటకాన్ని దర్శించి 'దేవ' ఆలయాల సంఖ్య ఎక్కువవుతున్నట్లు వ్రాశాడు.

11వ శతాబ్దంలో గహడ్వలా రాజు తన అయోధ్య యాత్రను ఒక శిలాశాసనం ద్వారా ప్రకటించాడు. అతను ప్రకటించిన స్థలాలలో రామజన్మభూమి దేవాలయం లేదు. లక్ష్మీధార, మిత్రమిశ్ర, జన ప్రభానూరి, భూసుండ్ రామాయణం వంటి సంస్కృత గ్రంథాలలో తీర్థయాత్రా స్థలాలను ఎన్నో పేర్కొన్నారు గాని వాటిలో అయోధ్యలోని రామజన్మభూమి దేవాలయం లేదు. అయోధ్యలోని గోప్రతారా తీర్థం ఒకటే పేర్కొనబడింది.

1528లో మసీదు నిర్మాణమయ్యే నాటికి రామభక్తుడు, హిందీలో రామచరిత మానస్ రచయిత, అయోధ్య నివాసి, తులసీదాస్ వయస్సు 30 ఏళ్ళు. ఆయన తన రచనలలో మ్లేచ్ఛుల పెరుగుదలను గూర్చి బాధపడ్డాడేగాని అయోధ్యలో అతి పవిత్రమైన రామాలయం విధ్వంసమైందని ఎక్కడా పేర్కొనలేదు. ఒక రామభక్తుడు, తనకళ్ళెదుటే పవిత్ర రామాలయ విధ్వంసం జరుగుతుంటే దానిని గూర్చి ఎక్కడా పేర్కొనలేదంటే అక్కడ ఆనాటికి అసలు రామాలయమే లేదని రుజువు కావడంలేదా?

బి జె పి. కూటమివారి వాదనల్లో ప్రధానంగా 'బాబరు నామా'ను ఉదహరిస్తుంటారు. 'బాబరు నామా'లో 173వ పేజీలో బాబరు తాను అయోధ్యలోని రామాలయాన్ని పడగొట్టినట్లు స్వయంగా వ్రాసుకున్నాడని వారు ప్రచారం చేస్తుంటారు. ఇదే నిజమైతే యిక వాదనలెందుకు? అసలు విషయమేమిటంటే, బాబరు తన డైరీ 'బాబరు నామా'లో అయోధ్యలోని ఆలయాన్ని ధ్వంసంచేసినట్లు వ్రాసుకొనలేదు. ఈ విషయాన్ని పైన పేర్కొన్న 25 మంది ప్రముఖ చరిత్రకారులేకాక, ప్రొ॥ ఆర్.ఎస్. శర్మకూడా మరో రచనలో నిర్ధారించారు. అంతేకాదు, ఉర్వా లోయలోని నగ్నజైన విగ్రహాలను ధ్వంసం చేశానని వ్రాసుకున్న బాబరు, అయోధ్యలోని ఆలయాన్ని పడగొట్టించానని వ్రాసుకోవడానికి భయపడవసరం లేదని కూడా వారు వ్రాశారు. ఒక హిందూ సన్యాసికి భూమిని దానమిచ్చిన బాబరీ వంటి వ్యక్తినుండి యిట్టి పరమత ద్వేషపూరితమైన పనులు ఊహించగలమా?

విక్రమాదిత్యుని కాలంలో రామాలయం నిర్మించబడలేనదడానికి పురాతత్వ త్రవ్వకాలనుండి కూడా రుజువు దొరుకుతోంది. ప్రొ॥ బి బి లాల్ నాయఅయోధ్యలో జరిగిన త్రవ్వకాలలో బయల్పడిన విశేషాంశం ఏమిటంటే అక్కడ క్రీ పూ. 8వ శతాబ్దం నుండి క్రీ పూ. 5వ శతాబ్దం వరకు జనావాసం వున్నట్లు దాఖలాలు కనిపించాయి. అయితే ఆ తర్వాత క్రీ శ. 11వ శతాబ్ది వరకు అక్కడ జనావాసమున్నట్లు ఎటువంటి దాఖలాలు కనిపించలేదు. ఈ పురాతత్వ సాక్ష్యం క్రీ.శ. 4వ శతాబ్దిలో విక్రమాదిత్యుడు అయోధ్యలో జన్మస్థాన్ దేవాలయంతో సహా 360 దేవాలయాలను నిర్మించాడనే కట్టుకథ మర్మాన్ని బట్టబయలు చేస్తున్నది. కాబట్టి పైన సేకరించిన సాక్ష్యాలు, చారిత్రక వివరాలు రాముడు చారిత్రక వ్యక్తి కాడనీ, ఆయన అయోధ్యలో, అందులోనూ మసీదు గోపురప్రాంతంలో పుట్టాడని చెప్పడం కేవలం కుట్ర అనీ, 1582 నాటికి అయోధ్యలో విక్రమాదిత్యుడు నిర్మించినట్లు చెప్పబడుతున్న దేవాలయమేదీ లేదని నిరూపిస్తున్నాయి మసీదులో రామ్ లాలా విగ్రహం దౌర్జన్యంగా ఉంచబడినట్లు రుజువు చేస్తున్నాయి.

## అద్వానీగారూ ఆలోచించండి!

--- సూడో సెక్యులరిస్టుల తప్పులు ఏమైనా కావచ్చు. కాని సూడో -ఫాసిజం కన్నా అది ఖచ్చితంగా మెరుగైందే. హిందూత్వం పేర పనిచేస్తున్న కూటమి మనకు అందించేది ఆ సూడో ఫాసిజాన్ని బి.జె.పి.కి ఫాసిజమనే మాట అంతగా మెచ్చదు నేను అద్వానీని ఒకసారి ఈ విషయమై అడిగితే జర్మనీ విషయంలో తప్ప మరో సందర్భంలో ఫాసిజం గురించి తాను ఆలోచించలేనన్నారు కాని ఆయన మరోసారి ఆలోచించడం మంచిది. --- ఆయన పార్టీ మనకు అందిస్తున్న అతి తీవ్ర జాతీయవాదంలో ఒక మతంవారిని దాడికి లక్ష్యంగా పెట్టుకోవడం జరుగుతున్నది. ఒకే కేంద్రీకృత రాజకీయ వ్యవస్థ గురించి చెప్పడం జరుగుతున్నది దీనిలో ఫాసిజం నీడలు గోచరించడంలేదా?

సాధ్వీరీతంబరి వంటి వారు బి.జె పి. వేదిక నుంచి మాట్లాడినప్పుడు అది ఫాసిజానికి మద్దతుగా కన్పించడంలేదా? తమ కాషాయ వెల్లిప క్రింద దాగిన వికృత లక్షణాలను దాచుకునేలా సీనియర్ బి జె పి. నాయకులు మంచి వాక్చాతుర్యంతో గొప్ప గొప్ప పదబ్బాలాన్ని గుప్పించవచ్చు కాని సాధ్వి వంటి వారే అసలు సంగతి నిర్మొహమాటంగా బయటపెడుతున్నారు.

–తవ్లీన్‌సింగ్
(ప్రముఖ పాత్రికేయురాలు)

బి.జె.పి–వి.హెచ్.పి–ఆర్.ఎస్.ఎస్ కూటమి అయోధ్యపై తమ పథకాలను ఇసుమంతైనా మార్చుకుంటుందని ఆశించడం అది చీకట్లో సంజ్ఞచేయడంలా నిరర్ధకం. హిందువుల మనోభావాలను రెచ్చగొట్టడం ఆ కూటమికి ఎంతగానో ఉపయోగపడింది ఇప్పుడే వివాద పరిష్కారానికి రాజీకి రావలసిన అవసరం ఏ కోశానా వారికి కనిపించడంలేదు. అయోధ్య అందులో ఒక మెట్టు మాత్రమే ఈ కూటమి నిర్మించదలచిన రాజకీయ, సాంస్కృతిక నిర్మాణంలో అదో రాయి మాత్రమే. అది మరిన్ని పూజా స్థలాల 'విముక్తి'

## కాశీ మధురలే

కోసం ఉద్యమం ప్రారంభించే రోజు ఎంతో దూరం లేదు. అన్నిచోట్లా గుళ్ళు పడగొట్టి, మసీదులు కట్టారనే ఆపార్టీ చెబుతుంది. ----- చాలా పకడ్బందీగా తయరయ్యే వ్యూహంలో భాగంగా ఆపార్టీ దక్షిణాదిన ఈశ్వరుడిని, పశ్చిమ బెంగాల్‌లో దుర్గను, అస్సాంలోని యాదవులలో శ్రీకృష్ణ భగవానుడిని ఆ కూటమి ముందుకు తెస్తుంది.

–దిలీప్ పడగోంకర్, ఎడిటర్, టైమ్స్ ఆఫ్ ఇండియా.

# అయోధ్యా కాండలో అంతులేని అబద్ధాలు!

అయోధ్యకు సంబంధించిన బి.జె.పి. కూటమి తన కట్టు కథల కార్యక్రమంలోకి మహాత్మాగాంధీని కూడా లాగకుండా ఉండలేక పోయింది బి జె పి ప్రధాన కార్యదర్శి శ్రీ కె ఎల్ శర్మ అప్పటి ప్రధాని శ్రీ చంద్రశేఖర్ కొక లేఖ వ్రాస్తూ 'అయోధ్య వివాదం విషయంలో గాంధీజీ తన అభిప్రాయాలను 1937 జూలై 27 నాటి 'హరిజన్ సేవక్' అనే హిందీ వారపత్రికలో ప్రకటించారని' పేర్కొన్నారు. "ఏమతానికి చెందిన ప్రార్థనా స్థలాన్నయినా బలవంతంగా స్వాధీనం చేసుకోవడం పచ్చి దుర్మార్గం మొగలుల కాలంలో హిందువులకు ఎంతో పవిత్రమైన అనేక ప్రదేశాలను స్వచ్ఛందంగానే తిరిగి హిందువులకు అప్పగించాలి అదే విధంగా హిందువుల అధీనంలో వున్న ముస్లిం ప్రార్థనా కేంద్రాలను తిరిగి వారికి స్వచ్ఛందంగా అప్పగించాలి" అని గాంధీజీ రాసినట్లు పేర్కొంటూ దీనికి గాంధీజీ పథకం' అని శ్రీ శర్మ పేరు పెట్టారు ప్రధానికి శ్రీ శర్మ వ్రాసిన లేఖ "గాంధీజీ పథకం"తో సహా "టైమ్స్ ఆఫ్ ఇండియా"లో 3-12-90న ప్రచురితమైంది. అయితే ఆ మరునాడే. అంటే 4-12-90న ఆ లేఖ బండారాన్ని "టైమ్స్ ఆఫ్ ఇండియా" పరిశోధక బృందం బట్టబయలు చేసింది. గాంధీజీ అటువంటివ్యాసం ఏదీ వ్రాయలేదనీ, అసలు 1937 జూలై 27వ తేదీతో 'హరిజన సేవక్' వారపత్రిక వెలువడలేదనీ. 1937 జూలై 24. జూలై 31 తేదీలలోనే పత్రిక వెలువడిందని "టైమ్స్ ఆఫ్ ఇండియా" పరిశోధక బృందం తెలియజేసింది

అయితే 'గాంధీజీ పథకం' అనే యీ కట్టుకథను ప్రచారం చేయడం మతోన్మాద కూటమికి ఇదే మొదటి సారి కాదు 1950లో కూడా ఒక ప్రయత్నం చేశారు అది బెడిసి కొట్టింది. అయినా గోబెల్స్ అనుచరులు నిరుత్సాహ పడలేదు. 1990లో మరో ప్రయత్నం చేశారు. ఇదీ బెడిసి కొట్టింది ఇంతకూ 1950లో వారేం చేశారు?

శ్రీ రామ్‌గోపాల్‌పాండే (శరద్) అనే ఆయన 'రామజన్మభూమి వ్యతిరేకుం తప్పుడు ప్రచారాలు' అనే శీర్షికతో ఒక పుస్తకం వ్రాశారు




దాన్ని శ్రీ - ...జన్మభూమి సేవా సమితి ప్రచురించి... లో శ్రీ శరద్‌తాను 1937 మే 15న మహాత్మాజీకి ఒక లేఖ వ్రాశాననీ, దానిలో రామజన్మభూమి - బాబ్రీమసీదు విషయంపై ఆయన అభిప్రాయం కోరాననీ, దానికి 20-5-37న వార్ధా నుంచి శ్రీ మహదేవ్ దేశాయ్ ఈ క్రింది సమాధానం వ్రాశారనీ పేర్కొన్నాడు. దానిలో మీ జాబును అందు కొన్నాము. ఈ విషయమై బాపూజీ తన అభిప్రాయాలను హిందీనవజీవన్ లేదా హరిజన్‌లో వెలిబుచ్చుతార"ని వ్రాశారని శ్రీ శరద్ పేర్కొన్నారు. ఆలేఖ క్రింద మహదేవదేశాయ్ (అంతరంగిక కార్యదర్శి, పూజ్యశ్రీ మహాత్మాగాంధీ) అని సంతకం ఉంది. ఆ తర్వాత గాంధీజీ వ్రాసిన వ్యాసం 1937 జూలై 27న నవజీవన్‌లో ప్రచురితమైందని శ్రీ శరద్ పేర్కొన్నాడు. దానిలో 'గాంధీజీ పథకం'గా పైన పేర్కొన్న అభిప్రాయాలను పొందుపరచాడు. అయితే 1950 ప్రాంతాల్లో గాంధీజీ సాహిత్యప్రచురణ సంస్థ నవజీవన్ ట్రస్టుకు చెందిన శ్రీ జీవన్‌దేశాయ్ 'మహదేవ దేశాయ్ లేఖ', 'గాంధీజీ పథకం'ల బండారాన్ని బయటపెట్టాడు 1937 మే 20న గాంధీజీ. మహదేవ్ దేశాయ్‌లు వార్ధాలోనే లేరని. వారు గుజరాత్‌లోని తితాల్ క్షేత్రంలో ఉన్నారని ఆయన తెలిపారు అంతేకాదు. మహదేవ్ దేశాయ్‌కి తన సంతకం క్రింద అంతరంగిక కార్యదర్శి, పూజ్యశ్రీ మహాత్మాగాంధీ అని తనను తాను పరిచయం చేసుకొనే అలవాటే లేదని శ్రీ జీవన్‌దేశాయ్ తెలియజేశారు. దీనితో ఆలేఖ ఒక కట్టు కథ అని తేలిపోయింది. ఇక రెండో విషయం 1937 జూలై 27న నవజీవన్ హిందీ సంచిక ప్రచురించబడనే లేదు. ఎందుకంటే నవజీవన్ పత్రిక హిందీ సంచికల ప్రచురణ 1932 లోనే ఆగిపోయింది కాబట్టి ఆ ప్రకారంగా 1950లోనే గాంధీజీ పథకం' అనే దుష్ప్రచారాన్ని శ్రీ జీవన్‌దేశాయ్ ఖండించారు

నిజానికి గాంధీజీ ఇలాటి సందర్భాలకు ఉపయోగపడే ఒక మంచిమాట చెప్పారు. నేను భగవద్గీతను, భారతాన్ని చదువుతాను ఆచరిస్తాను కాని వాటిని చరిత్రలుగా భావించి, అందులో అంశాలు అసలు కావాలని కోరను అవి విశ్వాసానికి సంబంధించినవిమాత్రమే అని గాంధీజీ స్పష్టం చేశారు.

అయినా గాంధీజీని హత్య చేసిన గాడ్సేకు గొడుగుపట్టే ఆర్ ఎస్ ఎస్. ఆయన పేరును వాడుకోవాలని అది తప్పుగా చిత్రించడం ఎంత విడ్డూరం!

# ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి గోవింద పంత్‌కు సర్దార్‌పటేల్‌లేఖ

న్యూఢిల్లీ, 1950, జనవరి 9

ప్రియమైన పంత్‌జీ!

అయోధ్యలోని పరిణామాలపై తన ఆందోళనను వెలిబుచ్చుతూ ప్రధానమంత్రి ఇప్పటికే మీకు టెలిగ్రామ్ పంపించారు. లక్నోలో వున్నప్పుడు ఈ విషయమై నేను మీతో మాట్లాడానికి ఈ వివాదం సమయం కాని సమయంలో లేవనెత్తబడినదని నేను భావించుతున్నాను. మొత్తంగా దేశ పరిస్థితిని బట్టి చూసినా, లేక ముఖ్యంగా మీ రాష్ట్ర పరిస్థితి ద్వారా పరిశీలించినా ఈ వివాదాన్ని ఇప్పుడు లేవనెత్తడం సరికాదు. మతపరమైన సమస్యలు విశాల ప్రాతిపదికపై ఇటీవలనే వివిధ మతాలవారికి సంతృప్తిని కలిగించే విధంగా పరిష్కారమైనాయి. ఇంక ముస్లిమ్‌లకు సంబంధించినంతవరకూ వారి నూతన విధేయతలకు సంబంధించి ఇప్పుడిప్పుడే స్థిరపడుతున్నారు. దేశ విభజన అనంతరం ఏర్పడిన షాక్ నుండి అనిశ్చిత పరిస్థితుల నుండి ఇప్పుడిప్పుడే వారు తేరుకొంటున్నారు. అందువలన పెద్ద ఎత్తున వారి విధేయతమారే అవకాశం లేదు.

మీ రాష్ట్రంలో మతోన్మాద సమస్య ఎప్పుడూ క్లిష్టంగానే వుంటున్నది. ఎన్నో అవాంతరాలు ఏర్పడినప్పటికీ 1946 నుండి మీ రాష్ట్రంలో మతసామరస్యాన్ని కాపాడటంలో మీ రాష్ట్ర ప్రభుత్వం గణనీయమైన విజయాన్ని సాధించుతోంది. గ్రూపులు ఏర్పాటు కారణంగా ఉత్తర ప్రదేశ్‌లో పరిపాలన రీత్యా మాకు కొన్ని ఇబ్బందులు కలిగాయి. ఇప్పుడీ సమస్యపై ఒక గ్రూపు ఆధిపత్యానికి రావడానికి యత్నించడానికి అవకాశాన్నికల్పించితే చాలా దురదృష్టకరమైన పరిణామాలు ఏర్పడతాయి. ఈ అన్ని కారణాల వలన ఈ సమస్యను రెండు మతాల వారి మధ్య సరస్పరం సద్భావం ఏర్పడేటట్లు, ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో సామరస్యంగా పరిష్కరించడం అవసరమని నేను భావించుతున్నాను.

అక్కడ జరిగిన చర్య వెనుక మనోభావాలు ఇమిడి వున్నాయన్న విషయాన్ని నేను గుర్తిస్తున్నాను. అయితే అదే సమయంలో ముస్లిం మతస్థుల అభీష్టాన్ని దృష్టిలోకి తీసుకొని వ్యవహరించితే ఇలాంటి సమస్యలు శాంతియుతంగా పరిష్కారం చేయవచ్చు. ఈ వివాదాన్ని బలప్రయోగం ద్వారా పరిష్కరించే సమస్య కానేకాదు. అలాంటప్పుడు అక్కడ శాంతి భద్రతలను కాపాడేందుకు అన్ని విధాలుగా బాధ్యతా చర్యలను తీసుకోవలసిందే. అందువలన ఈ సమస్య పరిష్కారానికి శాంతియుతంగానూ, అందుకు సంబంధించిన వారిని ఒప్పించే విధంగానూ వుండే పద్ధతులను మాత్రమే అనుసరించడం అవసరం. ఏకపక్ష చర్యలను, బలప్రయోగంతో తెచ్చే వద్ధతులను అనుమతించరాదు. అందువలన ఈ సమస్యను తీవ్ర సమస్యగా చేయబోరనే విశ్వాసం నాకుంది. ఈ వివాదాన్ని ప్రస్తుత పరిస్థితుల్లో పెరగనీయరాదు. అందరికీ నమ్మతమయ్యే విధంగా సమస్య పరిష్కారం కాగలదనే నమ్మకం నాకుంది. ఈలోపుగా మీరు తీసుకునే చర్యలు జయప్రదం కాగలవని నేను ఆశించుతున్నాను.

ఇట్లు భవదీయుడు,

**వల్లభబాయి పటేల్.**

## పండిట్ పంత్ జవాబు

లక్నో13-1-1950

ప్రియమైన సర్దార్ సాహెబ్,

ఈ విషయంలో మీరు తీసుకున్న శ్రమకు ఎలా కృతజ్ఞతలను తెలపాలో నాకు తెలియడం లేదు. బొంబాయి నుండి తిరిగి వచ్చిన వెంటనే మీరు నా అభ్యర్థన ననుసరించి లక్నోకు వచ్చారు.

బొంబాయి వెళ్ళి రావడం వలన మీరు చాలా వొత్తిడికి లోనైనారు. ఆ పరిస్థితుల్లో తిరిగి మీ సహాయాన్ని అభ్యర్థించడానికి నేను కొంత వెనుకాడాను. అయోధ్యసమస్యపై మీరు రాసిన జాబుకు ధన్యవాదాలను తెలుపుతున్నాను. అది మాకిక్కడ ఎంతగానో సహాయపడింది. శాంతియుతంగా సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. అది జయప్రదమయ్యే అవకాశాలు కనిపించుతున్నాయి. అయితే పరిస్థితి ఇంకా అనిశ్చితంగానే వుంది. అందువలన ఈ దశలో ఇంతకంటే ఎక్కువ చెప్పడం మంచిది కాదు.

కృతజ్ఞతలతో

ఇట్లు **జి.బి. పంత్.**



రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆర్.ఎస్.ఎస్.) దశాబ్దాలుగా భారతదేశంలో హిందూమతోన్మాదాన్ని రెచ్చగొడుతున్న సంస్థ. 1925 సెప్టెంబర్‌లో హెడ్గెవార్ స్థాపించబడిన ఈ సంస్థ హిందూ రాష్ట్ర స్థాపనే తన ధ్యేయంగా చెబుతున్నది భారత ఉపఖండమంతటిని కలిపి హిందూ రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని వారు కోరుతున్నారు. మరాఠాలు హిందూ సామ్రాజ్య స్థాపన కోసం చేసిన ప్రయత్నాన్ని ఆఫ్ఘన్లు పానిపట్ యుద్ధంలో నిరోధించారని, ఇప్పుడు అటువంటి హిందూ సామ్రాజ్యాన్ని ఏర్పాటు చెయ్యాలన్నది ఆర్.ఎస్.ఎస్. భావన.

భారతదేశమంటే హిందూవులదే అన్న మత దురభిమానాన్ని ఆర్.ఎస్.ఎస్. పసితనం నుండే నూరిపోస్తుంది. కాషాయ పతాకం క్రింద ప్రతిరోజు ఉదయాన్నే పిల్లలను, యువకులను ఒక చోటకు చేర్చి డ్రిల్లు, ఆపైన ప్రసంగాలతో వారి లేత మనస్సులను ఎలా కలుషితం చేస్తున్నదీ మనం అనేక చోట్ల చూస్తునే వున్నాం తమ లక్ష్య సాధనకై దేనికైనా తెగించే విధంగా ఆర్.ఎస్.ఎస్. తన కార్యకర్తలకు శిక్షణ నిస్తుంది. దీని కోసం ఆ సంస్థ అనుసరించే నిర్మాణ పద్ధతులు క్రమ శిక్షణకు మారుపేరుగా కనిపిస్తుంటాయి.

వాల్టెర్ కె. అండెర్సన్, శ్రీధర్ డి. దామ్లె అనే వారు ఆర్.ఎస్.ఎస్. గురించి 'దిబ్రదర్ హుడ్ ఇన్‌శాఫ్రిన్' అనే గ్రంథం వ్రాశారు. ఆర్.ఎస్.ఎస్. ప్రత్యేకంగా పిల్లలు, యువకులపైనే ఎందుకు కేంద్రీకరిస్తుంది అన్న విషయం గురించి యిలా చెప్పారు. "తనకు, సమాజానికి ఉన్న సంబంధం ఏమిటి అన్న విషయం గురించి యువకులు ఆలోచిస్తూ ఉంటారు. దానిని తెలుసుకోవడానికి ప్రయత్నిస్తుంటారు. ఈ స్థితిలో యువకులు కొత్త సిద్ధాంతాల పట్ల ఆకర్షితులవుతుంటారు. అప్పుడు కొత్త భావాలను వారిలో చొప్పించడం కూడా తేలిక. సమాజం కోసం త్యాగానికి సిద్ధపడాలన్న వాంఛను వారిలో ఆర్.ఎస్.ఎస్. పాదుకొల్పింది. దీనిని నిర్మాణ పరంగా, ఆర్.ఎస్.ఎస్.కు సేవ చేయడం, నాయకుల పట్ల విశ్వాసంతో ఉండటం అన్న అశాల ద్వారా ఆచరణలో పెడ్తుంది". యువకులలో త్యాగం, తెగింపులను అభివృద్ధి చేయడం సర్వమానవ సౌభ్రాతృత్వం, మత సామరస్యం కోసం కాదని, హిందూమత దురభిమానమే వారి నరనరాన జీర్ణించుకుపోయేలా చేయడమని వేరుగా చెప్పనక్కరలేదు.

భారతదేశంలో హిందూమత దురహంకారాన్ని పెంచి పోషించే అన్ని సంస్థలకు ఆర్.ఎస్.ఎస్. పితృసంస్థ వంటిది బి.జె.పి., ఇటీవల కాలంలో ముఖ్యంగా అయోధ్య సమస్య ముందుకు వచ్చిన తర్వాత ప్రముఖంగా కనిపిస్తున్న వి.హెచ్.పి., భజరంగ్‌దళ్ లాంటి సంస్థలన్నీ ఆర్.ఎస్.ఎస్. పరివారానికి చెందినవే. ఆర్.ఎస్.ఎస్. తన ప్రచారాలు (హోల్‌టైమర్స్) ద్వారా ఈ సంస్థలను అదుపు చేస్తూంటుంది. నేడు ఆర్.ఎస్.ఎస్. ఆధ్వర్యంలో వివిధ రంగాలకు సంబంధించి మొత్తం 50 సంస్థలున్నాయని చెప్పుకుంటున్నది భారతీయ జనతాపార్టీ (రాజకీయ), విశ్వ హిందూ పరిషత్ (మత కార్యకలాపాలు), అఖిల భారత విద్యార్థి పరిషత్ (విద్యార్థి, యువజన రాజకీయాలు), భారతీయ మజ్దూర్ సంఘ్ (ట్రేడ్ యూనియన్)లు బాగా తెలిసిన సంస్థలు. ఇవి కాకుండా గృహక్ పంచాయత్ (వినియోగదారుల ఫోరం), అధిభాషక్ సంఘ్ (న్యాయవాదులు) మొదలైనవి కూడా ఉన్నాయి.

ఆర్.ఎస్.ఎస్.కు చెందిన సంఘీయులు నేరుగా ఎటువంటి ప్రభుత్వ పదవులలోను వుండరు. కాని బి.జె.పి., వి.హెచ్.పి., ఎ.బి.వి.పి. మొదలైన సంస్థలలో తనకు చెందిన వారిని ఉన్నతస్థానాలలో నియమించడం ద్వారా వీటిపై అదుపు కలిగి ఉంటుంది. అద్వానీ, వాజ్‌పాయ్, సింఘాల్ వీరంతా ఆర్.ఎస్.ఎస్.లో ప్రధాన స్థానాలను అలంకరించినవారే. రాజస్థాన్‌లో ఆర్.ఎస్.ఎస్. ప్రచారక్‌గా ఉన్న ఎల్.కె. అద్వానీ ఆ సంస్థ 50వ దశకంలో రాజకీయ ఫ్రంట్‌లో అంటే, అప్పటి జనసంఘ్‌లో పని చేసేందుకు ఢిల్లీకి పంపించింది ఢిల్లీలో ఆర్.ఎస్.ఎస్. ప్రాంతీయ నాయకుడిగా ఉన్న అశోక్ సింఘాల్‌ను వి.హెచ్.పి.ని స్థాపించవలసిందిగా 70వ దశకం ఆరంభంలో ఆర్.ఎస్.ఎస్. ఆదేశించింది. ఎమర్జెన్సీ కాలంలో ఎ.బి.వి.పి.లో చురుకుగా పనిచేస్తున్న గోవింద ఆచార్యను, అద్వానీ సహాయకునిగా ఉండేందుకు ఆర్.ఎస్.ఎస్. పంపించింది ఆర్.ఎస్.ఎస్. తన ప్రచారక్‌లను ఒక సంస్థ నుండి మరొక సంస్థకు మారుస్తూ ఉంటుంది జనసంఘ్ ప్రధాన కార్యదర్శుల్లో ఒకరైన రామ్‌భావ్ గాడ్‌బోలేను గిరిజనులలో పనిచేసే ఆర్.ఎస్.ఎస్. సంస్థ వనవాని కల్యాణ్ ఆశ్రమ్‌కు బదిలీ చేసింది.

క్రమశిక్షణకు మారుపేరుగా చెప్పుకునే రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌లో ప్రజాస్వామ్యం కంచుకాగడా వేసి వెదికినా కనిపించదు. సంఘ్ నియామకాలన్నీ నామినేషన్ల ద్వారానే అంతకన్నా ఘోరమైన విషయమేమంటే ఆర్.ఎస్.ఎస్. అధినేత జీవితాంతం పదవిలో ఉంటాడు. తన వారసుని కూడా ఆయన ప్రకటిస్తాడు ఈ నేత మరణించినప్పుడు వారసుడు ఆ పీఠం అధిరోహిస్తాడు

ఇప్పుడు హిందువుల పోరాట సంస్థలుగా ప్రముఖంగా ముందుకొచ్చిన వి.హెచ్.పి., భజరంగదళ్ లాంటి వాటిని గురించి కూడా ప్రత్యేకంగా చెప్పుకోవలసి ఉంది పూర్తిగా మత కార్యకలాపాలు కొనసాగించేందుకు, 1964లో అప్పటి ఆర్.ఎస్.ఎస్. అధినేత గురుగోల్వాల్కర్ వి.హెచ్.పి. స్థాపించడానికి నిర్ణయించారు బొంబాయిలోని స్వామి చిన్మయానంద్‌కు చెందిన సందీపని ఆశ్రమంలో వి.హెచ్.పి. స్థాపన జరిగింది. ఈ కార్యక్రమానికి గోల్వాల్కర్‌తో పాటు ఆచార్య సుశీల్‌ముని, అకాలీ నాయకుడు మాస్టర్ తారాసింగ్ కూడా హాజరయ్యారు.

ఇప్పుడు రాజకీయ రంగంలో కూడా నేరుగా ప్రవేశించిన వి.హెచ్.పి. తొలుత మత కార్యకలాపాలకే పరిమితమయింది భారతదేశంలో హిందువులు మైనారిటీలుగా ఉన్న చోట్ల వారికి సంఘీభావాన్ని ప్రకటించడం వి.హెచ్.పి. ప్రధాన లక్ష్యాలలో ఒకటి. 1977-79లో జనతాపార్టీ అధికారంలో ఉన్నప్పుడు సైతం వి.హెచ్.పి. రాజకీయాలలో తలదూర్చలేదు. జనతాపార్టీలోని పూర్వపు జనసంఘీయులు, ఆర్.ఎస్.ఎస్.లో ద్వంద్వ సభ్యత్వం సమస్య మాత్రమే ముందుకు వచ్చింది చివరకు ఆ సమస్య మీదనే జనతా పార్టీ చీలిపోయింది. పూర్వపు జనసంఘీయులు భారతీయ జనతాపార్టీ అవతారమెత్తారు అప్పటి నుండి బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్., ఇతర సంస్థలకు మధ్య పొత్తుకు ఎటువంటి ఆటంకం లేకుండా పోయింది. వి.హెచ్.పి., భజరంగ్‌దళ్ లాంటి సంస్థలు రాజ్యాంగాన్ని, కోర్టులను, చట్టాన్ని

ఉల్లంఘిస్తూ ఉంటే, తాను మాత్రం చట్టప్రకారం రక్షణ పొందేందుకై బి.జె.పి. ఈ సంస్థల నుండి విడగొట్టుకున్నట్లు నటిస్తూ వుంటుంది. నిజానికి బి.జె.పి.తో సహా ఈ సంస్థలన్నీ హిందూ మతోన్మాదానికి వివిధ ముఖాలు మాత్రమే.

అప్పటి వరకూ ఆర్.ఎస్.ఎస్.లో ఉన్న అశోక్‌సింఘాల్ 1984లో వి.హెచ్.పి. నాయకత్వ స్థానంలోకి బదిలీ చేయబడ్డాడు. అదే సమయంలో వి.హెచ్.పి ఢిల్లీలో ధర్మ సంసద్ (హిందూ మత పార్లమెంటు)ను ఏర్పాటు చేసింది. అయోధ్యలో వివాదాస్పద కట్టడానికి తాళాలు తెరవమని ఆ సభ డిమాండ్ చేసింది. అప్పటి నుండే వి.హెచ్.పి. విజృంభించింది.

వి.హెచ్.పి. అంతర్గత నిర్మాణం ఆర్.ఎస్.ఎస్.కు నకలుగానే ఉంటుంది ఇక్కడ కూడా ప్రజాస్వామ్యం ఊసెత్తడానికి వీలులేదు నాగపూర్‌లోని ఆర్.ఎస్.ఎస్. ప్రధాన కార్యాలయానికి ఎవరు దగ్గరగా ఉంటే వారే వి.హెచ్.పి. నాయకత్వ స్థానంలో ఉంటారు. మొండివాడని, పట్టువిడుపులు తెలియని వాడని ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి.లలోని వారే భావించే అశోక్ సింఘాల్ తొలుత వి.హెచ్.పి సంయుక్త ప్రధాన కార్యదర్శిగా నియమించబడ్డాడు. ఆ తర్వాత ప్రధాన కార్యదర్శిగా ఆయన హోదా పెంచబడింది. ఆర్.ఎస్.ఎస్ అధికారులకు ఇష్టుడు కావడమే దీనికి కారణం.

తెరపై కనిపించే వారితోపాటు, తెర వెనుక ఉండి ప్రధాన పాత్ర వహించే వారు సైతం వి.హెచ్.పి.లో ఉన్నారు. మోరోపంత్ పింగ్లే అనే ఆయన ఇటువంటి వ్యక్తి. వి.హెచ్.పి.లో కేవలం ఈయన ఒక ట్రస్టీ మాత్రమే. (తొలుత వి.హెచ్.పి.100 మంది ట్రస్టీలతో ఏర్పడింది.) బయట ప్రచారంలో ఏ మాత్రం కనిపించని పింగ్లే ఆర్.ఎస్.ఎస్.కు, వి.హెచ్.పి.కి నిజమైన సంధాన కర్త అని భావిస్తున్నారు.

వి.హెచ్.పి.కి సంబంధించి మరొక ఆసక్తికరమైన అంశం కూడా ఉంది. సాధారణంగా ఏ సంస్థలోనయినా పలుకుబడి ఉంటుంది. కాని వి.హెచ్.పి. అందుకు భిన్నమైనది. ఒక వ్యక్తి ఆ సంస్థలో హోదాను బట్టే ఏ స్థానంలో ఉన్నాడన్న దానిపైనే కాకుండా, అతని ఆస్తిపాస్తులు మొదలైన ఇతర లక్షణాలపై కూడా ఆయనకు వి.హెచ్.పి.లో పలుకుబడి ఆధారపడి ఉంటుంది. బడా పారిశ్రామిక వేత్త వి.హెచ్. దాల్మియా వి.హెచ్.పి.కి ఉపాధ్యక్షుడు. శివనాథ్‌కజు అనే ఆయన ఉపాధ్యక్షుడు. ఈయన కూడా తక్కువవాడేమీ కాదు. అలహాబాద్ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి. అయినప్పటికీ వి.హెచ్.పి.లో కజుకన్నా దాల్మియాకే ఎక్కువ ప్రాబల్యం.

వి.హెచ్.పి.లో మరొక ప్రధాన వ్యక్తి ఆ సంస్థ సంయుక్త ప్రధాన కార్యదర్శి గిరిరాజ్ కిషోర్. ఈయన భజరంగ్ దళ్‌కు నాయకత్వం వహిస్తున్నాడు. భజరంగ్ దళ్ వి.హెచ్.పి.కి చెందిన యువజన విభాగం హిందూ మతోన్మాదంతో ఆయుధాలు పట్టుకొని పోరాడడానికి ఉద్దేశించబడినది ఈ సంస్థ మహిళల కోసం వి.హెచ్.పి.దుర్గా వాహిని అనే మరొక సంస్థను కూడా స్థాపించబడింది. తొలుత దీనికి సాధ్వీరీతాంబర్‌ను నాయకురాలిగా ఉంచాలని భావించినప్పటికీ, ఆమె వివాదాలకు చిక్కుకోవడంలో గిరిరాజ్ కిషోరే ఈ సంస్థను కూడా చూస్తున్నాడు.

వి.హెచ్.పి.కి దేశ, విదేశాల నుండి అపారమైన నిధులు వస్తుంటాయి అమెరికా, కెనడా, బ్రిటన్ మొదలైన దేశాలతో ఈ సంస్థకు సంబంధాలున్నాయి. వి.హెచ్.పి. విదేశీ వ్యవహారాలు నడపటానికి ఒక ప్రత్యేక మైన విభాగముంది. దీనిని హరిబాబు కన్సాల్ అనే ఆయన చూస్తున్నాడు.

ఒకప్పుడు ప్రధానంగా మధ్య తరగతి ప్రజల సంస్థలుగా ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి.లు పేరుబడ్డాయి. భజరంగ దళ్ ఏర్పాటు, అయోధ్య వివాదంతో ఈ సంస్థలలో నేరస్తులు, ఇతర సంఘ విద్రోహశక్తులు పెద్ద ఎత్తున ప్రవేశించాయి. భజరంగ్ దళ్ గూండాలు దేశంలోని అనేక ప్రాంతాలలోని మత కల్లోలాలలో ముందుంటున్నారు.

ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి.లకు సంబంధించి చివరిగానే అయినప్పటికీ ఒక ముఖ్యమైన విషయాన్ని చెప్పుకోవాలి. హిందూ మతోన్మాదం పెరుగుదలకు ఎవరు దోహదపడితే వారికి సహాయ పడతారు. 1983లో ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ ప్రభుత్వంలో ఒక మంత్రి దావు దాయాల్‌ఖన్నా అయోధ్యలో వివాదాస్పద కట్టడాన్ని హిందువులకే అప్పగించాలన్న డిమాండ్ చేస్తూ వి.హెచ్.పి. ఏర్పాటు చేసిన సభలో ప్రసంగించారు. ఆ మేరకు ఆయన అప్పటి ప్రధాని ఇందిరాగాంధీకి ఒక లేఖ కూడా వ్రాశారు.

ఆ తర్వాత సార్వత్రిక ఎన్నికల్లో అనేక చోట్ల ఆర్.ఎస్.ఎస్. ఇందిరాగాంధీకి అనుకూలంగా పని చేసింది. హిందూ మతతత్వానికి అనుకూలమైన చర్యలను గైకొనటం వల్లనే కాకుండా, అంతకన్నా ఎక్కువగా కమ్యూనిస్టు వ్యతిరేకతతో కాంగ్రెస్(ఐ)తో హిందూ మత సంస్థలు కలిసిన సందర్భాలు చాలా ఉన్నాయి. కమ్యూనిస్టులు ముఖ్యంగా సి.పి.ఎం. దేశంలోనే అత్యంత బలంగా ఉన్న పశ్చిమబెంగాలు, కేరళలో దెబ్బతీయడానికి బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి.లు నానా తంటాలు పడుతున్నాయి. గత ఎన్నికల్లో కేరళలో అనేక నియోజక వర్గాలలో ఎల్.డి.ఎఫ్. అభ్యర్థులను ఓడించేందుకు ఈ మత సంస్థలు తమ ఓట్లను యు.డి.ఎఫ్. అభ్యర్థులకు వేసిన సంగతి తెలిసిందే.

భారత సంప్రదాయానికి తామే అసలు సిసలైన వారసులమని చెప్పుకునే ఈ సంస్థలు పచ్చి మతోన్మాదం తోపాటు,సామ్రాజ్యవాద అనుకూలతను, కమ్యూనిస్టు వ్యతిరేకతను కూడ బయటపెట్టుకుంటాయి.

–గుడిపూడి విజయరావు

మహాత్మా గాంధీ జీవిత కాలంలోనే బాబ్రీ మసీదు - రామజన్మ భూమి వివాదం తలెత్తింది. అదేగాక ఇంకా అనేకచోట్ల మసీదులలో విగ్రహాలు పెట్టే కార్యక్రమాలు మొదలైనాయి. ఇలాంటి పనులు గాంధీజీ స్పష్టంగా ఖండించారు.

1947-48లో హిందూ - ముస్లిం కలహాలు తారస్థాయికి చేరిన తరుణంలో హిందూ మతోన్మాదులు ఢిల్లీలోని మెహరులిలో గం కుతుబుద్దీన్ భక్తియార్ కాకీ బిస్తి సాహెబ్ దర్గాను నాశనం చేశారు. పాకిస్తాన్‌లో ఆలయాలను పాడు చేస్తున్నారని వార్తలు రావడంతో ఇక్కడ మసీదులపై దాడులు ప్రారంభమైనాయి. ప్రభుత్వం ఈ దాడులను ఆపాలని, మసీదులకు కలిగిన నష్టానికి పరిహారమివ్వాలని చెప్పడంతో గాంధీ ఆగలేదు. ఆ పనులన్నీ హిందువులే చేయాలని చెప్పారు. అందుకోసం నిరాహారదీక్ష కూడా జరిపారు.

1924లోనే ఇలాంటి ఘటనలు కొన్ని జరిగినట్లు గాంధీ దృష్టికిరాగా ఆయన చాలా బాధ పడ్డారు. అమేథీ, శాంభర్‌లలో ఇలాటి ఘటనలే జరగాయి. ఆ తర్వాత గుల్బర్గాలో ముస్లిములు హిందూ ఆలయాలను అపవిత్రం చేసినట్లు వార్తలు వచ్చాయి. ఆసందర్భంగా 1924లో ఆగస్టు 28న 'యంగ్ ఇండియా' పత్రికలో గాంధీజీ ఇలా రాశారు.

"ఆదాము కాలం నుంచి మనం కక్ష సాధింపు సూత్రాన్ని అనుసరిస్తున్నాము. అది దారుణంగా విఫలమైనదని అనుభవమే మనకు చెబుతున్నది. ఒకే వెయ్యి దేవాలయాలను నిర్మూలనం చేయవచ్చుగాక. నేను మాత్రం ఒక్క మసీదును కూడా తాకను. ఆ విధంగా నేను ఉన్మాదుల విశ్వాసం కన్నా నా విశ్వాసం గొప్పదని నిరూపిస్తాను. మసీదులను కూల్చడం ద్వారా హిందువులు తమ మతాన్నిగాని, ఆలయాలనుగాని కాపాడుకోలేరు. అందుకు బదులు ఆలయాలు నాశనంచేసిన వారిలాగే వీరూ ఉన్మాదులని తేలిపోతుంది."

ముస్లింలకు ఆయన యిలా చెప్పారు:

"ఇస్లాంపై మీ ప్రవర్తనను బట్టి తీర్పు చెప్పబడుతుందనీ గుర్తుంచుకోండి అమేథీ, శాంబార్, గుల్బర్గా వంటి చోట్ల జరిగినట్లుగా చెప్పబడుతున్న ఘటనలు ఇస్లాం గౌరవాన్ని పెంచవు. నా మతాన్ని గురించి నేను ఎంత గౌరవంగా భావిస్తానో, ఇస్లాంను గురించి అలాగే భావిస్తానని చెప్పనివ్వండి. ముసల్మాన్‌లతో పరిపూర్ణమైన అరమరికలులేని స్నేహపూర్వక జీవితం గడపాలని నేను కోరుకుంటున్నాను గనుకే అలా చేస్తాను. ఈ చర్యలు నా హృదయంలో తీవ్ర గాయాన్ని రేపాయని చెప్పక తప్పదు.

ఆ తర్వాత 23 ఏళ్ళకు బీహార్‌లోని బోలా గ్రామంలో హిందువులు ఒక మసీదును పడగొట్టి, అక్కడ హోలీ జరుపుకున్నారు. ఆ వార్త గాంధీని ఎంతో కలతపరచింది. ఆయన స్థలానికి వెళ్ళారు. 1947 మార్చి 28న పాట్నాలో జరిగిన ప్రార్థనా సమావేశంలో ఇలా చెప్పారు.

"హోలీ పండుగ రోజు జరిగిన ఈ చర్య (మసీదుపై దాడి) నిజమైతే అది బీహార్‌లోనూ, మొత్తం దేశంలోనూ కూడా హిందువులకు దుశ్శకునం లాంటిదే.

1947లో తీవ్ర మత కలహాల మధ్య మనకు స్వాతంత్ర్యం వచ్చింది. అనేక చోట్ల మసీదులలో బలవంతంగా విగ్రహాలు పెడుతున్నట్లు



వార్తలు వచ్చాయి. ఆ ఏడాది నవంబరు 30న ఢిల్లీలో ప్రార్థనా సమావేశంలో గాంధీజీ ఇలా చెప్పారు.

"--మసీదులను బలవంతంగా ఆక్రమించుకుని విగ్రహాలు నెలకొల్పడం హిందూ సిక్కు మతాలకు అవమానకరం. మసీదులనుంచి ఆ విగ్రహాలను తొలగించడం, జరిగిన నష్టానికి పరిహారం ఇవ్వడం హిందువుల బాధ్యత."

అయినా ఉన్మాదం, ఉద్రేకం విషంలా వ్యాపించిన ఆ వాతావరణంలో ఆయన హిత బోధ హిందూ మతోన్మాదుల చెవికెక్కలేదు. ఢిల్లీలో కూడా శాంతి కరువైంది. దాంతో 1948 జనవరి 13న గాంధీజీ నిరాహారదీక్ష ప్రారంభించారు. ముస్లిములకు, వారి పూజా స్థలాలకు రక్షణ కల్పించాలనేదే గాంధీజీ ప్రధాన డిమాండ్. మౌలానా అబుల్ కలామ్ అజాద్ ఆయన దగరకు వెళ్ళి దీక్ష విరమణకు మీ షరతులేమిటని అడిగారు. అప్పుడు గాంధీజీ "ఏడు పరీక్షలు" పెట్టి, వాటిని పూర్తిచేస్తే దీక్ష విరమిస్తానన్నారు. అవన్నీ ముస్లిములకు, వారి ప్రార్థనా స్థలాలకు పూర్తి రక్షణ వుండాలని చెప్పేవే. ముస్లిములు స్వేచ్ఛగా తిరగడానికి వీలుండాలని, వారిపై ఆర్థిక బహిష్కరణ అంతమొందాలని కూడా గాంధీ చెప్పారు. పాకిస్తాన్‌కు వెళ్ళదలచిన ముస్లిములు వెళ్ళడానికి, అక్కడి నుంచి ఇండియాకు రాదలిస్తే రావడానికి అవకాశముండాలన్నారు. పాకిస్తాన్‌కు వాగ్దానం చేసినట్లు రు. 55 కోట్లు ఇవ్వాలని కూడా కోరారు.

ఆరోజులలో జరిగిన మరికొన్ని ఘటనల గురించి ఆయన కార్యదర్శి ప్యారేలాల్ రాశారు. ఢిల్లీలోని కన్నాట్‌ప్లేస్‌లో మసీదును హిందువులు గుడిగా మార్చారని విని గాంధీజీ హోంమంత్రి సర్దార్ పటేల్‌కు ఆ విషయం తెలిపారు. పటేల్ అధికారుల కథనానికి లోబడి మొదట పెద్దగా పట్టించుకోలేదు.

చివరకు ప్రభుత్వం గాంధీజీ చెప్పినట్లు పాకిస్తాన్‌కు రు. 55 కోట్లు ఇవ్వడానికి అంగీకరించింది.

ఢిల్లీలో పరిస్థితులు మెరుగైన తరువాత నాలుగు రోజులకు హిందూ, ముస్లిం, సిక్కు మత నాయకులు గాంధీజీ దగ్గరకు వెళ్ళి నిరశన విరమించమని కోరారు. నెహ్రూ కూడా అందుకే వచ్చారు. అయితే ఆయన వెంటనే ఒప్పుకోలేదు. తాము ఆక్రమించిన ముస్లింల గృహాలను ఖాళీ చేస్తామని వారి ఇళ్ళు వారికే ఇస్తామని రాత్రి వెయ్యి మంది హిందువులు వచ్చి గాంధీకి చెప్పారు. సబ్జిమండిలో ముస్లింలను బహిష్కరించిన హిందూ వర్తకులు కూడా దాన్ని ఎత్తివేస్తామని అన్నారు. వీటన్నింటి ఫలితంగా 1948 జనవరి 18న గాంధీజీ నిరాహారదీక్ష విరమించారు.

కాని మెహరోలిలోని దర్గాకు జరిగిన నష్టం గాంధీకి చాలా కష్టం కలిగించింది. నిరాహారదీక్ష ముగియగానే ఆయన ఆ దర్గాకే వెళ్ళారు. అక్కడ అన్ని మతాల వారు ఆయనకు స్వాగతం పలికారు. అక్కడ గాంధీ ప్రసంగం జనాన్ని కదిలించింది.

"ఇంత ఖరీదైన పాలరాతి ఫలకాలకు నష్టం కలగడం నన్ను కలచివేసింది. పాకిస్తాన్‌లో ఇలా జరగడం లేదా అని చెప్పడం సమాధానం కాదు. మనం విధ్వంసానికి పాల్పడేంతగా దిగజారిపోయామా? పాకిస్తాన్‌లో ఇలాంటివి ఇంకా ఎక్కువగా జరుగుతున్నాయనే అనుకున్నా తప్పులు చేయడంలో పోల్చుకోవడం సరైందికాదు. మొత్తం ప్రపంచం తప్పు చేయవచ్చుగాక. మనమూ తప్పే చేయాలా? నేను ఈ రోజున తప్పుదారి పడితే అది మీకు బాధ కలిగించదా? అది నాకు చావుకన్నా దారుణమైంది. ఈ దర్గాకు జరిగిన విధ్వంసాన్ని చూసి మనం సిగ్గుపడక తప్పదు."జీవితమంతా రామనామ స్మరణ చేస్తూ గడిపిన గాంధీజీ కన్నా సనాతన హిందూత్వవాదులు ఎవరు? కాని హిందూ మత జపంచేసే బి.జె.పి. గణానికి ఆయన బోధలు తలకెక్కుతాయా? అవి అర్థమైతే ఊరూరా మసీదుల వినాశనమే మహత్కార్యమని ఊరేగుతారు.

ఈ మత సామరస్యం బోధలు భరించలేకనే నిరాహారదీక్ష విరమించిన తరువాత పది రోజులలోనే ఆర్.ఎస్.ఎస్. - హిందూ మహాసభలకు చెందిన వినాయక్ గాడ్సే ముఠా గాంధీపై విఫల హత్యాయత్నం చేసింది. మరో రెండు రోజులకు జనవరి 30న మహాత్ముణ్ణి గాడ్సే కిరాతకంగా కాల్చి చంపాడు. కాని ఆయన ప్రబోధించిన మత సామరస్య వాతావరణాన్ని మనం మరచిపోవచ్చా?

# వి.హెచ్.పి. వాదనలను వమ్ముచేసే అయోధ్య త్రవ్వకాలు

1976–77లో అయోధ్యలో ప్రొఫెసర్ బి.బి.లాల్ త్రవ్వకాల గురించి సమాచారం కోసం స్వతంత్ర చరిత్ర పరిశోధకులు ఎంతో కాలంగా ప్రయత్నిస్తున్నప్పటికీ ఇటీవలనే వారికి అది లభించింది. ప్రొ.ఆర్.ఎస్. శర్మ, ప్రొ.అతర్‌అలీ, ప్రొ.నూరల్‌ఖాన్, ప్రొ. డి.ఎన్.ఝాలు ఆ సమాచారాన్ని అక్టోబరు 23వ తేదీన పరిశీలించేందుకు ప్రభుత్వం అనుమతించింది. ఆ తర్వాత ఈ నల్గురు చరిత్రకారులు ఈ దిగువ ప్రకటనను పత్రికలకు విడుదల చేశారు.

వి.హెచ్.పి.ప్రతినిధులు తమవైఖరిని పదేపదే మార్చుకుంటున్నారు. మసీదు క్రింద రామాలయం ఉండేదని వారు మొదట చెప్పారు. చారిత్రకంగాను, పురాతత్వ త్రవ్వకాల ద్వారాను దీనిని నిరూపించడం సాధ్యంకాకపోవడంతో అక్కడ విష్ణు ఆలయం ఉండేదని చెప్పసాగారు. బాబ్రీమసీదు పరిహద్దుగోడకు 200 మీటర్ల దూరంలో శివుని విగ్రహందొరికిందని, అక్కడ శివాలయం ఉండేదని ఇప్పుడు చెబుతున్నారు. కేవలం శివుని విగ్రహం దొరికినంత మాత్రాన అక్కడ ఆలయం ఉందని చెప్పజాలం. ఏ విధమైన నిర్దిష్టమైన ఆధారాలు లేకుండానే ఈ విగ్రహాల్ని దేవాలయం ఉన్నదని చెప్పడానికి ఒక సాకుగా ఉపయోగించుకుంటున్నారు.

బాబ్రీ మసీదు స్థలంలో రామాలయం ఉండేదని, అది తర్వాత ధ్వంసంచేయబడిందన్న తమ వాదనను సమర్థించుకునేందుకు వి.హెచ్.పి. తరచూ ప్రొ.బి.బి.లాల్, ప్రొ.వై.పి. శర్మ, శ్రీ కె.ఎం. శ్రీవాస్తవ పేర్లను తెస్తుంటుంది. అయితే వీరెవరూ మసీదు క్రిందకాని, 1976-77లో ప్రొ.బి.బి.లాల్ త్రవ్వకాలు జరిపిన చోటగాని దేవాలయం ఉండేదని నిర్దిష్టంగా చెప్పలేదు. ఇప్పుడు మసీదుకు ఉన్న నల్లరాతి స్తంభాలకు సంబంధించిన నల్లరాయి అయోధ్యలో జరిపిన త్రవ్వకాలలో ఎక్కడా బయట పడలేదు.

ప్రొ.బి.బి.లాల్ అయోధ్యలో ట్రెంచ్-4 త్రవ్వకాల సమాచారాన్ని మేము నిశితంగా పరిశీలించాము. ఆ సమాచారం, అంతకుముందు మా అధ్యయనాలను సమర్థించేదిగానే ఉంది. ఈ ట్రెంచ్‌లో రాతి దేవాలయం ఉన్న దాఖలాలు ఎక్కడాలేవు. ఆ ట్రెంచ్‌లో లభించిన నిర్మాణం సాధారణ స్తంభాలతో కూడినది మాత్రమే. ఈ ఇటుక స్తంభాలున్న పునాది మట్టం, బాబ్రీ మసీదు స్తంభాల క్రింది మట్టంకన్నా చాల తక్కువగా ఉన్నది. ఈ నిర్మాణం ప్లాన్, సెక్షన్ను, ఛాయాచిత్రాలు బాబ్రీ మసీదుకు వాడిన రాతిస్తంభాలకు ఎటువంటి పోలికలేదు. త్రవ్వకాలలో పై నాలుగు పొరలలోను మధ్యకాలాల నాటి మెరిసే సామగ్రి లభించింది. ఇది ముస్లిములు సాధారణంగా వాడేది.. అయితే ఇక్కడ మసీదు పరిసరాలలో 13వ శతాబ్ది నుండి ముస్లింలు నివసించారు.

వి.హెచ్.పి.తాను నిర్వహించిన త్రవ్వకాల గురించే ఇటీవలి కాలంలో పెద్ద ప్రచారం చేస్తున్నది. ఇక్కడ దేవాలయమే ఉండేదని వాదించేవారు నిర్వహించిన త్రవ్వకాల సమాచారాన్ని ఎలా విశ్వసించగలం? భారత పురాతత్వ సర్వేకి చెందిన అధికారులు; ఇక్కడ దేవాలయం లేదని గట్టిగావాదించేవారి ప్రతినిధులుగాని ఈ త్రవ్వకాలవద్ద లేరు. ఇక్కడ లభించాయని వారు చెబుతున్న సామగ్రిని మనం ఎలా నమ్మగలం. ఇటువంటి స్ట్రాటిగ్రాఫికల్ త్రవ్వకాలలో వారు చెబుతున్న సామగ్రి ఎక్కడా లభించలేదు. ఒక గోతిలో వారు తమకు లభించాయని చెబుతున్న సామగ్రిని కేవలం ఫొటో తీసుకునేందుకే ఒక చెక్కబల్లపై ఉంచారు. మసీదుకు నల్లరాతి స్తంభాలున్నాయని వి.హెచ్.పి. వారు అంగీకరిస్తూనే వున్నారు. అయితే ఈప్రాంతంలో జరిగిన క్రొత్త త్రవ్వకాలలో సైతం ఎక్కడా నల్లరాయి లభించలేదు. నాజూకుగా ఉండే అమలక రాయిని దేవాలయ శిఖరానికి వాడారని వారు చెబుతున్నారు. అయితే మధ్య గంగా మైదానంలో ఎక్కడా అటువంటి రాయి లభించదు. ఈ రాతి ముక్కలనుబట్టి అక్కడ రాతిదేవాలయం ఉండేదని మనం వాదన కోసం అంగీకరించినా, తూర్పు యు.పి. బీహార్ మైదానంలో ఎక్కడ రాతి దేవాలయాలు మనకు కనిపించవు. అందువల్ల ఎక్కడా కొండరాతి ప్రాంతాలలో లభించే రాతి ముక్కలు అయోధ్యలో లభించడం ఎంతో ఆశ్చర్యం గొలుపుతుంది.





# చరిత్ర గ్రంథాలను వక్రీకరిస్తున్న బి.జె.పి.



భారతీయ జనతాపార్టీ పాలిత రాష్ట్రాలయిన ఉత్తర ప్రదేశ్, మధ్య ప్రదేశ్‌లలో చరిత్రను వక్రీకరించడానికి ఒక పెద్ద ప్రయత్నం జరుగుతున్నది స్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ పాఠ్య ప్రణాళికలను హిందూమతతత్వంతో నింపడమే కాకుండా, పరీక్షలు నిర్వహించడానికి ప్రధానంగా సంఘపరివార్ నిర్వహిస్తున్న స్కూళ్ళలో సమాంతర బోర్డులు ఏర్పాటు చేయడానికి పూనుకొంటున్నారు.

ఈ కార్యక్రమానికి కరుడు గట్టిన ఆర్.ఎస్.ఎస్. సిద్ధాంతవేత్త ప్రొ॥ ఓంనాగ్‌పాల్ సూత్రధారిగా వ్యవహరిస్తున్నారు. ఈయన మధ్య ప్రదేశ్ కాలేజీ విద్యా బోర్డులో కీలక స్థానంలో వున్నారు. కల్యాణ్‌సింగ్ నాయకత్వంలోని ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం ఇవ్వటికే హైస్కూల్ స్థాయిలో పాఠ్య ప్రణాళికలో మతతత్వంతో కూడిన మార్పులను ప్రవేశపెట్టింది. ప్రాథమిక, కాలేజీ స్థాయిలలో కూడా ఇప్పుడు ఈ రెండు రాష్ట్రాలలో మార్పులు జరుగుతున్నాయి.

ఆర్యుల ఆధిక్యత గురించి చెప్పడం, వేదకాలపు సంస్కృతిని శ్లాఘించడం, ఢిల్లీ సుల్తానులకు, మొగలులకు వ్యతిరేకంగా పోరాడిన మధ్యకాలంనాటి వారిని కీర్తించడం ఈ మార్పులన్నింటి సారాంశంగా వుంది. ఈ క్రమంలో బి.జె.పి. సిద్ధాంత కారులు కొత్త "వాస్తవాలను" కలుపుతున్నారు. ఉన్నవాటిని తీసివేస్తున్నారు. ఉత్తర ప్రదేశ్‌లో 9,10 తరగతుల చరిత్ర పాఠ్యపుస్తకంలో కొత్తగా ఒక పేరా గ్రాఫ్‌ను కలపడం దీనికి స్పష్టమైన ఉదాహరణ.

"బాబర్ సేనాని మీర్ భక్షి దేవాలయాన్ని ధ్వంసం చేసి ఆస్థానంలో మసీదు నిర్మించాడు. ఈ నిర్మాణం వివాదంలో ఉన్నప్పటికీ హిందువులు ఇప్పటికీ దానిని దేవాలయంగానే పరిగణిస్తున్నారు" అని కలిపారు. బి.జె.పి., వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్.ల కూటమి వాదిస్తున్నట్లుగా బాబరీ మసీదు దేవాలయాన్ని కూల్చి కట్టారా, లేదా అన్నది ఇంకా తేలలేదు. అయినప్పటికీ బి జె.పి. ప్రభుత్వం దానిని ఒక చారిత్రిక సత్యంగా పాఠ్య గ్రంథంలో చేర్చింది. పుస్తకంలో చేర్చిన విషయం అనుమానాస్పదమైనదేనని విద్యాశాకాధికారులకూ తెలుసు. ఇది విశ్వాసానికి సంబంధించిన అంశం కాబట్టి వ్యతిరేకించనవసరం లేదని, రాజ్‌నాథ్ సింగ్ చెపుతున్నారు. ఇటువంటి నిర్ధారణ కాని 'విశ్వాసాలు' అనేకం ఈ పాఠ్య గ్రంథాలలో చేర్చబడ్డాయి. ఆర్యుల పుట్టుక గురించి ఇటువంటి విశ్వాసాలనే ఈ పుస్తకాలలో చెప్పారు "ఆర్యులు మధ్య ఆసియానుండి భారతదేశంలోకి ప్రవేశించారని చెప్పబడుతున్నప్పటికీ ఆర్యుల పుట్టుక భారత దేశంలో జరిగిందని ఇటీవల పరిశోధనలు తెలుపుతున్నాయి" అని కొత్తగా ఈ పాఠ్యపుస్తకాలలో పేర్కొన్నారు.

అదే విధంగా మహారాణా ప్రతాప్ సింగ్, శివాజీ లాంటి వారిని ఆకాశానికెత్తివేయడం ఈ రెండు రాష్ట్రాల పాఠ్యపుస్తకాలలో కనిపిస్తున్నది. అక్బర్, ఔరంగజేబులాంటి వారు భారతదేశంలోని ఇతర రాజులపై ఎంతటి గొప్ప విజయాలు సాధించినా వాటిని తక్కువచేసి చెప్పడం జరిగింది. మహాశివాజీ, మహారాణా ప్రతాప్‌సింగ్ అనే మాటలను వాడాలి తప్ప, అక్బరు, ఔరంగజేబు లాంటి విదేశీ దురాక్రమణ దారులకు 'మహా' అనేమాటను వాడరాదని మధ్యప్రదేశ్ విద్యాశాఖమంత్రి విక్రం వర్మ చెబుతున్నారు. ముస్లిం దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా పోరాడడమొక్కటే భారతీయ సంప్రదాయం అని చెప్పడం చరిత్రను వక్రీకరించడమేనని యు.పి. మాధ్యమిక ఉపాధ్యాయుల సంఘం నాయకుడు, మాజీ జనతాదళ్ ఎం.పి. రాజనాథ్‌సింగ్ విమర్శించారు. లక్నోలోని 'బేగం హజరత్ మహల్' పేరును 'ఊర్మిళ వాటిక'గా మార్చడాన్ని ఆయన తీవ్రంగా విమర్శించారు బేగం హజరత్ 1857లో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాడి ప్రాణాలర్పించిన విషయాన్ని ఆయన గుర్తుచేశారు.

మహాత్మాగాంధీ, ఆలీ సోదరులు సంయుక్తంగా యిచ్చిన పిలుపులో జరిగిన ఖిలాఫత్ ఉద్యమం స్వాతంత్ర్యం కోసం జరిగిన మొట్టమొదటి అతి పెద్ద ప్రజా సమీకరణ అని ఆనాటి చరిత్ర కారులంతా శ్లాఘించారు. కాని ఇప్పుడు బి.జె.పి. సొంత రాష్ట్రాలలో ఈ వాస్తవాన్నివ కూడా వక్రీకరించారు. 'ఖిలాఫత్ ఉద్యమం స్వాతంత్ర్య పోరాటానికి హాని కల్గించిందన్న దానిలో వేరే అభిప్రాయానికి తావులేదు. స్వాతంత్ర్య పోరాట వేగాన్ని అది తగ్గించింది. ఖిలాఫత్ ఉద్యమాన్ని శ్లాఘించడానికి బదులు ఈ వాస్తవం గురించి విద్యార్థులకు చెప్పవలసిన అవసరం ఎంతైనా వుంది. "ఖిలాఫత్ ఉద్యమం దేశ విభజనకు తొలిమెట్టు" అని మధ్యప్రదేశ్ విద్యాశాఖమంత్రి విక్రంవర్మ చెప్పినట్లు రాజనాథ్ సింగ్ తెలిపారు.

అదే కాలంలో ఆర్ ఎస్ ఎస్, ఇతర హిందూ సంస్థలు పాల్పడిన తీవ్రవాద చర్యలను కీర్తించడానికి ఏమీ వెనుకాడలేదు ఆర్ ఎస్ ఎస్. సంస్థాపకుడు డా॥ కేశవరావు హెడ్గేవార్ కు స్వాతంత్ర్య పోరాటంలో ప్రముఖ స్థానమున్నట్లు ఆ పుస్తకాలలో చెప్పారు

ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం పాఠ్యప్రణాళికను హిందూ తత్వానికి అనుగుణంగా మారుస్తుంటే, మధ్య ప్రదేశ్ ప్రభుత్వ విద్యారంగంలో సమాంతర సంస్థలనే ఏర్పాటు చేస్తున్నది. మధ్యప్రదేశ్‌లో సంఘపరివార్ ఆధ్వర్యంలో విద్యాభారతి 1800 ప్రైవేట్ స్కూళ్ళను నిర్వహిస్తున్నది. ఈసంస్థ ప్రాథమిక, మాధ్యమిక స్థాయిలో అంటే 5,8 తరగతులకు స్వంతంగానే పరీక్షలను నిర్వహిస్తున్నది. వీటిని రాష్ట్ర విద్యా బోర్డు నిర్వహించే పరీక్షలకు సమానమైనవిగా ప్రభుత్వం పరిగణిస్తున్నది. ఈ ప్రవేట్ విద్యాసంస్థ పరీక్షల నిర్వహణకు ఒక బోర్డును ఏర్పాటు చేసింది. 1992 జూలై 21వ తేదీ ప్రభుత్వ ఉత్తర్వు ప్రకారం ఈ బోర్డులో ఇద్దరు సభ్యులను ప్రభుత్వం నామినేట్ చేస్తుంది. మిగిలిన వారంతా విద్యాభారతికి చెందినవారే అంటే ఈసంస్థ నిర్వహించే పరీక్షా పద్ధతులపైనా, మార్కులు వేయడంపైనా ప్రభుత్వ విద్యాబోర్డుకు ఎటువంటి అధికారం ఉండదు.

మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్, బీహార్, మహారాష్ట్రలలో 'సరస్వతి శిశువిద్యామందిర్'లు విస్తృతంగా స్థాపించబడ్డాయి. వీటి నిర్వాహకులు ఆర్.ఎస్.ఎస్ తో తమ సిద్ధాంత బాంధవ్యాన్ని ఏ మాత్రం దాచిపెట్టుకోరు. పిల్లల దుస్తులలో తప్ప శిశు మందిర్‌కు, ఇతర ఆర్.ఎస్.ఎస్. శాఖలకు ఎటువంటి తేడా కనిపించదు. ప్రాచ్య సంస్కృతిని ప్రచారం చేయడమే విద్యాభారతి లక్ష్యమని వారు బహిరంగంగా చెబుతున్నారు.

ఈ పాఠశాలలకు టీచర్లను రిక్రూట్ చేసుకోవడం ఎంతో విచిత్రంగా ఉంటుంది ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయులకు పేర్కొనబడే అర్హతలు విద్యాభారతి సంస్థలలో పనిచేయడానికి పనికిరావు విద్యాభారతిలో పనిచేసేవారు మొట్టమొదట ఆర్ ఎస్.ఎస్ ప్రచారకులై ఉండాలి.

## అయోధ్య-సోమనాథ్ దేవాలయం పోలికే లేదు

నేటి గుజరాత్‌లోని సోమనాథ్‌దేవాలయాన్ని గజనీ మహ్మద్ అనేకసార్లు కొల్లగొట్టాడని మనం చరిత్రలో చదువుకున్నాం. అది క్రీ.శ 1026లో జరిగింది సోమనాథ్‌దేవాలయాన్ని హిందువులెప్పుడూ పవిత్రంగా చూసేవారు. సుమారు క్రీ శ 1706 ప్రాంతంలో నాలుగైదేళ్ళు దాన్ని మసీదుగా వాడిన కాలం మాత్రమే ఇందుకు మినహాయింపు. అది జునగడ్ నవాబు రాజ్యంలో వున్న 1812లో హిందూ పాలకుడైన బరోడారాజు బ్రిటిష్‌వారి మధ్యవర్తిత్వంతో దాన్ని తన స్వాధీనంలోకి తెచ్చుకున్నాడు. 1947లో దేశ నాయకులు ప్రజలనుంచి సేకరించిన విరాళాలతో దాని పునరుద్ధరణ ప్రారంభించారు.

అయితే సోమనాథ్‌ను - అయోధ్యకు పోలిక పెట్టడం కుదరదు ఎందుకంటే ఈనాటి బాబ్రీ మసీదు పైలె స్వాధీనం చేసుకునే సమయానికి అది మసీదుగా లేదు.

సోమనాథ్‌దేవాలయ విషయంలో కూడ ప్రధాని నెహ్రూకు రాష్ట్రపతి బాబు రాజేంద్ర ప్రసాద్‌కు మధ్య విభేదాలు వచ్చాయి. అక్కడ దేవుడి విగ్రహ ప్రతిష్టాపనకు రాజ్యాధినేతగ వారు హాజరుకావడం మంచిదికాదని నెహ్రూ చెప్పినా, బాబు రాజేంద్ర ప్రసాద్ వినలేదు. "నేను చర్చికి, మసీదుకు కూడా పోతాను" అని ఆయన జవాబిచ్చారట. అయితే సోమనాథ్ దేవాలయ ఉత్సవంలో రాజేంద్ర ప్రసాద్ చెప్పిన మాటలు అయోధ్య వివాదానికి కూడా కొంత వరకు వర్తిస్తాయి.

"మనిషి గడిచిపోయిన గంటకు తిరిగి వెళ్ళడం సాధ్యం కాదు ఈరోజు మనం సంతోషంగా వున్నామంటే దాని అర్థం మనం కాలక్రమంలో తగిలి, మానిపోయిన గాయాలన్నింటిని కెలుకుతామని కాదు. ప్రాచీన కాలంలోని తప్పులన్నీ సరిదిద్దడంకాదు మనలక్ష్యం ధర్మానికి మూలాధారాలైన విశ్వాసాన్ని, నమ్మకాన్ని పునరుద్ధాటించడం మాత్రమే".

కనుక చారిత్రకంగా సోమనాథ్‌కు అయోధ్యకు పోలికే లేదు కాని భా.జ.పా నాయకులు అలా పోలిక పెడుతూనే అద్వానీ 1990లో తన రథయాత్ర కూడా అక్కడినుంచే మొదలెట్టారు!

గతం చేసిన గాయాలు కెలకవద్దని బాబూ రాజేంద్రప్రసాద్ చెప్పిన మాటలకు బాబర్ కాలంలో ఏదో జరిగిందనే పేర మసీదు కూల్చుదామనే భా జ. పా చేతలకు ఏమైనా పోలిక వుందా?

## అయోధ్య వివాదమూ- లాహోర్ కేసు

అయోధ్య సమస్యను పరస్పర సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకుందాం లేదా కోర్టు తీర్పుకు కట్టుబడదాం అంటే బి జె పి. నేతలు ససేమిరా వీల్లేదంటారు. కాని సదా వారి విమర్శకు గురయ్యే పాకిస్తాన్‌లో - ఇస్లాం మతం అధికారికంగా స్వీకరించబడిన చోట ఇలాంటి సమస్యను పరిష్కరించిన తీరు తెలుసుకోవడం ఆసక్తిదాయకంగా వుండగలదు.

పాకిస్తాన్‌లోని లాహోర్ ప్రాంతంలో 1722లో షహీద్ గంజ్ మసీదు నిర్మించారు. తర్వాత కాలంలో అక్కడ ముస్లిం గవర్నర్లు సిక్కులను ఊచకోత కోశారట. ఆ కోపంతో 1762 నాటికి సిక్కులు దాన్ని స్వాధీనం చేసుకున్నారు. అక్కడ షహీద్ గంజ్ భాయ్ తరూసింగ్ గురుద్వారా నిర్మించారు. అప్పటినుంచి అదివారి ప్రార్థనా స్థలంగానే వుంది. 1799లో రంజిత్ సింగ్ వాయువ్య ప్రాంతానికి పాలకుడైనాడు. 1849 వరకు లాహోర్ రాజ్యం సిక్కుల పాలనలో వుండి, తర్వాత బ్రిటిష్‌వారి పరమైంది. అది తిరిగి తమకు యివ్వాలని ముస్లిం మౌల్వీలు చెబుతూ వచ్చారు. 20 ఏళ్ళుగా అది సిక్కుల అధీనంలో వుంది గనక ఈ వాదనను కోర్టు ఒప్పుకోలేదు. 1883 నాటికి ఆ భవనం పూర్తిగా పాతబడిపోయింది. 1883లో ముస్లిమ్‌లు తమ మసీదు తమకిప్పించాలని పంజాబ్ గవర్నర్‌కు మహజరు పంపుకున్నారు. అధికారులచే దర్యాప్తు జరిపించిన తర్వాత గవర్నర్ జోక్యానికి నిరాకరించారు.

1925లో సిక్కు గురుద్వారాల చట్టం ఆమోదించబడింది. ఏవి గురుద్వారా ఆస్తులు అని నిర్ధారించే పని మొదలైంది పైన పేర్కొన్న గురుద్వారాను, దాని చుట్టూ గల స్థలాన్ని సిక్కులకు చెందినదిగానే ప్రభుత్వం నిర్ణయించి నోటిఫికేషన్ యిచ్చింది. అది వ్యక్తిగతంగా తమకు చెందాలని కొందరు సిక్కు మహంతలు, అసలు అది మాకే రావాలని ముస్లిం మౌల్వీలు కోర్టులో పిటిషన్‌లు వేశారు. 1930 జనవరి 30న సిక్కు గురుద్వారాల ట్రిబ్యునల్ ముందు ఈ పిటిషన్లు విచారణకు వచ్చాయి. రెంటినీ అది కొట్టివేసింది. కాని 1935 జూలై 7 రాత్రి ఆ కట్టడం కూలగొట్టబడింది. సిక్కులే అందుకు కారకులని వార్తలు వచ్చాయి. ఒకప్పటి తమ మసీదు కూల్చారని ముస్లింలలో ఆగ్రహావేశాలు బయలుదేరాయి. ఆందోళన రగిలింది. అప్పుడు మహమ్మదాలి జిన్నా మధ్యవర్తిగా వ్యవహరించారు రాజ్యాంగం ప్రకారం పరిష్కారం చేసుకుందామని ముస్లిమ్‌లకు నచ్చచెప్పారు 1935 అక్టోబర్ 30న మరో పిటిషన్ దాఖలైంది. దాన్ని కూడా కొట్టివేశారు ఆ తీర్పు ముస్లిమ్‌లకు రుచించకపోవడంతో తర్వాత పూర్తి ధర్మాసనం విచారణ జరిపింది. ఆ స్థలం చాలాకాలంగా సిక్కుల స్వాధీనంలో వున్నందున దానిపై ముస్లింలకు హక్కు పోయిందని, ఇప్పుడు అక్కడ కట్టడాన్ని కూల్చినా దానివల్ల వారికి కొత్తగా హక్కు రాదని కోర్టు చెప్పింది.

ఇక ఆ తర్వాత ఆనాటి అత్యున్నత న్యాయస్థానమైన ప్రివీకౌన్సిల్ ముందుకు ఆ కేసు వచ్చింది. చివరకు వారు కూడా సిక్కులకు అనుకూలంగానే తీర్పునిచ్చారు. సికిందర్‌హయత్‌ఖాన్‌నాయకత్వంలోని ప్రభుత్వం దాన్ని అమలు జరిపింది. జిన్నా దాన్ని ఆమోదించారు. పాకిస్తాన్‌లో తర్వాత అనేక అవాంఛనీయ ఘటనలు జరిగినా పైన చెప్పిన భాయ్ తరూసింగ్ గురుద్వారా మాత్రం సిక్కుల అధీనంలోనే కొనసాగుతుంది.

మరి లౌకికతత్వాన్ని రాజ్యాంగంలో రాసుకున్న మన దేశంలో కొన్ని వందల ఏళ్ళకిందట జరిగిందని చెప్పబడుతున్న ఘటనల ఆధారంగా మైనారిటీ మతంవారి ప్రార్థనా స్థలాన్ని ధ్వంసం చేయడం న్యాయమా?

# సెక్యులరిజానికి తూట్లు - దేశ ప్రజల పాట్లు

1949లో మన రాజ్యాంగం రచించబడినపుడుడప క్రమణికలో" సర్వసత్తాక ప్రజాస్వామ్య రిపబ్లిక్" గా మాత్రమే పేర్కొనబడింది. మత ప్రసక్తిగల రాజ్యాంగమనియు, మత ప్రసక్తిలేని రాజ్యాంగమనియు చెప్పలేదు. 1976లో తెచ్చిన రాజ్యాంగ సవరణ ద్వారా పైదానికి" సెక్యులర్, సోషలిస్టు" అని రెండు పదాలు చేర్చబడినాయి. అంటే మనది మత ప్రసక్తిలేని రాజ్యాంగమని స్పష్టపరచబడినదన్నమాట

పీఠాల నెక్కిన పెద్దలు తమ మత విశ్వాసాలను దొడ్డిదారిన ప్రభుత్వ యంత్రాంగం లోనికి ప్రవేశపెట్టడానికి చేసే ప్రయత్నమే ఇది. పెట్టుబడిదారీ వ్యవస్థను పటిష్టం చేసుకోవాలని తాపత్రయం ఒకవైపు, ఫ్యూడల్ భావాలనుండి బయటపడలేని అశక్తత మరొకవైపు వుండటంవలననూ, సంకుచిత రాజకీయ ప్రయోజనాలకు ప్రజలలోవున్నమత మౌఢ్యాన్ని ఉపయోగించుకోవాలనే తాపత్రయము మరొక వైపు ఈగందరగోళ పరిస్థితికి దారి

## [illegible]

తీస్తున్నాయి.

మనరాజ్యాంగంలో మతానికి, మత స్వేచ్ఛకు సంబంధించిన అంశాలు ఆర్టికల్25నుండి 30వరకు పొందుపరచబడ్డాయి. అన్నిమతాలవారిని సంతృప్తి పరచాలనే తాపత్రయంతో అవసరమైన అనేక వివరణలను కూడా ఇవ్వటం జరిగింది. ఆర్టికల్ 25లో మతవిశ్వాసం కలిగి యుండటానికి, మతాన్ని స్వేచ్ఛగా ఆచరించటానికి, ప్రచారం చేసుకోవటానికి ప్రతివ్యక్తికి స్వేచ్ఛయున్నదని

## [illegible]

చెప్పబడినది. అందులో భాగంగానే సంఘసంస్కరణలకు అవకాశం రాజ్యాంగపరంగా వున్నదని చెప్పబడింది. సిక్కులకు కృపాణముధరించే హక్కు స్పష్టము చేయబడినది. హిందువులంటే సిక్కులు, జైనులు, బౌద్ధులు కూడా అందులో భాగంగానే పరిగణింపబడతాయని చెప్పబడినది.

ఈ ఆర్టికల్ సిక్కు మతవాదుల నిరసనకు గురికాబడిన సంగతి, దాని బహిరంగముగా దహనము చేసే కార్యక్రమం చేపట్టబడిన సంగతి మనకందరికీ తెలిసిందే. ఆర్టికల్ 26లో ప్రతి మతానికి స్వంత సంస్థలు నెలకొల్పుకోవడానికి,స్థిరాస్తులు కలిగి యుండటానికి హక్కు కలదని పేర్కొనబడింది

భూసంస్కరణ చట్టం సందర్భంగాను, కౌలుదారీ చట్టం సందర్భంగానూ ఈ ఆర్టికల్ అవరోధం అవుతుందా అన్నది చర్చనీయాంశం అయింది. తిరుపతి దేవస్థానం ఖజానా ప్రభుత్వ ట్రెజరీలోనికి జమకట్ట వచ్చునా అన్న విషయమై రాజ్యాంగ పరమైన వివాదం కొనసాగింది.

ఆర్టికల్ 28లో "పూర్తిగా" ప్రభుత్వ సహాయంతో నడిచే విద్యాసంస్థలలో మతబోధన చేయరాదని చెప్పబడినది. అంటేపాక్షికంగా సహాయంపొందే సంస్థలకు ఆ అవకాశం వుంచబడినదన్నమాట. అలాగే ఎండోమెంట్లు, ట్రస్టులు నడిపే విద్యాసంస్థలకు పైనిషేధము వర్తించదనికూడా చెప్పబడినది. ప్రభుత్వాల యొక్క గుర్తింపు పొందినలేక సహాయం పొందుతున్న విద్యాసంస్థలలో చేరిన విద్యార్థులు మతబోధన తరగతులకు హాజరుకానక్కరలేదని, కాని తల్లిదండ్రుల అనుమతితో హాజరు కావచ్చని చెప్పబడినది ఈ మొత్తం వివరణల పర్యవసానం మతబోధనలు అనేక విద్యాసంస్థలకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను అవకాశం కల్పించబడినది

ఆర్టికల్ 30లో మైనారిటీమతస్థులకు వారు కోరుకున్న పద్ధతిలో విద్యాలయాలు స్థాపించుకోవడానికి, నడుపుకోవడానికి హక్కు కల్పించబడినది. అలాంటి సంస్థలకుప్రభుత్వ గ్రాంట్లు ఇవ్వడంలో విపక్ష చూపబడదని కూడా చెప్పబడినది. దీని అర్థమూ, పర్యవసానమూ వివరించవలసిన అవసరములేదు. ఈ పద్ధతికి, వాస్తవమైన సెక్యులరిజానికి పొంతన ఎలాకుదురుతుందో ఊహించడం కష్టం

అయితే ఈ సెక్యులర్ అన్న పదానికి సాధారణముగా "మతాతీత లేక మత ప్రసక్తిలేని" అని అన్న అర్థాలు సాధారణముగా చెల్లుతూ వస్తున్నాయి. ఈ పదానికి ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు డిక్షనరీలో "మతానికి, చర్చికి సంబంధించని ప్రాపంచిక విషయాలకు సంబంధించినట్టి" అని, మతాతీత అంటే "మతానికి సంబంధము లేని" అని అర్థము ఇవ్వబడినది. నిజానికి ఆ అర్థములోనే సెక్యులర్ అన్న పదము రాజ్యాంగములో వాడబడిందని భావించాలి. కాని విశేషమేమిటంటే మన రాజకీయ నాయకులు చాలా మంది తమకు తోచిన అర్థాన్నల్లా ఈ పదానికి ఆపాదించుతూ వున్నారు. రాష్ట్రపతులు, ప్రధానులు, ముఖ్యమంత్రులు కూడా అన్ని మతాల ఎడ సమాన గౌరవమని దీన్ని నిర్వచిస్తుంటారు. కొన్నాళ్ళుపోతే మరొక పెద్దమనిషి సెక్యులరిజం అంటే అన్నిమతాలు రాజ్యం చేయడమనే చెప్పితే మనం ఆశ్చర్యపడనక్కరలేదు.

రాజ్యాంగంలో మతాతీతమన్నపదాన్ని వాడడము వెనుకయున్న ఆలోచన రాజ్యాంగ యంత్రపరంగా, ప్రభుత్వపరంగా, మత ప్రసక్తి,మతపక్షపాతం యుండ కూడదన్నదే పరమత సహనం అన్నది, అన్నిమతాల యెడల గౌరవము అన్నది ఏదో ఒక మతానికి చెందిన ప్రత్యేకవ్యక్తి యొక్క ఆలోచనకు అభిప్రాయానికి చిహ్నం కావచ్చుకాని, రాజ్యాంగ యంత్రానికి దీనిని అన్వయించడం స్వీయాత్మక ఆలోచనా ధోరణికి ప్రతిబింబం. సాధారణ ప్రజానీకాన్ని రాజ్యాంగము యొక్క అసలైన అవగాహనకు దూరంగా ఉంచడానికి చేసే ప్రయత్నమే ఇది. తద్వారా అధికార

అమెరికా రాజ్యాంగ ప్రకారం ప్రభుత్వ నిధులతో నడిచే విద్యా సంస్థలలో ఏ మత బోధనా చేయడం నిషిద్ధం. ఇది చాలా కీలకమైన అంశం. వ్యక్తిత్వం రూపొందే ఆ దశలో విద్యాలయాలలో వుండే మత బోధకుల ప్రభావం చాలా వుంటుంది. ఈనాడు బిజెపి పాలిత రాష్ట్రాలలో చరిత్రను, పాఠ్యపుస్తకాలను వక్రీకరించి, మొత్తం విద్యా వ్యవస్థనే కలుషితం చేయడం చూస్తున్నాం.

మన రాజ్యాంగంలో ఆర్టికల్ 44లో ఇలా చెప్పబడినది. 'యావత్ భారత దేశ పౌరులకు ఒకే విధమైన సివిల్‌కోడ్ రూపొందించడానికిప్రభుత్వం ప్రయత్నిస్తుంది'.

కాని ఆసక్తికరమైన సంగతేమిటంటే యీఆర్టికల్ ఆదేశిక సూత్రాల అధ్యాయములో చేర్చబడినది. అంటే ఒక కాలపరిమితి లేకుండా కేవలము ఒక ఆశగాను, ఆశయంగాను పేర్కొనబడినదన్న మాట. రాజ్యాంగము రూపొందించబడి 35 సం॥లు కావస్తున్నా ఈ ఆశయము వైపు మనము ఒక్కఅడుగు కూడా

ముందుకు వేయలేదు. హిందువులకు (శిక్కులు, జైనులు, బౌద్ధులతోసహా) ఒక సివిల్ కోడ్, ముస్లింలకు మరొకటి, ఇలా రకరకాల వ్యక్తిగత చట్టాలు (పర్సనల్ లా) అమలులోవుంటూనేయున్నాయి. ఇలా అందరికీ వర్తించే ఒకే చట్టముకోసం అనేకసందర్భాలలో ప్రముఖులైన న్యాయవేత్తలు సూచించినారు. జస్టిస్ కృష్ణయ్యర్, జస్టిస్ ఖలీద్ లాంటి వారు చాలా కాలము క్రితమే తమ అభిప్రాయాలు చెప్పినారు. ఇటీవలనే గుజరాత్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ సుబ్రహ్మణ్య పుట్టి సత్వర సర్వసమాన సివిల్‌కోడ్ యొక్క ఆవశ్యకతను గూర్చి నొక్కి చెప్పినారు. ప్రొ॥ ఇర్ఫాన్ హబీబ్, మార్క్సిస్టు పార్టీనాయకుడు ఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్, కాంగ్రెసు-ఐ కార్యదర్శి డా॥ రాజేంద్రకుమారి బాజ్‌పాయ్ లాంటి ప్రముఖులు కూడా దీని ఆవశ్యకతను గూర్చి వక్కాణిస్తున్నారు కాని దురదృష్టమేమంటే ముస్లిం మత ఛాందసులు, శిక్కుమతోన్మాదులు ఈ సూచనను గట్టిగా వ్యతిరేకించడము ప్రారంభించినారు.

## ఆచరణ :

సెక్యులరిజాన్ని భ్రష్టు పట్టించటంలో కరుణాకరన్ మొదటివాడు కాదు. బహుశా ఆఖరివాడూకాదు. ఆచరణలో సెక్యులరిజం స్థూలంగా నాలుగు రంగాలలో వంచనకు గురి కాబడుతుంది.

మొదటిది రాజకీయరంగము. 1958-59 మధ్య కేరళలో జరిగిన సంఘటనలు చాలామందికి గుర్తుండే వుంటాయి. ఆనాటి కమ్యూనిస్టు ప్రభుత్వమును సవాలు చేసిన మొదటి సమస్య క్రైస్తవ మిషనరీలకు సంబంధించిన విద్యాలయాలు. ఆ విద్యాలయాలలో జరుగుతున్నదోపిడీని అరికట్టడానికి కొన్ని కనీస చర్యలు ప్రభుత్వము తలపెట్టినది. చర్చి ప్రభుత్వానికి వ్యతిరేకముగా ధ్వజమెత్తింది. ఆసక్తిదాయకమైన విషయం, ఆనాడు కాంగ్రెసు కేంద్ర ప్రభుత్వము కూడా క్రిష్టియన్‌మతశక్తులకు వత్తాసుగా నిలబడినది. రాజకీయ పార్టీలు ముఖ్యంగా పాలకవర్గ పార్టీలు తమ స్వార్థప్రయోజనాలకోసం మతాన్ని ఉపయోగించుకోవడానికి ఇది ఒక మచ్చుతునక.

అలాగే 5 సం॥లకు ఒకసారి జరిగే ఎన్నికలలో బూర్జువా పార్టీలన్నీ మతనాయకుల వెంటపడటము చూస్తూనేయున్నాము. 1977లో జనతాపార్టీ ముస్లిం ఓట్లకోసం బుఖారీ వెంటపడితే, 1980లో శ్రీమతి ఇందిరాగాంధీ అదే పనిచేసింది. మత నాయకులు తెలివిగా ఇద్దరిని ఉపయోగించుకొన్నారు. అనేక సందర్భాలలో రాజకీయ ప్రచారము దేవాలయాల నుండి చర్చిలనుండి, మసీదులనుండి జరగడం చూస్తూనే యున్నాము. మతం, మతాచార్యులు మన రాజకీయాలలో కీలకమైన పాత్ర నిర్వహించుతున్నారంటే అతిశయోక్తికాదు.

రెండవది : పాలనా యంత్రాంగం సెక్యులర్ స్పిరిట్‌ను నిత్యం అనేక సందర్భాలలో నీరు కార్చుతూనే యున్నది. ప్రభుత్వపరంగా జరిగే ప్రారంభోత్సవాలలో పురోహిత మంత్రాలు, టెంకాయల మోతలు లేకుండా వుండటములేదు. ప్రధాన మంత్రులు, ముఖ్యమంత్రులు, అముఖ్యమంత్రులు అందరూ ఏదో ఒక బ్రహ్మచారికో, సదాచారికో దాసులుగానే యుంటున్నారు. జ్యోతిష్యుల సూచనల మేరకే పరిపాలన చేస్తున్నారు. బంగళాలు మారుస్తున్నారు. మంత్రదండాలు, రుద్రాక్షమాలలు, కాషాయ వస్త్రాలు ధరిస్తున్నారు. మత సంబంధమైన ఆలయ కట్టడాలకు ప్రభుత్వ భూములను కేటాయించటము, ఉక్కు, సిమెంటు వగైరాలు ప్రత్యేక కోటాలు ఇవ్వడము జరుగుతుంది. మంత్రులు, ముఖ్యమంత్రులు ప్రభుత్వ




లాంఛనాలతో, ప్రభుత్వయంత్రాంగముతో బాబాలను సాయిబాబాలను, పీఠాధిపతులను సందర్శించుచున్నారు. తిరుపతి, శ్రీశైలాలు, అన్నవరాలు చుట్టివస్తున్నారు. భద్రాచల రామునికి ముత్యాల తలంబ్రాలు మోసుక వెళుతున్నారు. ప్రభుత్వయంత్రాంగాన్ని ఇలా మత కార్యక్రమాలకు వినియోగపరచుకోవడము మన రాజ్యాంగము నిర్దేశించిన సెక్యులరిజానికి అనుగుణముగా వున్నదేమో ప్రజలు ఆలోచించాలి.

మూడవది : మనదేశంలో ముఖ్యమైన ప్రసారసాధనాలు రేడియో, దూరదర్శన్ పూర్తిగా ప్రభుత్వరంగంలోనే వున్నాయి. వీటి కార్యక్రమాలు రోజువారి ఆలకించేవారెవరికైనా ఒక విషయం స్పష్టమవుతుంది. మత సంబంధమైన పాటలకు, ఆటలకు పరోక్ష ప్రసారానికి ఈ సాధనాలను అత్యధికంగా ఉపయోగించుచున్నారు. నీతిబోధనలు, ధర్మప్రబోధాల పేరుతో మత ప్రచారం కొనసాగించబడుతున్నది ఏమతానికి ఎంత సమయం కేటాయిస్తున్నారన్నదికాని, లేక అన్ని మతాలకు కొంతకాలం వినియోగిస్తున్నారన్నదికాని ప్రధాన విషయంకాదు. అసలు సెక్యులర్ రాజ్యంలో ప్రభుత్వరంగా ప్రసార సాధనాలలో ఏమతానికైనా అవకాశం ఇవ్వడము సబబా అన్నదే ప్రశ్న.

నాల్గవది : ముఖ్యమయినది విద్యారంగము. మైనారిటీ విద్యాసంస్థ పేరుతో ఒకవైపు ప్రభుత్వ సహాయం పొందుతూ ఒకవైపు భక్తి ప్రచారం, రెండవవైపు వ్యాపారము ఏకథాటిన కొనసాగుతున్నాయి. ఈనాటికి మనకు హిందూ విశ్వవిద్యాలయాలు, ముస్లిం విశ్వవిద్యాలయాలు, గురునానక్ విశ్వవిద్యాలయములు, సాయిబాబా విశ్వవిద్యాలయము అదే పేర్లతో ప్రభుత్వసహాయంతో నడుస్తూనే ఉన్నాయి.

మన పాఠశాలలో పాఠ్యగ్రంథాలుగా ప్రభుత్వం ప్రచురించేవానిలో కూడా భక్తరామదాసు కథ, రామలక్ష్మణులు ప్రత్యక్షముకావడాలు, శ్రీశైల పుణ్యక్షేత్ర మహిమలు, వగైరా వగైరా చోటుచేసుకుంటూనే వున్నాయి.

మతాతీత రాజ్యాంగ వ్యవస్థను నిర్మించాల్సిన భావిపౌరులకు ప్రభుత్వపరంగా ప్రభుత్వ పాఠశాలల్లో ఈ ఛాందసాలు నూరిపోయటం బిడ్డల భవిష్యత్తుకు కానీ, దేశభవిష్యత్తుకు కానీ క్షేమకరమా? ఈనాడు మనదేశం ఎదుర్కొంటున్న అనేక సంక్షోభాలలో మతమౌఢ్యం, మత సంఘర్షణలు, మతకల్లోలాలు కూడావున్నాయని మర్చిపోకూడదు. ఈ దురదృష్టకరమైన పరిస్థితినుండి భవిష్యత్తులోనైనా మనము బయటపడాలంటే నిజమైన మతాతీతమైన రాజ్యాంగ వ్యవస్థను రూపొందించుకోవాలి. సోషలిజం మాట అలావుంచి పెట్టుబడిదారీ పంథాలో జరిగే ఆర్థిక అభివృద్ధి కోసమైనా మతము, మత ఛాందసము అడ్డుగోడగా నిలుస్తుంది. ఈ మత మౌఢ్యం దానిలోనుండివచ్చిన మధ్యయుగపు సామాజిక కట్టుబాట్లు, చట్టాలు వ్యక్తి స్వేచ్ఛకు, స్త్రీ పురుష సమానత్వానికి, సామాజిక ప్రగతికి అవరోధాలుగా నిలుస్తాయి. ఈ అడ్డంకులన్నిటినీ తొలగించుతూ ముందుకు సాగాలంటే మన రాజ్యాంగములో వున్న లొసుగులను సవరించుకోవాలి, చట్టాన్ని మార్చుకోవాలి.

అన్నింటికీ మించి మానవులందరూ సఖ్యతతో, సోదరభావంతో దేశసమైక్యతా దృష్టితో ముందుకు సాగాలంటే ఆర్థిక విప్లవంతో పాటు సామాజిక, భావవిప్లవాలు కూడా వస్తాయి. ఇవి ఒకదానికొకటి దోహదముగా వుంటాయి. ఆర్థికవ్యవస్థ పునాదికి మతము, రాజకీయాలు, నీతిశాస్త్రాలు, చట్టాలు, కళలు, వగైరా ఉపరితలాలు. అయినా ఈ ఉపరితలముల మార్పుకోరే భావవిప్లవము పునాదిలో రావలసిన మార్పుకు సహాయకారిగా వుంటుంది. రాజ్యాంగయంత్రాన్ని, మతాన్ని పూర్తిగా వేరుచేయటం అంటే సెక్యులరిజాన్ని చిత్తశుద్ధితో అమలుచేయటం దానికొకమెట్టు.

# మైనారిటీ మతోన్మాద ప్రతినిధి

హిందూ ముస్లిం ఘర్షణలకు ప్రేరణనిచ్చే మరో మతశక్తి జమాతె-ఇస్లామి. ఇది అచ్చం ఆర్.ఎస్.ఎస్.కు ప్రతిరూపంలాంటిదే అని చెప్పవచ్చు. సంపూర్ణ హిందూక దేశం గురించి ఆర్.ఎస్.ఎస్. కలలుకన్నట్టే ఈ జమాతె-ఇస్లామి పూర్తి ఇస్లాం రాజ్యం గురించి కలలు కంటుంది.

జమాతె- ఇస్లామి రూపుదాల్చింది 1941లో. దాన్ని స్థాపించిన వారు మౌలానా మౌదూది. కాని 1947లో దేశ విభజన తరువాత మౌదూది పాకిస్తాన్‌కు వలసవెళ్ళిపోయాడు. దానివల్లనూ, మరియు విభజనవల్ల ఏర్పడిన గందరగోళ పరిస్థితివల్లనూ ఆ మతసంస్థ కొంతకాలం మూతబడిపోయినా మళ్ళీ 1948 ఏప్రిల్‌లో మౌలానా అబుల్ లెస్ ఇస్లాహి నేతృత్వంలో అది జమాతె-ఎ-హింద్ అన్న పేరుతో పునరుద్ధరించబడి ఆ తరువాత మెల్లమెల్లగా విస్తరించసాగింది. ఇప్పుడుఅది దేశమంతటా వ్యాపించింది. దాని శాఖలు దాదాపు అన్ని పట్టణాల్లోనూ ఉన్నాయి. ఉర్దూ కాక ఇంకా అనేక ప్రాంతీయభాషలలో అది ఎన్నో పత్రికలను వెలువరిస్తోంది. 'దీన్' అంటే ఇస్లాంమతపునరుద్దరణ పేరుతో అది భారతీయ ముస్లిం ప్రజలను 7వ శతాబ్దం నాటికి తిరోగమింప చేయడానికి కృషిచేస్తోంది.

ఆర్.ఎస్.ఎస్. లాగే జమాతెకూడా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడం లాంటి మంచిపని ఏదీ చేయలేదు. అసలు నిజమైన ముస్లింలకూ అలాంటి పోరాటాలకూ చాలా దూరం. వారికి దాంతో సంబంధం లేదు అని మౌదూది గట్టిగా నొక్కి చెప్పడు. 'రాజకీయ పోరాటం' అనే తన రచనలో ఆయన బ్రిటిష్‌వారి పరిపాలనను మతదృష్టితో సమర్థించాడు కూడాను.

"విదేశీయుల అధికారం నుండి విముక్తి పొందడమే నిజమైన స్వాతంత్ర్యం అని అర్థమా? మన సమాజానికిచెందిన, లేక మనదేశ ప్రజా బంధువుల ప్రభుత్వం ఏర్పడడం మన ఆదర్శాలకు అంత అవసరమా. అల్లాహ్ (దేవుడి) దృష్టిలో ఆ ఇలాహ్ (దేవుడు) తప్ప ఇతరులకు దాసులుగా ఉన్నామన్న మాట మేమెంతమాత్రం అంగీకరించం."

ఆహా ఏమి తర్కం ! దేవుడికి సేవలు చేయడం ఒక్కటే దాస్యం కిందకు వస్తే ఇక మిగిలినవన్నీ దాస్యాలు కావనేగా అర్థం? ఇక వాటి నుండి విముక్తి పొందాలన్న ఆరాటం దేనికి? పోరాటం దేనికి?

ఇదేవిధంగా జాతీయత, ప్రజాప్రభుత్వం, కులాతీత మతాతీత సమాజ కాంక్ష మరియు సోషలిజంలు కూడా ఇస్లాం మత తత్వాలకు విరుద్ధమైన సిద్ధాంతాలుగా పేర్కొని, వాటినికూడా నిషేధించాడు మౌదూది. 1947మే 10వ తేదీన పఠాన్ కోట్‌లో చేసిన ప్రసంగంలో ఆయన ఇలా ఉద్భోధించాడు.

" కులాతీత- మతాతీత, జాతీయ ప్రజాప్రభుత్వం ఏర్పడాలన్న కోరిక ఇస్లాం మతతత్వానికి పూర్తిగా విరుద్ధమైనది. దానిని కోరుకుంటే ఖురాన్‌ని అవమానించినట్టే లెక్క. అలాంటి కార్యక్రమాలలో పాల్గొనడం మన




రసూల్‌కు (మహమ్మద్ పైగంబర్) ద్రోహం చేసినట్టే ప్రజాప్రభుత్వ పతాకం ఎగురవేస్తే అల్లాహ్ (దేవుడి)కి విరుద్ధంగా ధ్వజమెత్తినట్టే. కనుక మీరు ఎక్కడున్నా సరే జాతీయ ప్రభుత్వ సిద్ధాంతాన్ని ఖండించాలి."

ఇప్పటికీ జమాతె- ఇస్లాం ధోరణులు ఇలాగే కొనసాగుతున్నాయి. అందువల్లనే పాకిస్తాన్‌లో జనరల్ జియా ఉల్ హక్ మిలిటరీ ప్రభుత్వానికి అక్కడి జమాతె పూర్తిమద్దతునిచ్చింది. మనదేశంలోని జమాతె కూడా జనరల్‌జియా ప్రజావిరుద్ధ చర్యలను ఏనాడూ ఖండించలేదు. ఇక ప్రజాప్రభుత్వం మాట ఎత్తితే- ఇక వేరే చెప్పక్కర్లేదు. జమాతె నుండి వెలువడే పత్రికలన్నీ ప్రజాప్రభుత్వం మరియు సోవియట్ యూనియన్‌లకు విరుద్ధంగా ఎప్పుడూదుష్ప్రచారం చేస్తూనే ఉండేవి.

ఈవిషయంలోమాత్రం ఆర్.ఎస్.ఎస్. మరియు జమాతె-ఇస్లామీల మధ్య ఏ విధమైన భిన్నాభిప్రాయాలు లేవు. కమ్యూనిజాన్ని ఈ రెండూ సమానంగా ద్వేషించడమే దీనికి నిదర్శనం. ఇవి పరస్పరం సాధిస్తున్న ద్వేషభావం కంటే ఈ ద్వేషం చాలా తీవ్రంగా ఉంది.

అలాగే హిందూ మరియు ముస్లింలు కలిసివున్న ఐక్యదేశం వద్దు అనడంలో కూడా ఈ రెండింటి మధ్య ఏమాత్రం అభిప్రాయ భేదం లేదు. హిందూ-ముస్లిం ఘర్షణల సమస్యా పరిష్కారానికి వీరిద్దరూ రెండు వేరు వేరు ప్రజా సముదాయాలన్న విషయాన్ని ముందుగా అంగీకరించాలని జమాతె అభిప్రాయం. ఈ సమస్య గురించి 1968జూన్ 25వ తేదీనాటి 'దావత్' పత్రిక ఏం రాసిందో చూడండి.

"హిందువులు, ముస్లిములు రెండు వేర్వేరు సామాజిక కట్టుబాట్లకు చెందినవారు. రెండు విభిన్న సంస్కృతుల ప్రతినిధులు. అలాంటప్పుడు ఈ రెండు భిన్న మతాలకు చెందిన హిందువులు,ముస్లింలు ఒకే ప్రజాసముదాయానికి చెందినవారని భారత ప్రభుత్వం భావించే వరకూ ఈ సమస్య పరిష్కారం కాదు.... హిందువులు, ముస్లింలు ఒకటి కాదనీ, వారు ఎన్నటికీ ఒకటి కాలేరని ఒప్పుకోవడానికి హిందువులు సిద్ధంగాఉన్నారా? అలా కానప్పుడు ఈ సమస్యను పరిష్కరించడానికి పూనుకోవడం శుద్ధ దండుగ."

ఇలాంటి ప్రచారాల ద్వారా ముస్లింలలో ఒక ప్రత్యేక మనోభావాన్ని కలగజేసి, హిందువుల పట్ల ద్వేషబీజాన్ని వారిలో నాటడానికి జమాతె-ఇస్లామి పాటుబడుతోంది. భారతీయ ముస్లింలలో 90 శాతం మంది మతాంతరం పొందిన హిందువుల వంశాలకు చెందినవారేనన్న సంగతిని వీరు దాచిపెట్టి, తాము అరబ్ లేక తుర్కిమూల సంతతికిచెందిన వారన్న భ్రమను వారిలో కలిగిస్తున్నారు. మతం మార్పిడితో పాటు మూల వంశాలుకూడా మారిపోయాయన్న ప్రమాదకర అభిప్రాయాన్ని కూడా వారిలో కలిగించే ప్రయత్నంలో ఉంది జమాతె-ఇస్లామి.

అందేవల్లనే ఆర్.ఎస్.ఎస్. లాగానే మత కలహాలను ఆది ప్రోత్సహిస్తూ వస్తున్నది. 1970లో జలగావ్, భివండిలో చెలరేగిన మతకలహాలకు ఆర్.ఎస్.ఎస్., జనసంఘ్ మరియు శివసేనలే ముఖ్యకారణాలైనా కూడా జమాతెకూడా అందులో ఒక ప్రముఖ పాత్ర వహించిందన్న సంగతిని ఆ ఘర్షణల మీద విచారణ జరిపిన మదన్ కమిటీ నిర్ణయానికి వచ్చింది. ఇటీవలి కాలంలో కేరళలో పుట్టుకొచ్చిన మరో ముస్లిం మతోన్మాద సంస్థ ఐ.ఎస్.ఎస్. దుశ్చర్యలను మనం గమనిస్తూనే వున్నాము.

మూలం : ఎస్.ఆర్. భట్

మొదట వాళ్ళు యూదుల కోసం వచ్చారు
యూదును కాదు గనుక నేను మాట్లాడలేదు
తర్వాత వాళ్ళు కమ్యూనిస్టుల కోసం వచ్చారు.
కమ్యూనిస్టును కాను గనుక నేను మాట్లాడలేదు.

తర్వాత వాళ్ళు క్యాథలిక్కుల కోసం వచ్చారు.
క్యాథలిక్కును కాదు గనుక నేను మాట్లాడలేదు.
తర్వాత వాళ్ళు నాకోసమే వచ్చారు.
నాకోసం మాట్లాడేందుకు అప్పటికెవరూ మిగల్లేదు.

# ఏది హైందవం?

ఈ దేశమంటేనే హిందూ మతమని, అందులోనూ తాము చెప్పిందే హైందవమని ఆర్.ఎస్.ఎస్. వారు చెబుతారు. కాని హిందూమతం నిజానికి అనేక పాయలు, ఉపనదులు కలిసిన సముద్రంలాంటిది. అందులో విగ్రహారాధకుల నుంచి నిరాకారో వాదుల వరకు రకారకాల వారున్నారు. ఈ దేశంలో బౌద్ధ, జైన సాంఖ్యాయనాది అనేక మతాలు, దేవుడినే నమ్మని చార్వాక సిద్ధాంతమూ కూడా వెలిశాయి. వాటినన్నిటిని నిరాకరించి అంతా హైందవమే అంటే సాగుతుందా? 'హిందూ' అన్న పదమే వేదాలలోగాని, భగవద్గీతలో కాని కనిపించదు కదా!

ఆదిశంకరుడిని హిందువులు అమిత భక్తి ప్రపత్తులతో వేరువేరుగా ఆరాధిస్తారు. నదులు అనేక మార్గాలలో సముద్రాన్ని చేరినట్లు విభిన్న వ్యక్తులు విభిన్న మార్గాలలో పరమాత్ముడిని చేరుకుంటారని ఆయన అన్నారు. "మరి మేము చెప్పేదే శాసనం" అనే ఈ మతోన్మాదులు దానికి అంగీకరిస్తారా?

"తన స్వంత మతం ఒక్కటే నిలవాలని, యితరమైనవి నాశనం కావాలని కలలు కనేవారెవరైనా వుంటే వారిని చూసి జాలిపడతాను ప్రతిమతం పతాకం మీద "పోరాటం" అనిగాక "సహాయపడు" అని రాయాలి. ఘర్షణనుగాక, సామరస్యం, శాంతి లిఖించాలి అన్నారు. వివేకానందుడు.

కోరి కయ్యానికి కాలు దువ్వుతున్న హిందూ మతోన్మాద గణం వివేకానందుడిని కూడా మ్లేచ్ఛుడనే అంటారా?

"శాఖాభిమానము, స్వమత దురభిమానము తత్ఫలితమైన మూర్ఖాభి నివేశమును సుందరమైన యీ వసుంధరను చిరకాలము నుండియు నాక్రమించియున్నవి. భూమిని అని దౌర్జన్యమయ మొనర్చి, యనేక పర్యాయములు మానవ రక్తసిక్తము గావించినవి నాగరికతను నాశనమొనర్చి, సంఘములను నిరాశపాలు చేసినవి. ఈ ఘోరరాక్షసులు చెలరేగియుండనిచో మానవ సమాజము నేటికంటె విశేషాభివృద్ధి నందియుండెడిది కాని వాని యవసాన సమయ మాసన్నమైనది."

"అన్నమో రామచంద్రా!" యని భారత దీన జనకోటి విలపించుచున్నది. అన్నము కోసము వారు విలపించుచుండ మనము వారి కిచ్చుచున్న వేమి?–తాళ్ళు; పిడికెడన్నము లేక వారు వస్తు పడియుండ మనము వారికి చేయుచున్న వేమి?–ధర్మబోధలు. ఇది మహాపరాధము కాదా? హిందూదేశములో ధనమును గోరి మతబోధ చేయువాడు జాతి భ్రష్టుడై, జనులచే నుమ్మి వేయబడును."

–వివేకానందుడు

# అయోధ్య అఘాయిత్యం అనంతరం

• • • • • • • • • • • • • • •


కరసేవకుల విధ్వంస కాండ

అతిరథ మహారథులు, కురుపితామహులు చూస్తుండగానే మహాభారతంలో ద్రౌపదీ వస్త్రాపహరణం జరిగింది. ఈనాడు కూడా అతి బలీయమైన భారత ప్రభుత్వమూ, సర్వశక్తివంతమైన రాజ్యాంగ యంత్రమూ చూస్తుండగానే అయోధ్యలో బాబరీ మసీదును కూల్చడం ద్వారా దానితో పాటు లౌకిక వ్యవస్థను పునాదులంటా పెకిలించే అతి దుర్మార్గమైన ప్రయత్నం జరిగింది. ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు ధృతరాష్ట్రుడిలా ఏమీ చూడనట్లే వుండిపోయారు. రాముడి పేరు జపిస్తున్న బి.జె.పి. నేతలు నిజానికి శకుని వ్యూహాన్ని అనుసరించి అన్నదమ్ముల వంటి హిందూ-ముస్లింల మధ్య మరో కురుక్షేత్రం రగిలించి రామాయణంలో భారతాన్ని ప్రవేశపెట్టారు.

పరమ భాగవతోత్తముడుగా, రామ భక్తుడుగా పేరెన్నికగన్న పోతనామాత్యుడు "ఇందుగలడందులేడను సందేహము వలదు" అని తన ఆరాధ్య దైవాన్ని గురించి చెప్పారు. "కలడు కలండనెడువాడు కలడో లేడో" అని అంతటి భక్తుడూ ఒక పద్యంలో అనుమానం వెలిబుచ్చారు. కాని బిజెపి-విహెచ్‌పి-ఆర్‌ఎస్‌ఎస్ కూటమి మాత్రం బాబరీ మసీదు వున్న చోటే రాముడు పుట్టాడని కళ్ళారా చూసినట్లే వాదించింది. భక్తులు ఆదిమధ్యాంత రహితుడని చెప్పే భగవంతుడు సరిగ్గా ఫలానా చోట పుట్టాడని ఏ పురాణం చెప్పిందో వారికే తెలియాలి. చరిత్ర ప్రకారం అక్కడ గుడిలేదు. ఆధారాలు అడిగితే అది మా విశ్వాసం అన్నారు. ఎవరైనా ఎలాటి మత విశ్వాసాలైనా కలిగి వుండటానికి మన రాజ్యాంగం అవకాశమిచ్చిన మాట నిజం. కాని అవి ఇతరుల విశ్వాసాలను దెబ్బతీసే విధ్వంసక రూపం తీసుకోకూడదు. ఎంతటి విశ్వాసమైనా రాజ్యాంగ చట్టం పరిధిలోనే వుండాలి. ఆ రాజ్యాంగం ప్రకారం వివాదాలు పరిష్కరించడానికి న్యాయస్థానాలున్నాయి. కాని హిందూ మతోన్మాద కూటమి తమ విశ్వాసం చట్టానికి, కోర్టులకు "అతీతం" అన్నారు! మసీదు వున్న చోటే గుడికట్టి తీరతామని సవాళ్ళు విసిరారు. శిలాన్యాస్‌లు రథయాత్రలు, కరసేవలు అంటూ దాదాపు మూడేళ్ళపాటు రకరకాల కుయుక్తులు, కుత్సితాలు, మారణహోమాలు సాగించి చివరగా నాగరిక, ప్రజాస్వామ్య ప్రపంచాన్ని నివ్వెరపరిచేలా దాన్ని కూలగొట్టారు. మధ్యయుగాల నాటి బర్బరత్వాన్ని పునరుద్ధరించారు. దీన్ని ఖండించడానికి మాటలు, భాష చాలవు. బిజెపి-విహెచ్‌పి-ఆర్‌ఎస్‌ఎస్ దుష్టత్రయం రాక్షస రాజనీతిని ఎంత తీవ్రంగా నిరసించినా అది తక్కువే అవుతుంది. జరిగిన దానిపై నేటికి సూటిగా క్షమాపణలు చెప్పకుండా, తప్పు ఒప్పుకోకుండా వారు అసహ్యకరంగా మాట్లాడుతున్న తీరు చూస్తే ఆగ్రహం పెల్లుబుకుతుంది. (బాక్స్ చూడండి)

దేశమంతటా రగిలిన అగ్నికీలల్లో అమాయక ప్రజానీకం వందల సంఖ్యలో మరణిస్తున్నా కించిత్తు పశ్చాత్తాపం లేకపోగా ఇంత దురభిమాన, దురహంకార పూరిత భాషలో మాట్లాడే వారిలో మానవత్వం ఇంకా ఏకోశానయినా మిగిలివుందా అనేది ప్రశ్న. ఆ శక్తుల్ని సృష్టించిన అనర్థదాయకమైన ఈ 'అయోధ్యకాండ' పర్యావసానాలు ఎలా వుంటాయి అనేదే ఆలోచించాల్సిన విషయం.

## ముద్దాయిలకు శిక్ష అనివార్యం

ఆదివారం మసీదు విధ్వంసం అనుకోని హఠాత్ సంఘటన అని చిత్రించడం పచ్చి అబద్ధం. అద్వానీలు, జోషిలు, అశోక్ సింఘాల్‌లు ఆరోజు ప్రత్యక్షంగా రంగంలో వుండి కరసేవకులను

(తరువాయి 6వ పేజీలో)

# బి.జె.పి. దుష్టకూటమిని సమైక్యంగా

## త్రిప్పికొట్టి శాంతిని సంరక్షిద్దాం

ఈ నెల ఆరవతేదీన దిగ్భ్రాంతి కలిగించే రీతిలో అయోధ్యలోని బాబ్రీ మసీదును కూలగొట్టటంతో బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి.ల వినాశకర పథకం యావద్భారతానికి అవగతమైంది. 1989లో ప్రారంభమైన సంఘపరివార్ 'కరసేవ' భారతదేశం యొక్క సమైక్యతపైనా, రాజ్యాంగంపైనా, లౌకికతత్వంపైనా దుర్మార్గపు దాడి జరపడంతో పరాకాష్ఠకు చేరుకున్నది. స్వాతంత్ర్యానంతరం భారతదేశపు లౌకిక రాజ్యానికి యింతటి దారుణమైన సవాలు ఏనాడూ ఎదురుకాలేదు. మసీదుపై జరిగిన దుర్మార్గపు దాడి భారతదేశానికిగల అంతర్జాతీయ ప్రతిష్ఠను దిగజార్చటమేకాక ముస్లిం ప్రజలున్న దేశాలలో తీవ్రమైన ఆగ్రహావేశాలకు కారణమైంది.

1989 నవంబర్ అయోధ్యలోని వివాదాస్పద స్థలంలో శిలాన్యాస్ జరపటానికి రాజీవ్ ప్రభుత్వం అనుమతించినప్పటి నుండి గతమూడేళ్ళుగా ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి., బి.జె.పి.ల కూటమి యొక్క దుర్మార్గపు దాడులను, మందిరం-మసీదు వివాదాన్ని ఆసరా చేసుకొని మతభావాలను రెచ్చగొట్టడం ద్వారా హిందుత్వభావాన్ని రుద్దాలన్న వారి ప్రయత్నాన్ని దేశం చవిచూసింది. 1990 సెప్టెంబర్, అక్టోబర్‌లో అద్వానీ జరిపిన అతిహేయమైన రథయాత్ర మతశక్తుల కుతంత్రంలో ప్రధానమైన అంశమని చెప్పవచ్చు. అక్టోబర్ 30 నాటి కరసేవ, తరువాత నికృష్టమైన మతకలహాలకు దారితీసింది.

మళ్ళీ యిప్పుడు యిదే పునరావృతమైంది. అయితే మరింత ప్రమాదకరమూ, మరింత వినాశకరమూ అయిన ఫలితాలను తెచ్చిపెట్టింది. 1990 నాటి 'కరసేవ'కూ, డిసెంబర్ 6న పునరావృతమైన దానికీమధ్య మున్న ముఖ్యమైన విభేదం ఉత్తరప్రదేశ్‌లో బిజెపి రాష్ట్ర ప్రభుత్వం వుండటమే. కల్యాణ్‌సింగ్ మంత్రివర్గాన్ని వినియోగించుకొని డిసెంబర్ 6న సంఘ పరివార్ ఆలయ నిర్మాణానికి పూనుకున్నది. 1991 నవంబర్‌లోనే అయోధ్యలో పునాదులత్రవ్వకానికి ఒక ప్రయత్నం జరిగింది. ఆ తరువాత 1992 జూలైలో వివాదాస్పద స్థలంలో నిర్మాణపు పని ప్రారంభమైంది. ఈ రెచ్చగొట్టే చర్యలు మొత్తం కోర్టు ఉత్తర్వులను వుల్లంఘించి, బి.జె.పి. రాష్ట్ర ప్రభుత్వం సంపూర్ణ సహాయంతో చేపట్టబడ్డాయి. అంతిమంగా డిసెంబర్ 6న తుది ఘర్షణకు పథకం సిద్ధం




చేయటం జరిగింది.

డిసెంబర్ 6న బాబరీ మసీదును కూలగొట్టే కార్యక్రమాన్ని, ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి., బి.జె.పి. మద్దతుదారులను అయోధ్యకు చేరవేసే బాధ్యతను ఆర్.ఎస్.ఎస్. స్వయంగా చేపట్టింది. అంతిమ ఘర్షణకు రంగం సిద్ధమైందని నిర్ణయించింది. ఆర్.ఎస్.ఎస్. అక్టోబర్ 30-31న న్యూఢిల్లీలో జరిగిన బూటకపు ధర్మసన్సద్‌లో డిసెంబర్ 6న కరసేవ జరుగుతుందని ప్రకటించవలసిందిగా విశ్వహిందూ పరిషత్‌ను అది ఆదేశించింది. అయోధ్యలో ప్రజాసమీకరణను అదే విధంగా బిజెపికి చెందిన మొత్తం నాయకత్వాన్ని కలుపుకొచ్చేందుకు సంఘపరివార్‌కు ఆర్.ఎస్.ఎస్. ఆదేశాలిచ్చింది. బాబరీ మసీదు కట్టడాన్ని తాకబోమని, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్న 2.77 ఎకరాల భూమిలోనే నిర్మాణం జరుగుతుందని చెప్పటం కేవలం మోసపూరిత మైనది తప్ప మరేమీకాదు. అంతేకాక ఎలాంటి నిర్మాణాన్ని అనుమతించబోనని రాష్ట్ర ప్రభుత్వం సుప్రీంకోర్టుకు బహిరంగంగా యిచ్చిన హామీని కూడా ఉల్లంఘించడం జరిగింది.

### ఫాసిస్టు పోకడలు

అయోధ్యలో యిటీవల జరిగిన ఘటనలు ప్రతి ఒక్కరినీ, ప్రత్యేకించి 'బాధ్యతాయుతమైన జాతీయ పార్టీ'గా బి.జె.పి. రూపొందగలదన్న భ్రమలున్న వారికి కనువిప్పు కలిగిస్తాయి. డిసెంబర్ మొదటి తేదీ నుంచే అయోధ్యకు చేరుకొన్న యీ కూటమికి చెందిన వారు అయోధ్యలో నివసిస్తున్న మైనారిటీ ప్రజలపై ఆటవిక దాడులు సాగించారు. దానితో అనేకులు పరారయ్యారు. ముస్లింల సమాధులు పగులగొట్టి నేలను చదును చేశారు. మైనారిటీ మతానికి చెందిన ప్రముఖుల ఇళ్ళపై దాడులు జరిగాయి. కల్యాణ్ సింగ్ ప్రభుత్వం అయోధ్యను కరసేవకులకు అప్పచెప్పటంతో అక్కడ హిందూ ఫాసిస్టు పోకడలు స్పష్టంగా కనిపించాయి. ఇదే సమయంలో అద్వానీ, జోషిలు రాష్ట్ర ప్రజలను రెచ్చగొట్టేందుకై 'రథయాత్ర'లు ప్రారంభించారు. తొలుత వి.హెచ్.పి. చేపట్టిన 'పాదుకాపూజ' కార్యక్రమం విఫలం కావటంతో వారు యీ కార్యక్రమాన్ని చేపట్టారు. డిసెంబర్ 6న ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి., బి.జె.పి.ల కూటమికి చెందిన అగ్రనాయకులు చూస్తుండగా దాదాపు అయిదు గంటలపాటు బాబరీ మసీదును కూలగొట్టే కార్యక్రమం నిర్విఘ్నంగా సాగింది. అక్కడ హాజరైన పాత్రికేయులపై ఆటవిక దాడి జరిగింది. సాధారణ ప్రజానీకంలో బీభత్సం చెలరేగగా హిందూ మత కూటమికి చెందిన వారిలో పట్టరాని వుత్సాహం పొంగిపొర్లింది.

ఈ మతోన్మాదం వల్ల కలిగే ఫలితాలను దేశమంతటా గుర్తించటం జరిగింది. ఈ నేరపూరితచర్య పట్ల విస్తృతంగా ఖండనలు

వెలువడటంతోపాటు ఆగ్రహావేశులైన ముస్లింలు కూడా తమ నిరసనను తెలియజేశారు. అనేక నగరాలలోనూ, పట్టణాలలోనూ ఉద్రిక్తతలు నెలకొని హింసాకాండకు దారితీయటంతో వందలాది మంది ప్రాణాలు కోల్పోయారు. విషాదకరమైన విషయమేమిటంటే డిసెంబర్ 7న జరిగిన ఘటనలలో చనిపోయిన వారిలో ఎక్కువ మంది ముస్లింలే. నిరసన తెలియచేసేందుకై బయటకు వచ్చిన వీరు పోలీసు తూటాలకు బలయ్యారు. మతోన్మాదులు హింసాకాండకు పుసికొల్పడంతో కాన్పూర్, అహ్మదాబాద్, జయపూర్ వంటి చోట్ల దారుణమైన హింసాకాండ తలెత్తింది. హింసాకాండ తల ఎత్తని ప్రాంతం దేశంలో ఎక్కడా లేకుండా పోయింది.

## ప్రధాని బాధ్యత

అయోధ్యలోని బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి. మసీదు కూలగొట్టటానికి, దేశంలోని శాంతియుత వాతావరణాన్ని భగ్నం చేయటానికి కారణమైనప్పటికీ యీ దుశ్చర్యలను అనుమతించటంతోపాటు, వీటిని నివారించటానికి సకాలంలో జోక్యం చేసుకొనేందుకు తిరస్కరించిన కేంద్ర ప్రభుత్వం ఇందుకు ప్రధానమైన బాధ్యతను వహించవలసివుంది. 'కరసేవ'కు సంబంధించిన ప్రకటన అక్టోబరు 30న వెలువడటంతో చర్చలు విఫలమయినట్లు సుస్పష్టమైంది. ఆర్.ఎస్.ఎస్., బి.జె.పి.ల రాజకీయాల గురించి తెలిసిన వారికి ఘర్షణ జరగనున్నదని అర్థమైంది. ప్రధాన మంత్రి తక్షణ చర్యలను చేపట్టి మొత్తం వివాదాస్పద భూమిని స్వాధీనం చేసుకొని కోర్టు ఉత్తర్వుల మేరకు రక్షణ కల్పించాలని వామపక్ష పార్టీలు, యితర లౌకిక పార్టీలు డిమాండ్ చేశాయి. జూలైలో నిర్మాణపు పనికి అనుమతి యిచ్చినపుడు యిది జరగలేదు. కనీసం చివరి నిముషంలోనైనా రానున్న ప్రమాదాన్ని గుర్తించి వివాదాస్పద భూమిని ప్రధాని నరసింహారావు స్వాధీనం చేసుకోగలరని భావించబడింది. నవంబర్ 23న జాతీయ సమగ్రతా మండలి సమావేశాన్ని నిర్వహించే వరకు అంటే మూడు వారాలపాటు ప్రధానిగానీ, కాంగ్రెస్(ఐ) ప్రభుత్వంగానీ ఎలాంటి చర్యలూ తీసుకోలేదు. ఈ సమావేశం సైతం వామపక్షాలు యితర లౌకిక పార్టీలు ఒత్తిడి తెచ్చిన మీదటనే జరిగింది.

ఈ సమావేశాన్ని బి.జె.పి., దాని ముఖ్యమంత్రులు బహిష్కరించారు. కాగా రాజ్యాంగాన్ని, కోర్టు ఉత్తర్వులను పరిరక్షించేందుకు తగిన చర్యలను తీసుకొనే అధికారాన్ని ప్రధానికి యిస్తూ మార్క్సిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి హరికిషన్ సింగ్‌సూర్జిత్ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని మొత్తం మండలి ఏకగ్రీవంగా ఆమోదించడం జరిగింది. మున్నెన్నడూలేని విధంగా దేశంలోని లౌకిక ప్రతినిధులందరూ యీ అధికారాన్ని యివ్వటం జరిగింది. అయినప్పటికీ ప్రధాన మంత్రి ఎలాంటి చర్యలూ తీసుకోలేదు. బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్. నాయకులతో వ్యక్తిగతంగా జరిపిన చర్చలపై ఆయన ఎక్కువగా ఆధారపడ్డారు. వారితో ఒక అవగాహనకు రావచ్చునని, 'లాంఛనప్రాయమైన కరసేవ'కు అనుమతించవచ్చునని, రాష్ట్ర ప్రభుత్వంతో ఘర్షణ తప్పించవచ్చునని భావించారు. ఇదంతా అధికారం కోసమూ, మతశక్తుల సవాలును తప్పించుకోవటం కోసమే జరిగింది. ఈ కారణం చేతనే ఆయన ఎలాంటి చర్యలకూ పూనుకోలేదు.

## లజ్జాకరమైన ఉదాసీనత

కరసేవకుల సమీకరణ జరగకముందే వివాదాస్పద స్థలాన్ని స్వాధీనం చేసుకోవటం, లేదా కోర్టు ఉత్తర్వులను ఉల్లంఘించిన కల్యాణ్‌సింగ్ ప్రభుత్వాన్ని రద్దు చేయటంకాక అయోధ్యలో కరసేవకులు వేలాదిగా ప్రవేశించటానికి అనుమతించారు. దీనిని బట్టే కేంద్రం యొక్క ఉదాసీన వైఖరి స్పష్టమవుతున్నది. అయోధ్యలో తలెత్తిన ఉన్మాదంకానీ, మైనారిటీ ప్రజలకు వ్యతిరేకంగా పెల్లుబికిన ఆగ్రహంగానీ ప్రధాని జడత్వాన్ని వదిలించలేకపోయాయి. చివరి ప్రయత్నంగా డిసెంబర్ 3వ తేదీన వామపక్షాలు, నేషనల్ ఫ్రంట్ నాయకులు ప్రధానిని కలుసుకొని అయోధ్యలో తల ఎత్తుతున్న ప్రమాదకర పరిస్థితిని గురించి తమ అభిప్రాయాన్ని తెలియజేశారు. డిసెంబర్ 6 నాటి పరిస్థితిని బి.జె.పి., వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్.లు అదుపుచేయగలవని, కేవలం లాంఛన ప్రాయమైన కరసేవ మాత్రమే జరగగలదన్న విశ్వాసమే ఆయన ముందుంచిన ప్రశ్నాలకు సమాధానమైంది. కల్యాణ్‌సింగ్ మంత్రివర్గాన్ని కాపాడుకోవటానికై వారు యీపని చేస్తారని ఆయన నమ్మారు. పార్లమెంటులో చర్చసందర్భంగా మూర్ఖపు ఉదాసీనతను ప్రదర్శించిన విశ్వాసంగానీ, హోంమంత్రి ప్రకటనలుగానీ ఎక్కడున్నాయి? డిసెంబర్ 1,2 తేదీలలో శేషాద్రి, రాజేంద్రసింగ్ వంటి ఆర్.ఎస్.ఎస్. నాయకులు వాజ్‌పేయి ప్రధానితో చర్చలు జరిపారు. ఈ చర్చలు పరస్పర అవగాహనకు దారితీశాయి. మతశక్తుల సమస్యలపట్ల ఉదాసీనంగా వ్యవహరించటం ద్వారా కాంగ్రెస్(ఐ) ప్రభుత్వం ప్రత్యేకించి ప్రధానమంత్రి యీ మారణహోమానికి బాధ్యత వహించవలసి వుంది.

దేశ ప్రధాన అధినేత విధి నిర్వహణకు సంబంధించిన రాజకీయ బాధ్యతా రాహిత్యాన్ని దేశం ఏనాటికీ క్షమించదు. నవంబర్ 28న సుప్రీంకోర్టు యిచ్చిన స్పష్టమైన ఉత్తర్వుల నేపథ్యంలో, చట్టాన్ని ఉల్లంఘించాలని దృఢంగా నిర్ణయించుకొన్న వేలాది మందిని ఒకచోట గుమిగూడకుండా నిరోధించవలసిన బాధ్యత కేంద్ర ప్రభుత్వానికి వున్నది. దేశవ్యాప్తంగా అవధులు లేని హింసాకాండకు దారితీసిన పరిస్థితులకు ప్రధానమంత్రి బాధ్యత వహించవలసి వుంది. లౌకిక విలువలకు నీళ్ళొదిలిన తరువాత ప్రధాని పదవిలో వుండే అర్హతలను నరసింహారావు కోల్పోయాడు. కనుక ప్రధాని పదవి నుండి ఆయన రాజీనామా చేయాలి.

డిసెంబర్ 6వ తేదీసాయంత్రం భారత రాష్ట్రపతి తీసుకున్న అసాధారణమైన చర్యలు అయోధ్య ఘటనలపట్ల ఆందోళనను వ్యక్తం చేస్తున్నాయి. హిందూత్వ శక్తుల బండారాన్ని బట్టబయలు చేస్తూ రాజ్యాంగాన్ని, దేశ సమగ్రత, సమైక్యతలను కాపాడటానికి త్వరితగతిని చర్యలు తీసుకోవలసిందిగా ప్రధానిని కోరటం, రావు ప్రభుత్వం అచేతనంగా వుండిపోయిన సమయంలో చెప్పుకోదగిన అంశం.

ప్రధాన మంత్రి రాజకీయ భవిష్యత్తు ఎలా వున్నప్పటికీ రాజ్యాంగం ప్రకారం కేంద్ర ప్రభుత్వం కొనసాగుతుంది. మత కలహాలను నివారించటం, మైనారిటీల ప్రాణాలనూ, ఆస్తులనూ సంరక్షించడం, శాంతినీ సాధారణ పరిస్థితినీ పునరుద్ధరించడం నేటి తక్షణ కర్తవ్యం. అవసరమైన చోట్ల మతకలహాలను అణచివేయడానికి సైనికులను రంగంలోకి దించాలి.

భారత రిపబ్లిక్‌కూ, ప్రజలకూ వ్యతిరేకంగా నేరానికి పాల్పడిన వారిని నిర్బంధంలోకి తీసుకోవాలి. అయోధ్యలో

జరిగిన లజ్జాకరమైన ఘటనలకు బాధ్యులైన వారందరినీ అరెస్టు చేసి విచారణ జరపాలని మార్క్సిస్టుపార్టీ డిమాండ్ చేస్తున్నది. ఏ ఒక్కరినీ విడిచి పెట్టరాదు. ఎవరూ చట్టానికి అతీతులు కారు. ఈ విషయంలో సుప్రీంకోర్టు సాహసోపేతమైన చొరవ చూపింది. మొత్తం వివాదాస్పద స్థలాన్ని కేంద్రం స్వాధీనం చేసుకోవాలి. లౌకిక భారత విశ్వాసాన్ని పునరుద్ధరించాలంటే అయోధ్యలోని అదేచోట మసీదును పునర్నిర్మించాలి. మతశక్తులు విసురుతున్న రాజకీయ సవాలును ఎదుర్కోవాలంటే మసీదు నిర్మాణమూ, మసీదుకు హానికలగకుండా మందిర నిర్మాణముకు సంబంధించి దృఢమైన నిర్ణయం అవసరం.

జాప్యం జరిగినప్పటికీ లౌకిక వ్యవస్థను, రాజ్యాంగాన్ని కాపాడటం కోసం వినాశనం జరిగిన తరువాత కల్యాణ్‌సింగ్ మంత్రివర్గాన్ని రద్దు చేయటం, మసీదు పునర్నిర్మాణం గురించి ప్రకటించడం, బి.జె.పి., వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్. కూటమి నాయకులను అరెస్టు చేయడం అవసరమైన చర్యలే.

## మతవాదుల బెదిరింపులను ఐక్యంగా ఎదుర్కోవాలి

బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి. కూటమికి వ్యతిరేకంగా పోరాడాలన్నా, ఈ ప్రమాదకర శక్తులను ఏకాకులను చేయాలన్నా ప్రజలలో దేశభక్తియుత, లౌకిక భావాలను పెంచేందుకు లౌకిక, ప్రజాతంత్ర శక్తులు ఐక్యంగా ప్రయత్నాలు చేయవలసి వుంది. మసీదును కూలదోయటానికి నిరసనగా డిసెంబర్ 7న పశ్చిమ బెంగాల్‌లోనూ, 8న దేశవ్యాప్తంగానూ జరిగిన బంద్‌ను దేశసమైక్యతా, లౌకిక భావనల పరిరక్షణకు సంబంధించి ప్రజల మనోభావాలను తెలియచేసే తొలి చర్యగా భావించాలి. అద్వానీ, జోషీ,సింఘాల్, థాల్మియా వంటి బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి.లకు చెందిన నాయకులను అరెస్టు చేయటం సరియైన చర్య. వీరిపై క్రిమినల్ విచారణ జరగవలసివుంది. 'రామజన్మభూమి మందిరానికి సంబంధించి ప్రజలలో వున్న ప్రగాఢ భావనకు, యిది సూచన' అంటూ అయోధ్యలో తల ఎత్తిన ఉన్మాదాన్ని సమర్థించే విధంగా బి.జె.పి.కి చెందిన అద్వానీ, జోషీ, ఆర్.ఎస్.ఎస్.కు చెందిన హెచ్.వి. శేషాద్రి, పరిషత్‌కు చెందిన సింఘాల్‌ల సంయుక్త ప్రకటన తెలుపుతున్నది. ఆందోళనను లేవదీయటాన్ని తమ నాయకుల అరెస్టును, మత సంస్థల నిషేధాన్ని వుపయోగించుకోవాలని మతశక్తులు ప్రయత్నిస్తున్నాయి. కనుక యీ రాజకీయ సవాల్‌ను ఎదుర్కొనటమూ, ప్రజలను మతప్రాతిపదికపై విభజించేందుకు సాగుతున్న కుట్రలను బహిర్గతం చేయటానికీ వామపక్ష శక్తులు, లౌకిక శక్తులు ప్రజలలోకివెళ్ళాలి.



అయోధ్య : అనంతర మతకల్లోలంలో ఆవులను కోల్పోయి విలపిస్తున్న బాలలు

లౌకిక శక్తులన్నిటికి అయోధ్య సంఘటనలు గుణపాఠాలు నేర్పుతున్నాయి. బి.జె.పి.యేతర లౌకిక పార్టీలు పరస్పరం నిందలకు, విభజనలకు, సంకుచిత వ్యక్తిగత ప్రయోజనాలకు పాల్పడటంతో ప్రత్యేకించి ఉత్తరప్రదేశ్‌లో బి.జె.పి. రాష్ట్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి, వాతావరణాన్ని విషపూరితం చేయడానికి దారి తీసింది. కాంగ్రెస్(ఐ)కి సంబంధించినంతవరకు 1986లో తాళాలు తీసి 1989లో శిలాన్యాస్‌కు అనుమతి యిచ్చిన రాజీవ్ ప్రభుత్వ హయాంలో ప్రారంభమైన రాజీధోరణి, సూత్రరహితమైన ఉదాసీనత నరసింహారావు వరకూ కొనసాగటంతో డిసెంబర్ 6న వినాశనానికి దారితీసింది. ప్రస్తుత సంక్షోభాన్ని అధిగమించాలంటే దృఢవైరస్పరం నిందలకు, విభజనలకు, సంకుచిత వ్యక్తిగత ప్రయోజనాలకు పాల్పడటంతో ప్రత్యేకించి ఉత్తరప్రదేశ్‌లో బి.జె.పి. రాష్ట్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి, వాతావరణాన్ని విషపూరితం చేయడానికి దారి తీసింది. కాంగ్రెస్(ఐ)కి సంబంధించినంత వరకు 1986లో తాళాలు తీసి 1989లో శిలాన్యాస్‌కు అనుమతి యిచ్చిన రాజీవ్ ప్రభుత్వ హయాంలో ప్రారంభమైన రాజీధోరణి, సూత్రరహితమైన ఉదాసీనత నరసింహారావు వరకూ కొనసాగటంతో డిసెంబర్6న వినాశనానికి దారితీసింది. ప్రస్తుత సంక్షోభాన్ని అధిగమించాలంటే దృఢవైరస్పరం నిందలకు, విభజనలకు, సంకుచిత వ్యక్తిగత ప్రయోజనాలకు పాల్పడటంతో ప్రత్యేకించి ఉత్తరప్రదేశ్‌లో బి.జె.పి. రాష్ట్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి, వాతావరణాన్ని విషపూరితం చేయడానికి దారి తీసింది. కాంగ్రెస్(ఐ)కి సంబంధించినంతవరకు 1986లో తాళు అణిచివేసి, మతసామరస్య పరిరక్షణకై ప్రజలను సంఘటిత పరచడం ప్రస్తుత తక్షణ కర్తవ్యం. బి.జె.పి., వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్.ల ప్రతిఘటనను వామపక్ష, లౌకిక శక్తులు ఐక్యంగా ఎదిరించవలసి వుంది. దేశంలో ఒక నూతన పరిస్థితి తల ఎత్తింది. మెజారిటీ మతతత్వానికి వ్యతిరేకంగా సుదీర్ఘమైన పోరాటం సాగవలసి వుంది. దేశసమైక్యత, లౌకికతత్వం పరిరక్షణ కోసమూ, మతశక్తులతో పోరాడేందుకూ యితర వామపక్ష, లౌకిక శక్తులకు మార్క్సిస్టుపార్టీ పూర్తిగా సహకరిస్తుంది లౌకిక శక్తులన్నీ దీనినే ప్రధాన కర్తవ్యంగా భావించి యీ సమయంలో ముమ్మందుకు రావలసి వుంది.

(2వ పేజీ తరువాయి)

రెచ్చగొట్టారని, రాష్ట్ర ప్రభుత్వ పగ్గాలు చేతుల్లో వున్న కల్యాణ్‌సింగ్ కపట నాటకం నడిపించారని వాస్తవాలు స్పష్టంగా చెబుతున్నాయి. (చూడండి డిసెంబర్ 10 'ప్రజాశక్తి') ప్రముఖ పత్రికలు రాశాయి. జరిగిన దానిలో తప్పులేదనుకుంటే అందుకు తమదే బాధ్యత అని అంగీకరించాలి. తప్పు అనుకుంటే ఒప్పుకుని, రాజకీయాల నుంచి తప్పుకోవాలి. అంతేగాని ఇంత అనర్థం తర్వాత కూడా "అతి తెలివి" చూపించడం పరమతుచ్ఛమైన పని. మసీదు పడగొట్టిన చోట హడావుడిగా గుడిపేర ఏదో కట్టి, దానికోసం ప్రాణాలర్పిస్తామని ఇప్పుడంటున్నారు. ఉద్రిక్తతలను పెంచేందుకై బిజెపి వారు మైనారిటీలపై దాడులు రెచ్చగొడుతున్నారు. మైనారిటీలలో గల కొన్ని అవాంఛనీయ శక్తులు కూడా కలహాలు పెంచుతున్నారు. బిజెపి పాలించే మధ్యప్రదేశ్, రాజస్థాన్, హిమాచల్‌ప్రదేశ్ రాష్ట్రాలలో మతకలహాల ప్రజ్వలన తీవ్రంగా వుండటం యాదృచ్ఛికం కాదు. ఏ రాజకీయ విధానాల ప్రకారమైతే బాబరీ మసీదును కూలద్రోశారో దానికే కట్టుబడి వుండే ఆ రాష్ట్ర ప్రభుత్వాలు అధికారంలో కొనసాగే అర్హత కోల్పోయాయి. అవి మతకలహాలను పెంచడమే తప్ప, అదుపుచేసే ప్రసక్తి కూడా వుండదు.

అద్వానీ, జోషి, అశోక్‌సింఘాల్ వి.హెచ్. దాల్మియా, సాధ్వి రీతాంబరి, ఉమాభారతి వంటి వారు ఇప్పటికే అరెస్టు చేయబడ్డారు. మత సామరస్యానికి భంగం కలిగించేలా ప్రవర్తించి ఘర్షణలను రెచ్చగొట్టినందుకు వారిపై ఫైజాబాద్ జిల్లా కోర్టులో ఎఫ్.ఐ.ఆర్. దాఖలైంది. రాజ్యాంగం ప్రకారం ఏ మతానికి చెందిన ప్రార్థనాస్థలంపైనైనా దాడి చేయడం, అపవిత్రపరచడం పెద్ద నేరాలు. కాగా అయిదువందల ఏళ్ళ చారిత్రక మసీదుపై (అక్కడ ప్రార్థనలు జరుగుతున్నాయా లేదా అనేది అప్రస్తుతం. ఎన్ని దేవాలయాలు గబ్బిలాల నిలయాలుగా లేవు? వాటిని తొలగిస్తే వి.హెచ్.పి. కూటమి ఒప్పుకుంటుందా?) దాడి చేసి నేరుగా కూలగొట్టిన వారికి ఎంత శిక్ష విధించితే సరిపోతుంది? ఇంత అఘాయిత్యాన్ని అనర్థాన్ని ముందుగా ఆపలేకపోయినా, అందుకు కారకులైన అపరాధులను ఏ శిక్షా లేకుండా వదిలేస్తే ప్రభుత్వ ఉనికికి అర్థమేముంది? రేపు ఇదే శక్తులు లేదా మరో రకమైన మతోన్మాదులు ఇలాటి తప్పుడు పనులు మరిన్ని చేయకుండా ఆపగలుగుతామా? అందువల్ల "అయోధ్యకాండ"కు కారకులైన వారందరికీ చట్ట ప్రకారం శిక్ష పడాల్సిందే.

## నిషేధం ఎందుకు?

వివిధ మత సంస్థలను నిషేధిస్తామని కూడా ప్రభుత్వం చెబుతోంది. లౌకిక వ్యవస్థలో మతతత్వం రెచ్చగొట్టే శక్తులకు చోటు వుండరాదు. ఆ శక్తులను అన్ని విధాలా తిప్పికొట్టాల్సిందే. ఏలినవారు ఆ విషయం గుర్తించాలంటే అయోధ్య ఘటనల వంటివి జరగాల్సి వచ్చింది. ఆ శక్తులనూ రాజకీయ, సాంఘిక ప్రతిఘటన, బహిష్కరణ ద్వారానూ, మతోన్మాద వ్యతిరేక ప్రచారంతోనూ ఎదుర్కోవడం చాలా అవసరం. అందుకు వివిధ లౌకికశక్తులు విస్తృతంగా కృషి చేయాలి తప్ప కేవలం నిషేధాలతోనే పని జరగదు. అలాటి సంస్థలను గుర్తించి, వాటిపై నిషేధాన్ని చట్టం పరిధిలో ఇరికించడంలో కూడా ఇబ్బందులు వున్నాయంటున్నారు. ఇందుకు సంబంధించిన నోటిఫికేషన్ విడుదలలో జాప్యానికి అదే కారణమై వుండవచ్చు. అన్ని వనరులుగల ఈ మతోన్మాద శక్తులు నిషేధాన్ని న్యాయస్థానంలో సవాల్ చేసే అవకాశం దృష్ట్యా చాలా పకడ్బందీగా ఆ పని జరగాల్సి వుంటుంది. నిషేధంతోనే ముందు వాటిని నిరోధించడం, వాటి అసత్య ప్రచారాలను, అవాంఛనీయ ప్రభావాలను వమ్ము చేయడం తక్షణ అవసరం.

ఆర్.ఎస్.ఎస్.ను 1948లో, 1975లో నిషేధించినా అప్పటికి ఇప్పటికి పరిస్థితిలో చాలా తేడావుంది. 1948లో గాంధీజీని ఆర్.ఎస్.ఎస్. వాది గాడ్సే హత్యచేసినందుకు దానిపై నిషేధం విధించారు. దాని మతోన్మాద స్వభావం ఆనాడే వెల్లడైంది. కొన్ని దశాబ్దాల పాటు ఆదెబ్బనుండి అది కోలుకోలేకపోయింది. కాని 1975లో శ్రీమతి ఇందిరాగాంధీ తన ఎమర్జన్సీని మతవాదులకోసం ఉద్దేశించినదిగా నిరూపించుకోవడానికే ఆర్.ఎస్.ఎస్.పై నిషేధం పెట్టారుగాని రాజకీయ దృష్టితో కాదు. అది దానికి లేని గౌరవం తెచ్చిపెట్టింది. కాని నేటి పరిస్థితి అందుకు పూర్తిభిన్నం. ఫాసిజాన్ని అనుసరించే పచ్చి మతోన్మాద సంస్థగా ఈనాడు ఆర్.ఎస్.ఎస్. నిరూపించుకుంది. దానివల్ల సానుభూతి పెరిగే అవకాశంలేదు. పైగా లౌకిక వాదుల్లో ఈ విషయంలో అప్రమత్తత పెరిగింది.

జన బాహుళ్యం ఆలోచనలు ఎప్పుడూ ఒకక్రమపద్ధతిలో వుండవనీ, వారిని భావోద్రేకాలతోనే వశపరుచుకోవాలని ఫాసిస్టు హిట్లర్ సిద్ధాంతం ఇందుకుగాను వక్రీకరణలను, వదంతుల వ్యాప్తిని మతోన్మాదులు సాధనంగా చేసుకుంటారు. ఇప్పుడు కూడా ఆ ప్రయత్నాలు తీవ్ర స్థాయిన జరగడం తథ్యం. వాటిని అప్రమత్తంగా ఎదుర్కోక తప్పదు.

## ప్రభుత్వం, ప్రధాని పాత్ర

ఈ అఘాయిత్యాన్ని నివారించడానికి గల అవకాశాలను, అధికారాలను ఉపయోగించుకోకుండా ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు, ఆయన ప్రభుత్వమూ ఘోరమైన తప్పిదానికి పాల్పడ్డారు. స్వతంత్ర భారత చరిత్రలో దేశాధినేత ఇంత దారుణంగా ప్రవర్తించిన ఘటన మరొకటి వుండదు. ఇందుకు నైతిక, రాజకీయ, పాలనాపరమైన బాధ్యత ప్రధాని వహించకతప్పదు. హిందూ మతోన్మాద కూటమితో ఎడతెగని మంతనాలాడుతూ, ఏవో హామీలు ఇచ్చి, పుచ్చుకుంటూ ఆయన కాలయాపన చేశారు. వామపక్షాలు, నేషనల్ ఫ్రంట్, ఆఖరుకు స్వంత పార్టీలోని బలమైన వర్గాలు ఈ విధానాన్ని విడనాడి గట్టిగా వ్యవహరించండి అని ఎంత చెప్పినా, అందుకు పూర్తి మద్దతు నిస్తామన్నా ఆయనలో మార్పు రాలేదు. వ్యక్తిగతంగా ఆయనే ఈ చర్చలు నడిపించారు. ఈ సమస్యను పూర్తి క్యాబినెట్‌లో ఎన్నడూ చర్చించలేదని కూడా ఇప్పుడు చెబుతున్నారు. కరసేవకులు చేరకుండా ఆపడంగాని, చేరిన తర్వాత మసీదు భద్రతకు భంగం కలగకుండాకాని ఆవడానికిగానీ ఆయన చెప్పుకోదగిన ఏ చర్యా తీసుకోలేపోయారు. లాంఛన ప్రాయంగా కేంద్ర దళాలను అక్కడికి తరలించినంత మాత్రాన సరిపోదు. అనవసరంగా వామపక్ష పాలిత రాష్ట్రాలలో కాంగీ కేంద్రం తన బలగాలను దించిన ఉదాహరణలు, రాష్ట్ర ప్రభుత్వాలను కలంపోటుతో రద్దు చేసిన ఘటనలు అనంఖ్యాకంగా వున్నాయి. కాని కరసేవ విషయంలో మటుకు ప్రధానికి ఎక్కడలేని ఫెడరల్ స్ఫూర్తి పుట్టుకొచ్చింది. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ దుర్బుద్ధి అడుగడుగునా వెల్లడవుతున్న ప్రధాని మాత్రం ఎనలేని 'విశ్వాసం' కనపరచారు. తీరా జరగాల్సింది జరిగాక, నాకు "ద్రోహం" జరిగిందని దూరదర్శన్‌లో వాపోయారు. మాజీ ఎం.పి. అక్బర్ అన్నట్లు నిజానికి ఆయనవల్లే దేశానికి ద్రోహం జరిగింది. నైతిక విలువలు వుంటే ఆయన వెంటనే గద్దెదిగి వుండేవారు. అదేమీ లేకపోగా గురువారం రాత్రి దూరదర్శన్ ఘటనలు అనంఖ్యాకంగా వున్నాయి. కాని కరసేవ విషయంలో మటుకు ప్రధానికి ఎక్కడలేని ఫెడరల్ స్ఫూర్తి పుట్టుకొచ్చింది. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ దుర్బుద్ధి అడుగడుగునా వెల్లడవుతున్న ప్రధాని మాత్రం ఎనలేని 'విశ్వాసం' కనపరచారు. తీరా జరగాల్సింది జరిగాక, నాకు "ద్రోహం" జరిగిందని దూరదర్శన్‌లో వాపోయారు. మాజీ ఎం.పి. అక్బర్ అన్నట్లు నిజానికి ఆయనవల్లే దేశానికి ద్రోహం జరిగింది. నైతిక విలువలు వుంటే ఆయన వెంటనే గద్దెదిగి వుండేవారు. అదేమీ లేకపోగా గురువారం రాత్రి దూరదర్శన్ ఘటనలు అనంఖ్యాకంగా వున్నాయి. కాని కరసేవ విషయంలో మటుకు ప్రధానికి ఎక్కడలేని ఫెడరల్ స్ఫూర్తి పుట్టుకొచ్చింది. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ దుర్బుద్ధి అడుగడుగునా వెల్లడవుతున్న ప్రధాని మాత్రం ఎనలేని 'విశ్వాసం' కనపరచారు. ఎంలో బి.జె.పి.- వి.హెచ్.పి.-ఆర్.ఎస్.ఎస్. కూటమి మతోన్మాదాన్ని ఎదుర్కోవడానికి వామపక్షాలు అగ్రభాగాన నిలబడతాయి, నిలుస్తున్నాయి కూడా. దేశంలో ఇతర చోట్ల పరిస్థితికి - వామపక్షాల అధీనం వున్నచోట్ల పరిస్థితికి తేడా కనిపిస్తూనే వుంది. మన రాష్ట్రంలో కూడా అన్నిచోట్ల శాంతి, సామరస్యాల సాధనకు చొరవగాముందుకొచ్చింది వామపక్షాలే. కనుక ప్రధాని ఈరోజు లౌకిక తత్వ పరిరక్షణ కోసం వాటికి పిలుపు నివ్వాల్సిన పనిలేదు. తన పార్టీ తీరుతెన్నులనే ఆయన చిత్తశుద్ధితో సమీక్షించుకోవాలి.

## మతోన్మాదాన్ని పెంచిన కాంగీ అవకాశవాదం

1980లో శ్రీమతి ఇందిరాగాంధీ రెండవసారి అధికారంలోకి వచ్చిన నాటి నుంచి క్రమంగా మతశక్తులతో, ప్రధానంగా మెజారిటీ మతతత్వంతో అనుసరించిన రాజీ వైఖరి ఈ పరిణామానికి దారితీసిందని ఎవరైనా ఒప్పుకోవాలి. నెహ్రూగారి మనసులో ఏముండేదో

తెలియదుగాని ఆయన అధికారరీత్యా మత కార్యక్రమాల్లో పాల్గొనలేదు. ఆయన కుమార్తె, మనుమడు మాత్రం గుళ్ళూ, గోపురాలు తిరగడం, బాబాలు, స్వాముల ముందు సాష్టాంగ పడటం రివాజుగా చేసుకున్నారు. రాజకీయ స్వార్థంతో రకరకాల మత విచ్ఛిన్నశక్తులను రెచ్చగొట్టారు. శ్రీమతి గాంధీ కేరళలో క్రైస్తవ, ముస్లిం, హిందూ మతోన్మాదులతో చేతులు కలిపి ప్రభుత్వమేర్పరిచారు. ఈశాన్యభారతంలోనూ క్రైస్తవాన్ని వాడుకున్నారు. పంజాబులో అకాలీలకు వ్యతిరేకంగా భింద్రన్‌వాలేని పైకి తెచ్చి సిక్కు మతోన్మాద చిచ్చు రగిలించారు. కాశ్మీర్‌లో ఫరూక్ అబ్దుల్లాను తొలగించేందుకై జి.ఎం.షాను ముఖ్యమంత్రిని చేసి ముస్లిం మతఛాందసానికి ప్రాణం పోశారు. ఇవన్నీ చివరకు కొరకరానికొయ్యలైనాయి. శ్రీమతి గాంధీ హయాంలో స్వర్ణదేవాలయంలోని భింద్రన్‌వాలే మూకను తొలగించేందుకు దానిపైకి సైన్యాన్ని పంపించాల్సి వచ్చింది. దానివల్ల సిక్కులకు ఎంతో కష్టం కలిగింది. తర్వాత సిక్కు మతోన్మాదులకే ఆమె బలయ్యారు. ఆమె హత్య తర్వాత కాంగీయులు సిక్కులపై సాగించిన ఊచకోత కూడా తీవ్ర కల్లోలానికి కారణమైంది. ఆ గాయం నేటికి నెత్తురోడుతూనే వుంది. దానికి బాధ్యులైన కాంగీయులు నేటికి శిక్ష అనుభవించలేదు. 1984 చివరలో జరిగిన ఎన్నికల్లో రాజీవ్‌గాంధీ సిక్కులకు వ్యతిరేకంగా హిందూ మతతత్వాన్ని రెచ్చగొట్టే ప్రసంగాలు చేశారు. ఆయన అధికారంలోకి రావడానికి అది ఒక ప్రధాన కారణమైంది. తర్వాత షాబాను కేసులో సుప్రీంకోర్టు తీర్పుపై ముస్లిం మత ఛాందసులు ఆగ్రహిస్తే - వారిని బుజ్జగించడానికి ముస్లిం మహిళల విడాకుల బిల్లు తెచ్చారు. అది హిందూ మతోన్మాదులకు కోపం కలిగించిందని వారి మెప్పుకోసం అయోధ్యలో కొన్ని దశాబ్దాలుగా మూతబడి వున్న వివాదాస్పద కట్టడం తలుపులు క్షణాలమీద తెరిపించారు. ఆ విధంగా బి.జె.పి.కి అయోధ్య సమస్యను ఆయుధంగా అప్పగించిన అపరాధి కాంగ్రెసే. 1989లో వివాదాస్పద స్థలంలో 'శిలాన్యాస్'కు అనుమతించింది రాజీవ్‌గాంధీయే! ·! ఈ అవకాశవాద రాజకీయాలు హిందూ మతోన్మాదం పెరగడానికే దారితీశాయి.

## లౌకిక పార్టీల కర్తవ్యం

ఈ విషయంలో ఇతర పార్టీలు కూడా పూర్తి నిర్దోషులేమీ కాదు. సి.పి.ఐ.(ఎం) మినహా తతిమ్మా జాతీయ పార్టీలన్నీ ఏదో ఒక దశలో, ఏదో ఒక స్థాయిలో జనసంఘం/బి.జె.పి.లతో పొత్తు పెట్టుకున్నవే. పాత చరిత్రనంతా వదలివేసినా 1977, 1989 ఘటనలను మాత్రం గమనించక తప్పదు. 1977లో జనసంఘం జనతాపార్టీలో లీనమై బాగా లాభపడింది. నాటి కాంగ్రెస్ వ్యతిరేక పోరాటం దృష్ట్యా సి.పి.ఎం. జనతాపార్టీని బలపరచినా పార్టీలో జనసంఘ్ ముఠా ప్రాబల్యం పెరగగానే విడగొట్టుకుంది. 1989లో నేషనల్ ఫ్రంట్‌లో బి.జె.పి. భాగస్వామి గాకుండా అదినిరోధించింది. బి.జె.పి.తో ఎలాటి పొత్తు వద్దని వారించింది. అయినా జనతాదళ్ నాయకత్వం వినకుండా అవగాహనకు వచ్చింది. అప్పుడే లోక్‌సభలో బి.జె.పి. బలం రెండు నుంచి 88కి పెరిగింది. మూడు రాష్ట్రాలలో ప్రభుత్వ మేర్పరచింది. గుజరాత్ మిశ్రమ ప్రభుత్వంలో చేరింది. వామపక్షాల వ్యతిరేకత వల్లనే కేంద్రంలో అది చేరే అవకాశం లేకుండా పోయింది. వి.పి. సింగ్ ప్రభుత్వ లౌకిక విధానాలు గిట్టని బి.జె.పి. 1990లో రథయాత్ర-కరసేవలు ప్రారంభించింది. తన అధికారం పోయినా ఆ ప్రయత్నాలు సాగనివ్వనని వి.పి. సింగ్ గట్టిగా నిలబడ్డారు. ఆనాడు కాంగీ-బి.జె.పి.లు కలిసే వి.పి. సింగ్‌ను కూలదోశాయి. తర్వాత జనతాదళ్ చీలిక, మతోన్మాద ప్రచారం వగైరా కారణాల వల్ల బి.జె.పి. బలం మరింత పెంచుకొంది; యు.పి.లోనూ అధికారంలోకి వచ్చింది. లౌకికవాద శక్తులు చీలకపోతే ఆ పార్టీ అంత పెరిగేదేకాదు.

ఆ మతోద్రేకాన్ని అలాగే నిలబెట్టడానికి బి.జె.పి. పదే పదే అయోధ్య సమస్య రగిలించింది. దానికి వేరే విధానాలు, నినాదాలు లేవు కూడా. ఆ పార్టీ రాష్ట్ర ప్రభుత్వాలు అవినీతికి, అసమర్థతకు శ్రామిక ప్రజా వ్యతిరేకతకు మారుపేరైనాయి. ఆ రాష్ట్రాలలో మత కలహాలు, బలహీన వర్గాలపై దాడులు పెరిగాయి. వాటి మతోన్మాద విధానాలు అందరి అభిశంసనకు గురైనాయి. ఉప ఎన్నికల్లో ఆపార్టీ అనేక ఎదురు దెబ్బలు తిన్నది. పచ్చి మతోన్మాదాన్ని విడనాడాలని కొందరు, ఇంకా తీవ్రం చేయాలని కొందరు దెబ్బలాడుకోసాగారు. బి.జె.పి. రాజకీయ నాయకత్వంకన్నా, వి.హెచ్.పి. నాయకత్వ ప్రాబల్యం పెరిగింది. మూల పీఠమైన ఆర్.ఎస్.ఎస్. నేరుగా రంగ ప్రవేశం చేయాల్సి వచ్చింది. తమ పట్ల ప్రజల్లో పెరిగిన అసంతృప్తిని దారితప్పించేందుకు, ఆ తర్వాత వివాదాల సర్దుబాటుకు కూడా అయోధ్య వివాదాన్ని పరాకాష్టకు చేర్చాలని పన్నాగం పన్నారు. తత్ఫలితమే ఈ పరిణామాలన్నీను.

మసీదు కూల్చివేత వల్ల రాజకీయంగా బి.జె.పి.కి లాభమా, నష్టమా అని కొందరు విశ్లేషకులు అప్పుడే వ్యాఖ్యానాలు రాస్తున్నారు. ఇది దేశం మనుగడకు సంబంధించిన సమస్యకాని రాజకీయ లభనష్టాల సమస్యకాదు. మొదట దేశంలో వ్యక్తమైన ఆగ్రహం చూసి ఖంగుతిన్న బి.జె.పి. కూడా నెమ్మదిగా కోలుకొని, మరో కొత్త దాడి ప్రారంభించే సన్నాహాలు చేస్తుంది. పోయిన మసీదు పోయింది, కట్టిన గుడిని కదిలిస్తే వూరుకోము' అన్న వాదనను అది తీసుకొంటోంది. మసీదు మళ్ళీ నిర్మించడానికి రాజ్యాంగంలో అవకాశం లేదు అని కొందరు అంటున్నారు. మసీదు దానంతటదే పోలేదు. దౌర్జన్యంగా, దుర్మార్గంగా కూలగొట్టబడింది. ఆ చర్యను అడ్డుకోవలసిన అధికార యంత్రాంగ[ం] విఫలమైంది. ఈ తప్పు సరిదిద్దుకోవలసిన బాధ్యత కేంద్రానిది. అందుకు ఎలాటి చర్యలు, ఏ రూపంలో తీసుకోవాలనేది సంప్రదించి నిర్ణయించవచ్చు[.] మసీదు కూల్చివేత వల్ల మైనారిటీలకు కలిగిన గాయాన్ని మాన్పి, ఉపశమనం కలిగించడాని[కి] ఈ చర్య తప్పనిసరి. అంతర్జాతీయంగా మ[న] ప్రతిష్టకు తగిలిన మచ్చమాసి పోవడానికి కూడ[ా] ప్రభుత్వం కదలక తప్పదు.

మైనారిటీలలో గల మతోన్మాద శక్తుల[ు] ఈ అవకాశాన్ని తీసుకుని వారిని రెచ్చగొట్టడాని[కి] ప్రయత్నం చేస్తాయి. ఈ శక్తులు మైనారిటీలక[ు] చేసిన మేలు లేకపోగా వారిని జాతీయ స్రవంతినుంచి దూరం చేయడానికి, పాకిస్తా[న్] వంటి దేశాల కుట్రలకు వీలుగా దోహదం చేశాయి[.] కనుక మైనారిటీలు ఆ ఛాందస శక్తులన[ు] ఎంతదూరం పెడితే అంతమంచిది. వార[ు] క్షణికోద్రేకంలో ఏదైనా కవ్వింపు చర్యక[ు] పాల్పడితే హిందూ మతోన్మాదులు దాని[ని] గోరంతను కొండంతలుచేసి విషప్రచారం సాగిస్తార[ు] మరచిపోరాదు. సాధారణ హిందూ జన బాహుళ్య[ం] ప్రత్యేకించి లౌకిక, వామపక్ష శక్తులతోకల[ిసి] వ్యవహరించడం ద్వారానే మైనారిటీలకు నిజమై[న] భద్రత లభిస్తుంది. దేశ సమైక్యతా నిలబడుతుం[ది.]

అయోధ్యలో మసీదు కూల్చినం[త] మాత్రాన అంతిమ విజయం సాధించామ[ని] బి.జె.పి. కూటమి భావిస్తే అంతకన్నా పొరబా[టు] వుండదు. మత ప్రాతిపదికను దేశ ప్రజల్లో చీ[లిక] తెచ్చేందుకు తీవ్ర ప్రయత్నాలు జరుగుతాయ[ి] ఆ ప్రమాదాన్ని ఎదుర్కోవాలి. ఏమైనా భార[త] దేశ లౌకిక వ్యవస్థ పునాదులు, ప్రజలలోగల మ[త] సామరస్య సాంప్రదాయాలు అం[త] దుర్బలమైనవికావు. చాలా బలీయమైనవి. చరి[త్ర] క్రమంలో ముఖ్యంగా దేశ విభజన సమయం[లో] అనేక చేదు అనుభవాలు ఎదురైనా భార[త] దేశంలోని అన్ని మతాల ప్రజలు ఐక్యంగా జీవిస్తు[న్నారు] వున్నారు. సవాళ్ళను తిప్పికొడుతూనే వున్నా[రు.] ఇప్పుడైనా అదే జరగాలి. ఈలోగా ఉద్రి[క్తత] సద్దుమణగడానికి చర్యలు చేపట్టాలి. బి.బి.[సి.] వార్తా సంస్థ చిత్రించినట్లు ఇది హిందువులు [-] ముస్లిముల ఘర్షణకాదు. హిందువులలోని [ఒక] వర్గం జరిపిన అఘాయిత్యమే అయో[ధ్య] పరిణామం. ఆచర్యను మత ప్రసక్తిలేకుం[డా] అసంఖ్యాక భారత ప్రజానీకం ఖండిస్తూనే వున్నా[రు] కనుక అసలు పోరాటం ఈఘటనలతో పరాకాష్ట[కు] చేరిన మతోన్మాదానికి, లౌకిక వాదానికి మధ్య[.] ఈ పోరాటంలో లౌకికవాదులు సాధి[ంచే] విజయాలే భారతదేశ సమైక్యతకు, మనుగడ[కు] శ్రీరామరక్ష కాగలుగుతాయి.

—తెలకపల్లి ర[...]

# భజనల బదులు బర్బర కృత్యం

## డిసెంబరు 6–అయోధ్య ఘటనలపై ప్రముఖ పత్రికా విలేకరుల ప్రత్యక్ష కథనాలు

ఆదివారంనాడు అయోధ్యలో బాబ్రీ మసీదును కూల్చివేసిన ఘటనపై రకరకాల కథనాలు వెలువడుతున్నాయి. ఆ రోజు పరిస్థితి బి.జె.పి. నాయకులు 'అదుపు తప్పి' పోవడం వల్లనే అలా జరిగిందికాని, నిజంగా వారు అలా చేయాలనుకోలేదని ఒక పెద్ద ప్రచారం సాగుతోంది. యు.పి. మాజీ ముఖ్యమంత్రి కల్యాణ్‌సింగ్ నుంచి బి.జె.పి. నాయకులు వాజ్‌పేయ్, భండారీల వరకు అందరూ ఆ ప్రచారాన్ని కొనసాగించాలని చూస్తున్నారు. కొన్ని తెలుగు పత్రికలు ఈ వార్త యిచ్చిన తీరుచూస్తే అవి కరసేవకుల కరాళ నృత్యాన్ని ఖండిస్తున్నాయో, హర్షిస్తున్నాయో తెలియని స్థితి కనిపిస్తుంది. మతోన్మాదాన్ని మత 'ఉద్వేగం' అని ఒకపత్రిక రాస్తే, మరో పత్రిక మహోత్తేజంగా లీడ్ రాసింది. కొంతమంది సంపాదక మహాశయులు యింత జరిగిన తర్వాతైనా బి.జె.పి. - వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్.లను ఖండించడానికి సిద్ధపడటంలేదు.

కాని కొన్ని ప్రముఖ జాతీయ ఇంగ్లీషు పత్రికల విలేకరుల కథనాలు చూస్తే అయోధ్య ఘటనలు ఒక పథకం ప్రకారం జరిగాయని స్పష్టంగా తెలుస్తుంది. అందుకే హిందూ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, టైమ్స్ ఆఫ్ ఇండియా, ఇండిపెండెంట్ పత్రికల విలేకరుల ప్రత్యక్ష కథనాల ఆధారంగా ఘటనల క్రమాన్ని యిక్కడ యిస్తున్నాం.

కరసేవ రోజున ఏమి జరుగుతుందనే దానిపై బి.జె.పి. అగ్రనాయకులే కావాలని రకారకాలుగా మాట్లాడి గందరగోళం సృష్టించారు అన్నది మరిచిపోలేని విషయం. డిసెంబర్ ఆరవ తేదీన కూడా వారు అదే ధోరణిలో కొనసాగించారని పత్రికలు రాశాయి.

"బి.జె.పి, వి.హెచ్.పి. నాయకులు చెబుతూ వచ్చినదానికన్నా చాలా భిన్నమైన పరిస్థితులు ఎదురవుతున్నాయని ఉదయం నుంచే అర్థమైపోయింది. ముందు అనుకున్న ప్రకారం 12.15 గంటల కరసేవలో పాలుపంచుకొమ్మని తమను పిలిచే వరకు ఆగకుండా ప్రక్కనగల



కరసేవకులను రెచ్చగొడుతున్న అద్వానీ, జోషీ ప్రభృతులు

రామకథ పార్కులోకి చేరకుండా యువజనులు మసీదు ముందున్న రోడ్డుపైకి చేరారు. "మట్టిని మిట్టీనహీ కిష్కంగే -ఢించాతోడ్ కర్ జాయెంగీ" (మేము మట్టిని తరలించము. కట్టడాన్ని కూల్చేసే తిరిగిపోతాము) అని నినాదాలు చేస్తూ తిరిగారు. కొంతమంది తుపాకులు ప్రదర్శించగా, కొంతమంది కట్టడం వెనుక దాచిపెట్టిన గునపాలు చూపించారు" అని ఎక్స్‌ప్రెస్ విలేకరి రాశారు.

ఆదివారం మధ్యాహ్నం 12 గంటలకు కరసేవ ప్రారంభమవుతుందని చెప్పినవారు తర్వాతదాన్ని 1.10 నిమిషాలకు మార్చారు. కాని ఉదయం 9-30 గంటలకే కరసేవకుల దండు మసీదు సమీపానికి చేరుకున్నది. 10-45 నిముషాలకు అద్వానీ, జోషి, సింఘాల్ తదితరులు అక్కడికి చేరుకున్నారు. వెంటనే భజరంగదళ్ శివసేన వలంటీర్లు ముందుకు చొచ్చుకు రావడం ప్రారంభమైంది. దళాల వారీగా వివాదాస్పదమైన 2.77 ఎకరాల స్థలంలోకి మిమ్మలను పంపుతామని ఆర్గనైజర్లు వారికి చెప్పారు. ఆర్.ఎస్.ఎస్. వలంటీర్లు వారిని అదుపు చేస్తున్నట్లు నటించారు. కాని వారి మాట విన్నవారెవరూ లేరు. 10.30 ప్రాంతంలో కరసేవకులు మొదటిగా అక్కడ నిర్మించిన అడ్డంకులను ఛేదించారు.

ఇంత జరుగుతున్నా పోలీసులు మౌన ప్రేక్షకులుగా చూస్తుండిపోయారు. "ఈ కరసేవకులు విధ్వంసకులుకారు. మేము వారిపై బలప్రయోగానికి పాల్పడము" అని డిప్యూటీ పోలీసు సూపరింటెండెంట్ 'ఇండిపెండెంట్' పత్రిక విలేకరికి చెప్పారు. ఒకవైపున కరసేవకులు అన్ని వైపుల నుంచి విరుచుకు పడుతున్న దశలో ఆయన అన్న మాటలివి!

### 'అగ్రనాయకుల' సమక్షంలో

ఆ సమయంలో సాధ్వీరీతాంబరీ, ఉమా భారతి ఏవో ప్రవసంగాలు చేస్తున్నారు. పోలీసులతో కరసేవకుల ఘర్షణ కొనసాగుతోంది. అక్కడున్న పోలీసులు, కొద్దిమంది సి.ఆర్.పి. సిబ్బందిపై రాళ్ళు పడ్డాయి. రామచబుత్ర దగ్గర తిష్టవేసిన కరసేవకులు పక్కనే వున్న గోడని దెబ్బ తీయడం ప్రారంభించారు. వారిని అందరూ అనుసరించారు. 11 గంటల ప్రాంతంలో పోలీసులు పూర్తిగా చేతులెత్తేశారు. కరసేవకులదే యిష్టారాజ్యమైంది. ముందుగా కొంతమంది మొదటి గోపురంపై కెక్కారు. కొద్ది దెబ్బలతో అది కూలిపోగానే అందరికి శివమెత్తింది. ఆటవికుల్లా ఆ చారిత్రక కట్టడంపైబడి దాన్ని నాశనం చేశారు.

ఇదంతా జరుగుతున్నప్పుడు బి.జె.పి., వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్. అగ్ర, ఉగ్రనాయకులు అక్కడే వున్నారు!

"వివాదాస్పదమైన కట్టడం కూల్చివేత కార్యక్రమం అద్వానీ - జోషీలతో సహా సీనియర్ నాయకులందరి సమక్షంలో జరిగింది" అని "ఇండియన్ ఎక్స్‌ప్రెస్ రాసింది.

"ఎల్.కె. అద్వానీ, జోషి, అశోక్ సింఘాల్ ఉమాభారతి, సాధువు, అత్యున్నత అధికారులు, దేశ, విదేశీ పాత్రికేయుల ఎదుటే ఈ కూల్చివేత కార్యక్రమం సాగింది. ప్రధాన గోపురం కూలడానికి కొంచెముందు "మరో దెబ్బ కొట్టండి" అని ఉమాభారతి కేకలు వేయడం వినిపించింది. కూల్చివేత ఆ కాషాయాంబరదారి ఎంత సంతోషం కలిగించిందో దాన్నిబట్టి అర్థమవుతుంది. ఈ విధ్వంసానానికి ఉపయోగించిన ఆయుధాలు, కరసేవకులకు యిచ్చిన పూర్తి స్వేచ్ఛనుబట్టి చూస్తే ఈ కార్యక్రమం పథకం ప్రకారం జరిగిందని స్పష్టమవుతోంది" అని ఇండిపెండెంట్ పత్రిక విలేకరులు ఎస్.ఎన్.ఎం. అబ్ది, రష్మీ సెహగల్ వ్యాఖ్యానించారు.

గొడవ మొదలైన తర్వాత ముప్పై నిముషాలలో మసీదు చుట్టూగల బారికేడ్లు, కరెంటు తీగలు పద్ధతి ప్రకారం ధ్వంసం చేయబడ్డాయి. వందలాది మంది కరసేవకులు మసీద కూలగొట్టడం ప్రారంభించారు. ముందు ఆ పురాతన కట్టడం తాలూకా పెచ్చులు రాలిపోయాయి. తర్వాత గోపురాలపై యింకా పెద్ద దెబ్బలు పడ్డాయి.

ఆ దశలో అక్కడ పూర్తిగా అరాచకం ఏర్పడింది.కరసేవకులు తాత్కాలిక నిచ్చెనల సాయంతో మసీదు గోపురాలపైకి ఎగబ్రాకారు. అప్పుడు మైకులో ఎవరెవరో తమకు తోచిన ప్రకటనలు చేస్తూ రెచ్చగొడుతూనే వున్నారు. కూల్చివేత వల్ల విరిగిపడే రాళ్ళతో చాలా మంది గాయపడుతున్నారు. ఇది మనం ప్రాణ బలి ఇచ్చే తరుణం కాదు. అనవసర ప్రాణ నష్టం నివారించాలి అని ఎవరో చెప్పారు. ఈలోగా సాధ్వీరీతాంబరి వచ్చి మైకు స్వాధీనం చేసుకుంది. "అసంపూర్తిగా మిగిలిపోయిన అతి పెద్ద పనిపూర్తి చేద్దాం." అని వీరంగం తొక్కింది. గాయపడిన కరసేవకుల కోసం చికిత్స ఏర్పాట్లు చేయమని ఎవరో అరిచారు. అనేక మంది దెబ్బలు తగిల పడిపోయారు. సి.ఆర్.పి. వాహనాలను ఆపిన వారు వైద్య సిబ్బంది వాహనాలు మాత్రం రానిచ్చారు.



జనాన్ని చూసేసరికి నా ఉపన్యాసంకూడా అదుపు తప్పింది. హిందూ సౌజన్యంతో

ప్రతి కొద్ది నిముషాలకు మసీదులో నుంచి కొంత మంది కరసేవకులు ఏదో ఒక రాయి లేదా వస్తువు తీసుకుని బయటకు రాసాగారు. చరిత్రాత్మకమైన దానపత్రాలు, మత చిహ్నాలు, చిత్రాలు, దేవుళ్ళు, దేవతల చిత్రాలు అలా తరలించారు.

ఈ కూల్చివేత కార్యక్రమ సాయంత్రం అయిదు గంటలకు కొంచెం ముందుగా పూర్తయింది.

ఈ మొత్తం గొడవ జరుగుతున్నంతసేపు అధికార యంత్రాంగం ఏ కాస్త కదలికా చూపించలేదు. మసీదుకు ఎదురుగా వున్న "మానస భవన్ పై కప్పునుంచి పాత్రికేయుల బృందం ఘటనలను పరిశీలిస్తున్నది. ఈ తీవ్ర పరిస్థితిలో జిల్లా పోలీసు సూపరింటెండెంట్ రాష్ట్ర అడ్వకేట్ జనరల్ వి.కె. చౌదరితో కబుర్లాడుకుంటూ వుండటం వారు చూశారు. పోలీసులు, పారా మిలిటరీ దళాలు దాదాపు ఏమీ చూడనట్టే వ్యవహరించడం మరీ విశేషం. "రాష్ట్ర ప్రభుత్వం మసీదు విధ్వంసానికి కంకణం కట్టుకుందని, ఆదివరకు (సుప్రీంకోర్టులో) యిచ్చిన హామీలన్నీ అబద్ధాలని రుజువై పోయిందని "ఇండిపెండెంట్" పత్రిక ప్రతినిధులు రాశారు. బాబ్రీ మసీదు నుంచి "ఒక్క ఇటుక" కూడా కదిలించబోమని శనివారం వరకూ చెబుతూ వచ్చిన కల్యాణ్‌సింగ్ ఈ ఘటనల సమయంలో పత్తా దొరకలేదు.

"రామకథ గంజ్" వద్ద ప్రసంగించడానికి సిద్ధమవుతున్న అద్వానీని విలేకరులు చుట్టుముట్టి జరుగుతున్న ఘటనలపై వ్యాఖ్యానించాల్సిందిగా కోరారు. "మీరు పరిస్థితి తీవ్రతను తెలుసుకోండి" అని ఆయన అన్నారు.

ఆ ప్రాంగణంలో మామూలుగా పూజలు చేసే వినయ్‌కుమార్ పాండే హడావుడిగా బయటకు పరుగెత్తుకొచ్చారు. కరసేవకులెవరో తనను కొట్టి తోసివేశారని, శ్రీరాముడి విగ్రహాలు తీసుకుపోయారని ఆయన అన్నారు. (1949లో అక్కడ విగ్రహాలు అక్రమంగా ప్రతిష్ఠించిన సంగతి తెలిసిందే.)

## కేంద్ర బలగాల గతి

రాష్ట్ర ప్రభుత్వ బలగాలు కుమ్మక్కయితే, మరి కేంద్రం ఎంతో ఆర్భాటంగా పంపించిన సి.ఆర్.పి. దళాలు ఏమయ్యాయి? ఎలాంటి మతకలహాల స్థితినైనా ఎనిమిది నిముషాలలో అదుపు చేయగల ఆర్.ఎ.ఎఫ్.(రాపిడ్ యాక్షన్ ఫోర్స్) దళాలు ఎందుకు రంగ ప్రవేశంచేయలేదనే ప్రశ్న తలెత్తుతుంది.

అదనపు దళాలు అవసరంలేదని కల్యాణ్‌సింగ్ మొదటినుండి మొండిగా చెబుతూ వచ్చారు. కేంద్రం దళాలను ఫైజాబాద్‌కు పంపించిందేగాని, కదిలించలేదు. రాష్ట్ర ప్రభుత్వ అనుమతి కోసం అది ఎదురు చూస్తూకూచుంది. కేంద్ర దళాలు రావాలన్నా, కాల్పులు వంటి చర్యలు తీసుకోవాలన్నా వారికి ఒక జిల్లా మేజిస్ట్రేట్‌ను అప్పగించాలి. కాని ప్రభుత్వం అందుకు అంగీకరించలేదు. ములాయంసింగ్ వలె తాను కరసేవకులపై బలప్రయోగం చేయబోనని కల్యాణ్‌సింగ్ చెబుతూ వచ్చారు.

కేంద్రం కూడా నిస్సహాయంగా రాష్ట్రం 'అనుమతి' కోసం చూస్తూకూచుంది. పరిస్థితి తీవ్రతను బట్టి దేశంలో ఎక్కడికైనా సాయుధ బలగాలు పంపేందుకు రాజ్యాంగ రీత్యా అధికారముందని పార్లమెంటులో ప్రకటించిన హోంమంత్రి ఎస్.బి. చవాన్ ఆచరణలో అందుకు సిద్ధపడలేదు. ఎనిమిది గంటలపాటు దళాలు రాష్ట్ర అనుమతి కోసం పడిగాపులు కాశాయి.

ఈ లోగా ఆర్.ఎ.ఎఫ్. దళాలు రంగప్రవేశం చేయాలని విఫలయత్నం చేశాయి. మధ్యాహ్నం ఒంటి గంట ప్రాంతంలో అవి ఫైజాబాద్ నుంచి బయలుదేరాయి.వాటిపై దాడులు జరిగాయి. అయినా లెక్కచెట్టక వివాదాస్పద కట్టడానికి రెండు కిలోమీటర్ల దూరం వరకు చేరుకోగలిగాయి.

## అద్వానీ ఆటంకం

ఆ దశలో కరసేవకులు వాటిని అడ్డుకున్నారు. అయోధ్యకు అన్ని ప్రవేశ మార్గాలను మూసివేసి, కేంద్ర బలగాలు రాకుండా ఆపాలని అద్వానిగారే ఆదేశాలు జారీ చేసినట్లు "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" రాసింది.

ఆర్.ఎ.ఎఫ్. దళాలు సంగీత డిగ్రీ కాలేజీ దగ్గరకు చేరుకోగానే వారి సీనియర్ల నుండి వైర్‌లెస్ వర్తమానం వచ్చింది. పరిస్థితి అదుపులో వుందట మీరు వెనక్కు వచ్చేయండి అని దాని సారాంశం. ఈ విషయం మీరు రాష్ట్ర అధికారుల నుంచి లిఖిత పూర్వకంగా తీసుకోండి అని సీనియర్లు చెప్పారు. కాని తీరా వారు లిఖిత పూర్వకంగా యిచ్చిన దానిలో రాసింది వేరు. ఆర్.ఎ.ఎఫ్. దళాలను మధ్యాహ్నం ఒంటి గంటకు పిలిచారు. కాని వారు కాలేజీ దగ్గరకు వచ్చేసరికి రహదారుల దిగ్బంధనం వల్ల కదలడానికి వీల్లేని స్థితి ఏర్పడింది. కనుక మీరు వెనక్కు వెళ్ళి, సురక్షితమైన చోటులో వుంటే, అవసరమైనప్పుడు పిలుస్తాము అని చెప్పాము" అని రాశారు. ఆ విధంగా ఒక వంక మసీదు విధ్వంసం జరుగుతుంటే, కేంద్ర దళాలు చేతులు ముడుచుకుని వెనక్కువచ్చేశాయి. దాని నిష్క్రమణ తర్వాత మూడు గంటలకు మసీదు పూర్తిగా అదృశ్యమైంది.

## పాత్రికేయులపై దాడి

ఫాసిస్టు తత్వంతో చెలరేగిన మతోన్మాదులు కోర్టులను, రాజ్యాంగాన్ని ఖాతరు చేయకుండా మసీదును కూలద్రోసిన తీరు, అందుకు రాష్ట్రంలో తమకు గల అధికారాన్ని దుర్వినియోగం చేసిన విధం పైనా చూశాం. పత్రికలు, ప్రసార సాధనాల ప్రతినిధులు దీనంతటిని చూస్తున్నారనితెలుసు. వారిని గనక భయపెడితే తమ దురాగతం బయటకు పొక్కదనే దుర్మార్గమైన ఆలోచనతో పత్రికలవారి పైనపడ్డారు. (ప్రజాస్వామ్యంపట్ల విశ్వాసంలేని వారికి పత్రికా స్వేచ్ఛ అంటే గౌరవమేముంటుంది) అందుకే కరసేవ మూకలు పాత్రికేయులపై విరుచుకుపడ్డారు. వారి కెమెరాలు, పరికరాలు, డబ్బు అన్నీ లాక్కొని ధ్వంసం చేశారు. కెమెరాలు గాలిలోకి విరిరేశారు. మసీదును ఆక్రమించిన తర్వాత కొద్దినిముషాలలోనే వారి దృష్టిపత్రికల వారిపై పడింది. మొదట విదేశీ పాత్రికేయులపైన, తర్వాత భారతీయ విలేకరులపైన పడ్డారు. దారుణంగా కొట్టారు. ఖరీదైన వీడియో పరికరాలను నాశనం చేశారు. కనీసం ఎనిమిది పత్రికల ఫోటో గ్రాఫర్ల కెమెరాలు కోల్పోయారు. పాత్రికేయులు భయంతో పరుగులు తీయాల్సి వచ్చింది. మానస భవన్ పై నుంచి విలేకరులు చూస్తున్నారని గమనించి, మూకలు దాన్ని స్వాధీనం చేసుకున్నాయి. సాయంత్రం 4.40 గంటలకు ఒక విదేశీ విలేకరి దగ్గరలో ఏదో ఇంట్లో దాక్కున్నారని ఘటనలపై ప్రత్యక్ష వ్యాఖ్యానం పంపుతున్నారని కరసేవకులకు సమాచారం అందింది.వెంటనే ఆ ఇల్లు ఎక్కడ వుందో స్పష్టమైన వివరాలు మ్యాపుతో సహా అందచేయబడ్డాయి. 'మారో ముఝా, తోడేదో ఉస్ కాసామాన్' (కొట్టండి వాడి సామాను నాశనం చేయండి) అంటూ ఆ వైపు వందలాదిమంది పరుగులు తీశారు. ఆ సాయంత్రం వరకు పాత్రికేయులకు తమ సహచరుల పరిస్థితి స్పష్టంగాక చాలా భయందోళనలతో గడిపారు. మసీదు కూల్చివేత లాగానే, పాత్రికేయులపై దాడికి కూడా ముందే పథకం వేసుకున్నారని పలువురు విలేకరులు వ్యాఖ్యానించారు.

పాత్రికేయులపై దాడికి పురికొల్పిన వ్యక్తి కూడా అశోక్ సింఘాలే. శనివారం ఉదయం పోలీసులు కరసేవకులపై లాఠీఛార్జి జరిపారనే వార్తను బి.బి.సి. వార్తాసంస్థ ప్రసారంచేసిందని మైకులో చెప్పి, ఆయన వారిని రెచ్చగొట్టారు. శనివారం సాయంత్రమే ఆ మూకలు జర్మనీకి చెందిన డబ్ల్యు.ఎస్.ఎ. టెలివిజన్ బృందంపై దాడి చేశాయి. ఆదివారం కూడా ఆగ్రహం కొనసాగింది. తమకు ఎవరి అడ్డులేదని అర్థంకాగానే పత్రికల వారిపై పడ్డారు.

అయోధ్య వచ్చిన పత్రికల వారు గుర్తింపు కార్డులు పెట్టుకోవాలని వి.హెచ్.పి. పట్టుబట్టింది. వాటి ఆధారంగా కరసేవకులు విలేకరులను తేలిగ్గా గుర్తుపట్టగలిగారు. ముఖ్యంగా విదేశీ జర్నలిస్టులపై వారి దాడి సాగింది. చివరకు ఆ విలేకరులు సమీపంలోని సి.ఆర్.పి. శిబిరంలోకి వెళ్ళి దాక్కున్నారు.

అయితే విలేకరులపై ఎన్ని దౌర్జన్యాలు జరిపినా, 'దాచేస్తే దాగని సత్యం'లా హిందూ మతోన్మాద కూటమి బర్బరకాండ ప్రపంచానికి తెలియకుండా ఆపలేకపోయింది!

## సిగ్గు చేటైన వైఫల్యం

కేంద్ర హోంమంత్రి శ్రీ ఎస్.బి.చవాన్ డిసెంబర్ 7వ తేదీన ఢిల్లీలో విలేకరులతో మాట్లాడుతూ, బాబరీ మసీదు విధ్వంసం "ముందుగా పన్నిన కుట్ర" అయివుంటుందని చెప్పారు. అయితే దానిగురించి ప్రభుత్వ నిఘా అధికారుల నుంచి ఎలాంటి నివేదిక అందలేదని ఆయన చెప్పారు. ఇలా చెబితే ప్రభుత్వానికి సిగ్గుచేటని కూడా ఆయనకు తోచలేదు. పత్రికలు ఎన్ని విషయాలు రాసినా, వామపక్షాలు ఎంతగా చెప్పినా, ఆఖరుకు అద్వానీలు, అశోక్ సింఘాల్‌లు తమ పథకాలు రోజూ వెల్లడిస్తున్నా, కళ్ళూ,చెవులు లేనట్లు వ్యవహరించిన కేంద్రం ఇప్పుడు 'కుట్ర' గురించి కొత్తగా కనిపెట్టినట్లు మాట్లాడటం ఎంత హాస్యాస్పదం? కాని ఆవిషయం తెలుసుకోలేని కేంద్ర హోంమంత్రి, ఆయన నిఘావిభాగం ఎంత "గొప్పవో" చెప్పలేము! ఇక ప్రధాని శ్రీపి.వి.నరసింహారావు సరేసరి. తాను రాజ్యాంగ నిబంధనలు తు.చ తప్పకుండా పాటించానని, చేయగలిగింది చేశానని ఆయన రోజూ అదే పనిగా చెప్పుకుంటున్నారు. 'చేయవలసింది" చేయకపోవడమే ఆయన అసలు అపరాధం' వైఫల్యం!

రాజ్యాంగంలోని 352వ అధికరణం ప్రకారం కేంద్రం అయోధ్య విషయంలో ఏమైనా చేసివుండవచ్చు. రాష్ట్రపతి (అంటే కేంద్రమంత్రి వర్గం) గనుక దేశంలోని ఏదైనా ప్రాంతంలో తీవ్రఅత్యవసర పరిస్థితి ఏర్పడిందని, సాయుధ తిరుగుబాటు (తీవ్ర అంతర్గత హింసాత్మక కల్లోలం) ప్రమాదముందని భావిస్తే ఆ ప్రాంతాన్ని తన స్వాధీనంలోకి తీసుకోవచ్చు. దేశంలోని ఏప్రాంతంనుండి భద్రతకు ముప్పు కలిగినా ఈ అధికరణాన్ని వినియోగించుకునే అధికారం కేంద్రానికి వుంది. అక్కడ శాంతి భద్రతలు కాపాడమని సుప్రీంకోర్టు సూటిగా ఆదేశించినా ఆ అధికారాలు వినియోగించకుండా మతోన్మాద వ్యూహానికి దోహదం చేసి, ఇప్పుడిలా మాట్లాడటం అర్థరహితం!

# వికృత సమర్థనలూ వినాశకర పథకాలు!

ఆరవ తేదీన అయోధ్యలో బాబరీ మసీదు విధ్వంస కాండ సాగుతుండగానే బి.జె.పి. ఉపాధ్యక్షుడు శ్రీ ఎస్.ఎస్. భండారి ఢిల్లీలో పత్రికా గోష్ఠి జరిపారు. అక్కడ జరిగిన ఘటనలు "దురదృష్టకరం" అని "అనుకోకుండా" జరిగాయని ఆయన చెప్పారు. కావాలని రాజ్యాంగాన్ని ధిక్కరించలేదు, హఠాత్తుగా జరిగిందన్నారు. కరసేవకులు "రామభజన" చేస్తున్నారని శ్రీ భండారి విలేకరులకు చెబుతుండగా విధ్వంస కాండ వార్తలు వచ్చాయి. ఈ ఘటనలు నేరం కాదా అని విలేకరులు అడగ్గా, "నేరం జరిగింది" అని ఆయన అంగీకరించారు. (ఇండియన్ ఎక్స్‌ప్రెస్) ఇది మా పార్టీకి పెద్ద ఎదురు దెబ్బ అని కూడా ఆయన వాపోయారు.

అయితే "అయోధ్యలో జరిగింది ఒకరోడ్డు ప్రమాదం లాంటిది" అని ఆయన తేలిగ్గా కొట్టిపారేశారు. మీ ఉద్దేశం అంతేనా అంటే, అంతే అని స్పష్టంగా చెప్పారు. రోడ్డు ప్రమాదాలు జరిగినంత మాత్రాన ట్రాఫిక్ రూల్స్ మారనట్లే ఈ ఘటనల వల్ల తమ వైఖరి మార్చుకునే అవకాశం లేదని ఆయన అప్పుడే అంటూ, ఒక వైపున మసీదు గోపురాలు కూలిపోతుండగానే స్పష్టంగా చెప్పారు. పైగా తాము రెచ్చగొట్టే ప్రసంగాలు చేయలేదని సమర్థించుకున్నారు. అదే రోజు రాజస్థాన్ ముఖ్యమంత్రి శ్రీ భైరాన్ సింగ్ షెకావత్ మాట్లాడుతూ, ఇది కరసేవకులలో చొరబడిన శివసేన వాలంటీర్ల పని అని ఆరోపించారు. "నిజంగా మావాళ్ళే ఆ పనిచేసివుంటే గర్వకారణం" అన్నారు శివసేన అధిపతి బాల్‌థాకరే. "ఊరికే భజనలు చేయడానికి అంతదూరం వెళ్ళడమెందుకు, ఇంట్లోనే చేసుకోవచ్చుకదా" అని ఆయన అసలు విషయం సూటిగా చెప్పారు.

ఏమైనా ఘటన జరిగిన రోజున కొంచెం విచారం "నటించినా" బి.జె.పి., వి.హెచ్.పి. నాయకులు ఆ వెంటనే విధ్వంసకాండను సమర్థించేందుకు పూనుకున్నారు.

ఆ మరుసటి రోజు (7వ తేదీ) సమావేశమైన బి.జె.పి. పార్లమెంటరీ పార్టీ ఆఘటనను "దురదృష్టకరం" అని పేర్కొందే



గాని సూటిగా ఖండించలేదు. విచారం కూడా వెలిబుచ్చలేదు. పైగా అయోధ్యకు కేంద్ర బలగాలు వచ్చినందున పరిస్థితి క్షీణించిందని లేనిపోని ఆరోపణలు చేసింది. కొందరు విలేకరులకు కూడా కలిగిన అసౌకర్యానికి, గాయాలకు "విచారం" వెలిబుచ్చి సరిపెట్టింది.

ఆరోజునే శ్రీ ఎల్.కె. అద్వానీ లోక్‌సభలో ప్రతిపక్ష నాయకుడిగా రాజీనామా చేస్తూ స్పీకర్‌కు లేఖ పంపించారు. అదొక నాటకమని ముందే స్పష్టమైంది. ఆయన రాజీనామా లేఖ పంపించాల్సింది పార్టీకి గాని, స్పీకర్‌కు గాదు. ఏ పార్టీ పెద్దదిగా వుంటే దాని నాయకుడికి లభించే హోదా అది! ఆ రాజీనామాకు 'నిజంగా విలువలేదని" రాజ్యసభలో బి.జె.పి. నాయకుడు 'సికిందర్ భక్త్' అప్పుడే ప్రకటించారు. ఆయననే తాము తిరిగి ఎన్నుకుంటామని కూడా చెప్పేశారు. తర్వాత ఎన్నుకున్నారు.

రథయాత్రతో మొదలు పెట్టి, ఇంత అఘాయిత్యం జరగడానికి కారకుడైన అద్వానీ తన బాధ్యతని స్వీకరిస్తున్నానని అంటూనే అంత బూటకంగా ప్రవర్తించడం గమనార్హం. "ఇండియన్ ఎక్స్‌ప్రెస్"లో రాజీవ్ ధావన్ వ్యాసం రాస్తూ, కల్యాణ్ సింగ్, అద్వానీల రాజీనామా నాటకాలను తీవ్రంగా దుయ్యబట్టారు. "నిజంగా తమకు నైతిక బాధ్యత వుందని వారుభావిస్తే, అయోధ్యకు వెళ్ళి మసీదు పునర్నిర్మాణానికి మొదటగా రాళ్ళు వేయాలి. ఈ దేశంలో ప్రార్థనా స్థలాలకు భంగం కలగదని బహిరంగంగా ప్రకటించాలి" అని ఆయన రాశారు. అది జరిగే పని కాదనుకోండి. ప్రజలలో వ్యక్తమైన ఆగ్రహాన్ని బట్టి, తాత్కాలికంగా ఏవో కొన్ని ప్రహసనాలు నడిపినా ఒక్క రోజులోనే బి.జె.పి. నాయకత్వం మళ్ళీ ఎదురు దాడి ప్రారంభించింది.

8వ తేదీన అద్వానీ, జోషి, అశోక్ సింఘాల్, వి.హెచ్.పి. దాల్మియా, వినయ్ కతియార్ తదితరులను అరెస్టు చేశారు.

కలహాలను రెచ్చగొట్టే ఉద్దేశాలతో కవ్వింపులకు పాల్పడ్డం, వివిధ మతాల మధ్య శతృత్వాలు రగిలించడం, దేశ సమైక్యతకు భంగం కలిగించేలా ప్రసంగాలు, ప్రకటనలు చేయడం, అన్న నేరాలకుగాను భారత శిక్షాస్మృతిలోని 153 153(ఎం), 153(బి) సెక్షన్ల క్రింద వారిని అరెస్టు చేసి కోర్టులో హాజరు పరిచారు. అద్వానీ ప్రభృతులు ఈనేరం చేశారని దేశమంతటికీ తెలుసు. అయినా ఈ అరెస్టులు అన్యాయమని బి.జె.పి. కూటమి గగ్గోలు ప్రారంభించింది. పార్లమెంట్‌ను జరగకుండా చేసింది. భారత్ బంద్‌కు పిలుపు నిచ్చింది. (అది విఫలమైనదనుకోండి)

అరెస్టుకు ముందు అద్వానీ "ప్రభుత్వం ఘర్షణకే సిద్ధపడిందని, ఇది దానికి ఆత్మహత్యా సదృశ్యమని, దేశానికి మరింత హాని చేస్తుందని" బెదిరింపు ధోరణిలో ఒక ప్రకటన చేశారు.

మత సంస్థలపై నిషేధాన్ని ప్రస్తావిస్తూ, టెర్రరిస్టు, జాతి వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడినప్పుడే ఏదైనా సంస్థలను నిషేధించాలని ఆయన అన్నారు. మరి కోర్టును, చట్టాలను బాహాటంగా ధిక్కరించి, మూకుమ్మడి దౌర్జన్యానికి దిగి, ఒక ప్రార్థనా మందిరాన్ని కూలద్రోయడం

# అయోధ్య పరిణామాలు

టెర్రరిస్టు చర్యకాదని అద్వానీ ఉద్దేశ్యమా?

"మేము గుడిని చట్టబద్ధమైన పద్ధతులలో కట్టాలని అనుకున్నాము"అని ఆయన చెప్పారు. ఇది విశ్వాసానికి సంబంధించినదని, న్యాయస్థానాలకు అతీతమని చెప్పిన అద్వానీ ఇప్పుడీ మాటలనడంకన్నా అన్యాయం మరొకటి వుంటుందా?

"అయోధ్యకు లక్షా 80వేల మంది కరసేవకులు వచ్చారు. శాంతి యుతంగా వుండాలన్నమా విజ్ఞప్తికి వారు స్పందించారు. కేవలం అయిదు లేదా ఆరువేలమంది మాత్రమే ఈఘటనలో పాల్గొన్నారు. అందులో కేవలం అయిదు లేదా ఆరువందల మంది మాత్రమే కట్టడాన్ని కూలగొట్టడంలో పాల్గొన్నారు."అని అద్వానీ విచిత్రమైన లెక్కలు చెప్పారు.

అంటే అయిదువందల మందిని లక్షా 80వేల మంది ఆపలేక పోయారని అద్వానీ గారు మనలను నమ్మమంటారా!. ఒక్కేసారిగా విరుచుకువడటంతో పరిస్థితి చేయిదాటిపోయిందని కల్యాణ్‌సింగ్ చెప్పేమాటలు అబద్ధాలే!? చూడండి.

"కరసేవకులందరూ క్రమశిక్షణగలవారు. చట్టం పట్ల గౌరవం గలవారు. కరసేవ రోజున ఎలాటి అవాంఛనీయ ఘటన జరగదని నేను పూర్తిగా విశ్వసిస్తున్నాను"

"పరిస్థితి పూర్తిగా రాష్ట్ర ప్రభుత్వం అదుపులో వుంది. ఎలాంటి ఆందోళనకూ అవకాశం లేదు" అని కల్యాణ్‌సింగ్ డిసెంబర్ 5న (శనివారం) బల్లగుద్ది చెప్పారు. (టైమ్స్ ఆఫ్ ఇండియా)

మళ్ళీ అదే ఇంటర్వ్యూలో "మేము ఆలయ నిర్మాణంపై వాగ్దానం నుంచి వెనక్కుపోము, అయితే దాని అర్థం మేము కోర్టు ఉత్తర్వులను ఉల్లంఘిస్తామని కాదు" అన్నారు. "ఈ దశలో ఆలయ నిర్మాణాన్ని ఆపలేము. ఎందుకంటే అది కోట్లాది మంది మనోభావాలకు సంబంధించిన విషయం" అని ఆయన అన్నారు.

అదే కల్యాణ్ సింగ్ ఘటన జరిగిన రెండురోజులకు మాట్లాడుతూ, "కట్టడం భద్రతకు హామీనిచ్చిన మాటనిజమే కానిపరిస్థితి చేయిదాటి పోయినందున దాన్ని నిలుపుకోలేకపోయాము" అని చెప్పారు. కరసేకుల మీద ఎట్టి పరిస్థితులలో కాల్పులు జరవరాదని తాను ముందే ఆదేశాలిచ్చానని ఆయనే చెప్పారు. కాల్పులు జరిపితే చాలా జననష్టం జరిగేదంటున్నారు. కాల్పులు జరపాలా లేదా అనేది ఆరోజు అక్కడ పరిస్థితిని బట్టి నిర్ణయించాలిగాని ముందే ఆమేరకు హామీ ఇవ్వడం అంటే కరసేవకుల కార్యక్రమాలకు లైసెన్సేకదా! పైగా పరిస్థితిని అదుపు చేయడానికి గల వివిధ పద్ధతులలో కాల్పులు ఒకటి. కనీసం లాఠీచార్జీకూడా జరగలేదు. కాల్పుల వల్ల జననష్టం జరిగేమాట నిజమేకాని మసీదు కూల్చినతర్వాత జరిగిన అంతులేని జననష్టం మాటేమిటి? అందుకు ఎవరు మూల్యం చెల్లిస్తారు? ఆ ఘర్షణల నివారణకు ఎన్నోచోట్ల కాల్పులు, కర్ఫ్యూలు పెట్టాల్సిరాలేదా? కరసేవకులు అంత పెద్దసంఖ్యలో అక్కడ చేరకుండా, చేరినా చెలరేగకుండా ముందే ఆపితే ఈ విషాదం తప్పేది. అందుకుట కరసేవకుల కార్యక్రమాలకు లైసెన్సేకదా! పైగా పరిస్థితిని అదుపు చేయడానికి గల వివిధ పద్ధతులలో కాల్పులు ఒకటి. కనీసం లాఠీచార్జీకూడా జరగలేదు. కాల్పుల వల్ల జననష్టం జరిగేమాట నిజమేకాని మసీదు కూల్చినతర్వాత



జోషి

జరిగిన అంతులేని జననష్టం మాటేమిటి? అందుకు ఎవరు మూల్యం చెల్లిస్తారు? ఆ ఘర్షణల నివారణకు ఎన్నోచోట్ల కాల్పులు, కర్ఫ్యూలు పెట్టాల్సిరాలేదా? కరసేవకులు అంత పెద్దసంఖ్యలో అక్కడ చేరకుండా, చేరినా చెలరేగకుండా ముందే ఆపితే ఈ విషాదం తప్పేది. అందుకుట కరసేవకుల కార్యక్రమాలకు లైసెన్సేకదా! పైగా పరిస్థితిని అదుపు చేయడానికి గల వివిధ పద్ధతులలో కాల్పులు ఒకటి. కనీసం లాఠీచార్జీకూడా జరగలేదు. కాల్పుల వల్ల జననష్టం జరిగేమాట నిజమేకాని మసీదు కూల్చినతర్వాత జరిగిన అంతులేని జు మసీదునుండి శాస్త్ర సమ్మతంగానే తరలించారా అంటే మాత్రం తనకు తెలియదు, విచారిస్తాను"అని తప్పుకొన్నారు. మతానికి, ఆగమ శాస్త్రానికి బి.జె.పి., నిజంగా ఇచ్చే విలువ అది. కోర్టు ఉత్తర్వు ఉల్లంఘిస్తామని స్పష్టంగా ప్రకటించిన శివసేన వారిని మీ వేదికపైకి ఎలా ఆహ్వానించారు అంటే ఆయన దగ్గర సమాధానం లేదు.తమ పార్టీ పత్రికా స్వాతంత్ర్యాన్ని బలపరుస్తోందని వాజ్‌పాయ్ అన్నా, విలేకరులే సిగ్గుసిగ్గు అని అరిచాక, ఆయన బేషరతుగా క్షమాపణలు చెప్పుకోవలసి వచ్చింది.

9వ తేదీన అద్వానీ పేరుతో ఒక ప్రటకన విడుదలైంది. అది అరెస్టుకు ముందే ఆయన రాసి, ఆయన భార్యకు ఇచ్చివెళ్ళాడని చెప్పడింది. "అయోధ్యలో వివాదాస్పద కట్టడం కూల్చివేతపై బి.జె.పి.లో ఏకోశానయినా పశ్చాత్తాపం మిగిలివుంటే అద్వానీ ప్రకటన దాన్ని పూర్తిగా తుడిచిపెట్టింది"అని "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" ఆ ప్రకటనను గురించి వ్యాఖ్యానించిందంటే అది ఎలా వుందో అర్థంచేసుకోవచ్చు.

ఈ లోగా వాజ్‌పేయ్‌గారుకూడా "జూలు" దులిపారు. 'ఆప్సోస్‌కేపర్వ్ ఖతమ్ ఆక్రోశ్ పర్వ్‌షురు( విచారించే సమయం అయిపోయింది. ఆగ్రహించే తరుణం వచ్చింది! అని ఆయన పార్లమెంటరీ పార్టీలో చెప్పారు.

ఆవిధంగా మసీదు కూల్చివేతతో మొదలు పెట్టిన బి.జె.పి. మతోన్మాద వ్యూహం కొత్తదశలోకి ప్రవేశించింది. అయోధ్యలో మసీదు పునర్నిర్మాణాన్ని వ్యతిరేకించడం, విదేశాలలో ఆలయాలపై దాడుల విధ్వంసం గురించి గొడవ చేయడం ఇప్పుడు దాని ప్రధాన నినాదాలు. సూడో సెక్యులరిజం, మైనారిటీల బుజ్జగింపు వంటి నినాదాలన్నీ అది పూర్తి స్థాయిలో ప్రయోగించబోతోంది. ఇందుకోసం పార్టీ ఎం.పి.లను ప్రజల్లోకి వెళ్ళమని ఆదేశాలిచ్చింది. రానున్న కొద్దిరోజులలో ప్రతీఘాత, ప్రతీపశక్తుల ప్రచారం పెద్ద ఎత్తున సాగుతుంది. ప్రభుత్వంపైనా, వామపక్ష, లౌకిక పార్టీలపైనా దాడిచేయడంతో ఆగక అద్వానీ తన 9వ తేదీ ప్రకటనలో రాష్ట్రపతిని, ఉపరాష్ట్రపతిని, కోర్టులను కూడా నేరుగా విమర్శించారు. ప్రభుత్వ ఆదేశాలు హింసాకాండ ప్రకోపించడానికే దారితీస్తాయని ఆయన బెదిరించారు. "ఆర్.ఎస్.ఎస్., విశ్వహిందూ పరిషత్ వంటి గొప్ప సంస్థలను నిషేధిస్తే మంటలు ఎగుస్తాయి" అని భండారీ చేసిన ప్రకటన కూడా అదే. తమదే పెద్ద జాతీయ పార్టీ అని, తక్కినవన్నీ హిందూయేతర పార్టీలని ఇకముందు బి.జె.పి. మరింతగా ప్రచారం చేయబోతోంది. ఇప్పుడు ఎన్నికలు జరిగితే మేము చాలా బలపడతాము. కేంద్రంలో అధికారంలోకి కూడా రావచ్చు. అని బి.జె.పి. వర్గాల వ్యాఖ్యలు! దేశాన్ని మతకలహాల్లో దగ్ధం చేసి అధికారానికి బి.జె.పి. కలలు కంటోందనడానికి ఇంతకన్నా నిదర్శనం ఏంకావాలి? "హిందూ రాష్ట్రానికై సంఘపరివార్ యుద్ధం ప్రారంభించిందనడానికి అయోధ్య ఘటనలు బహిరంగ ప్రకటనలాంటివే. ఇందుకోసం చట్టాన్ని, రాజ్యాంగాన్ని ఉల్లంఘించడానికి కూడా వారు సిద్ధమే" అని 'హిందూ' పత్రిక ప్రత్యేక ప్రతినిధి సరిగ్గా చెప్పారు.

ఈ సవాల్‌ను ఎదుర్కొని, దేశ సమైక్యతను, మత సామరస్యాన్ని కాపాడుకోగలశక్తిని భారతప్రజలు ప్రదర్శిస్తారని ఆశించాలి.

—టి.ఆర్.





# సీతారాం ఏచూరి

సి.పి.ఎం.పొలిట్‌బ్యూరో సభ్యులు


ఒకనాడు భారతదేశం తనది లౌకిక. ప్రజాతంత్ర రాజ్యాంగమని ప్రకటించుకుంది. ఇందుకు కారణం అధిక సంఖ్యాకులుగా గల హిందువులు ఆ లౌకికతత్వాన్ని కోరుకోవడమే. బహుళ జాతులు, భాషలు, సంస్కృతులు గల మన దేశస్వభావాన్ని వారు ఆమోదించారు. ఇవి మానవ సమాజ పురోగమనంలో భాగాలుగా ఎలుగెత్తి చాటుతున్నారు. స్వాతంత్ర్య పోరాట కాలంలో హిందువులలో ఎక్కువ మంది దేశాన్ని హిందూ రాజ్యంగా మార్చాలనే ఆర్.ఎస్.ఎస్. పథకాన్ని గట్టిగా తిరస్కరించారు. అది భారతదేశాన్ని మధ్యయుగాలలోకి తీసుకుపోతుంది గనుక మత రాజ్య ఏర్పాటు ప్రజా స్వామ్య రాజకీయ వ్యవస్థ మూలసూత్రాలకే విరుద్ధమవుతుంది గనుక వారు వ్యతిరేకించారు. అత్యధిక సంఖ్యాక హిందువులలో గల ఈ భావాన్నే నేడు కాషాయం చొక్కాలు సవాల్ చేస్తున్నాయి. మతోన్మాద శక్తులు కోరుతున్నది హిందువుల మనోభావాలను మన్నించడం కాదు, కొన్ని తరాలుగా లౌకిక వాద హిందువులు పోరాటాలు సాగించి, స్వతంత్ర. లౌకిక. భారతాన్ని నెలకొల్పడం ద్వారా సాధించిన మొత్తం ఫలితాలనే కూలగొట్టాలని చూస్తున్నారు.

## తప్పుడు పోలిక

ఈ ఫాసిస్టు ప్రచార కాండ వెనుక మతరాజ్యంగా హిందూ రాష్ట్రం అనే ఫాసిస్టు సిద్ధాంతం వుంది. "జాతీయ వాదులు" కుహనా లౌకిక వాదులు" అనే వారి మధ్య చీలిక వుందని ఈ కాషాయం చొక్కా "యోధులు" దేశం ముందు చెబుతున్నారు. తమతో వున్నవారు జాతీయ వాదులట, తక్కిన వారంతా కుహనా లౌకిక వాదులట. దానిలో గల సిద్ధాంతసారం కొత్తేమీకాదు. "మనం లేదా మన జాతీయతకు నిర్వచనం " అనే పేర ఆర్.ఎస్.ఎస్. అధినేత గోల్వాల్కర్ 1939లో రాసిన పుస్తకంలో ఇలా పేర్కొన్నారు.

హిందువులు తమ జాతీయత మరచిపోయారని ఆపుస్తకంలో గోల్వాల్కర్ వాపోయారు. జాతి రక్షణకై కదలాలని పిలుపు నిచ్చాడు. లౌకిక రాజ్యానికి ఆధునిక పునాదులుగా వున్న దృక్పధాన్ని పూర్తిగా వ్యతిరేకించే విధంగా ఆయన జాతికి నిర్వచనం ఇస్తారు. మతాన్ని రాజకీయాల నుంచి పూర్తిగా వేరుచేయాలనే ఈ ధృక్పధానికి వ్యతిరేకంగా గోల్వాల్కర్ ఇలా పేర్కొన్నారు.

"మాకు సంబంధించినంత వరకూ జీవితంలో ప్రతిచర్య– వ్యక్తిగతమైనదైనా, సాంఘికమైనదైనా, రాజకీయపరమైనదైనా అది మత శాసన ప్రకారమే వుంటుంది".

".... రాజకీయాలు కూడా మతం ఆదేశాలలో ఒకటిగా పరిగణించి, అప్రకారమే అనుసరించవలసిన పరిస్థితి వుంటుంది. హిందూస్థాన్‌లో గల మేము అలాటి మతం (హిందూ మతం) తోనే జీవిస్తున్నాము".

ఇంతటితో తృప్తి కలగని గోల్వాల్కర్ ఇంకా ఇలా కొనసాగించారు.

"హిందూస్థాన్‌లో సనాతన హిందూ జాతి వుండాలి. హిందూ జాతి తప్ప ఇంకేమీ వుండరాదు. హిందూ జాతికి, మతానికి, సంస్కృతికి, భాషకు సంబంధం లేని వారంతా నిజమైన జాతీయ జీవనం నుంచి వేరుపడిపోవలసిందే"

తర్వాత ఆయన జాతీయవాది అనేదానికి పునాది ఏమిటో చెప్పారు. అదే అద్వానీ నేడు ప్రచారం చేస్తున్నారు. అదేమంటే.

"హిందూ జాతిని ప్రస్తుత దురవస్థ నుంచి విముక్తి చేసి. పునర్నిర్మించి పటిష్టపరచేందుకు ఉద్దేశించిన ఉద్యమాలు మాత్రమే నిజంగా జాతీయ స్వభావం గలవి. హిందూ జాతిని ఉద్ధరించాలన్న ఆకాంక్షని తమ హృదయాల్లో నింపుకున్న వారే నిజమైన జాతీయ దేశభక్తులు. ఆ లక్ష్యాన్ని సాధించేందుకు వారికి సహాయపడాలి. తక్కిన వారంతా జాతి ప్రయోజనాలకు ద్రోహులు. శత్రువులు కొంచెం దారుణంగా చెప్పాలంటే మూర్ఖులు అనాలి."

పంజాబ్, కాశ్మీర్, అస్సాం తదితర చోట్ల మనదేశ సమైక్యతను, సమగ్రతలను కాపాడేందుకై ప్రాణాలర్పిస్తున్నవారిని. మనజాతీయ సరిహద్దులను శత్రువుల నుంచి కాపాడుతున్న వారిని కాషాయ ముఠాలు వర్ణిస్తున్న తీరు అది!

## పచ్చి దురభిమానం

ఆ విధంగా మతాన్ని రాజకీయాల్లో విడదీయరాని భాగంగా చేయడం ద్వారా కాషాయ చొక్కాలు నేడు దేశ శత్రువులకే బలం చేకూరుస్తున్నాయి. పంజాబ్‌లో ఖలిస్థానీ ఉగ్రవాదులకు, కాశ్మీర్‌లో ముస్లిం తీవ్ర వాదులకు అవకాశం కలిగిస్తున్నాయి.

భారతదేశ అభివృద్ధికి సహాయం చేసి. ఇక్కడే స్థిరపడిన హిందూ యేతరుల గురించి గోల్వాల్కర్ ఇలా చెప్పారు.

"వారు తమ వ్యత్యాసాలను వదిలి పెట్టకపోతే, ఈ జాతి మతాన్ని, సంస్కృతిని, భాషను స్వీకరించి పూర్తిగా జాతిలో కలిసిపోకపోతే వారికి జాతీయ జీవనంలో భాగముండదు. వారు తమ జాతి, మత, సాంస్కృతిక తేడాలను పాటించినంతకాలం విదేశీయులుగానే పరిగణించబడతారు.

ఆయన ఇంకా ఇలా చెప్పారు.

"హిందూస్థాన్‌లోగల విదేశీ జాతుల వారు హిందూ సంస్కృతికి, భాషకు అలవాటు పడాలి. హిందూ మతాన్ని గౌరవించటం, పవిత్రంగా చూడటం నేర్చుకోవాలి. హిందూ దేశానికి సంబంధించినదైన హిందూ మతాన్ని, హిందూ సంస్కృతిని కొనియాడడం మినహా మరే విధమైన ఆలోచనలకు వారు చోటివ్వరాదు. తమ ప్రత్యేక ఉనికిని విడనాడి హిందూ జాతిలో కలిసి పోవాలి లేకపోతే వారు దేశమంతటా హిందూ జాతికి పూర్తిగా లోబడి బతకాలి. ప్రాధాన్యత ఇవ్వడం మాట అటుంచి ఎలాటి ప్రత్యేక సదుపాయం, ఆఖరుకు పౌరహక్కులు కూడా వారు అడగకూడదు. వారికి మరేవిధమైన మార్గమూ వుండకూడదు. మనది పాతకాలపు దేశం. మనదేశంలో జీవించాలనుకొనే విదేశీ జాతుల పట్ల పాత దేశాలు ఎలా వ్యవహరిస్తాయో అలాగే చేద్దాం (వక్కాణింపు మాది).

పచ్చి ఫాసిజం

అలాంటి ప్రజల పట్ల వారెలా వ్యవహరించాలనుకుంటున్నారు? ఈ ప్రశ్నకు గోల్వాల్కర్ సమాధానం చూస్తే నాజీ ఫాసిజం గుర్తుకు వస్తుంది. కంపరమెత్తుకొస్తుంది. (ఆయన ఆ పుస్తకం రాసిన సమయంలో నాజీయిజం చాలా ఉధృత స్థాయిలో వుండేది) అందులో ఇలా చెప్పారు.

"జాతి పవిత్రతను, సంస్కృతిని కాపాడేందుకు సెమెట్రిక్ జర్మనీ ప్రపంచాన్ని దిగ్భ్రాంతి పరచే విధంగా యూదులను తుడిచి పెట్టింది. జాతి పరంగా, సాంస్కృతికంగా వ్యత్యాసాలు వేళ్ళూనుకున్న జాతులు ఒకటిగా కలిసి పోవడం అసాధ్యమని జర్మనీ అనుభవం చెప్పింది. హిందుస్థాన్‌లోని మనం నేర్చుకుని, ఉపయోగించుకోవలసిన [illegible] పాఠమిది" (వక్కాణింపు మాది)

ఆ విధంగా ఆర్.ఎస్.ఎస్. చెప్పే ప్రకారం వారు హిందూ రాష్ట్ర లక్ష్యం సాధించుకొనేందుకు ఫాసిస్టు పద్ధతులు అనుసరించాలన్నమాట.

## చరిత్రపట్ల దృక్పథం

జాతీయ వాదులు, కుహనా లౌకిక వాదులు" అనబడే వారికి మధ్య అద్వానీ, కాషాయ మూకలు ముందుకు తెస్తున్న వివాదం నిజ స్వరూపమిది. జాతీయ వాదం ముసుగులో చెబుతున్నదేమంటే అంతులేని పచ్చి ఫాసిస్టు హింసా విధానం. ఇది గోబెల్స్ తరహా అసత్య ప్రచారంపై ఆధారపడి వుంది. చరిత్ర సంబంధమైన సాక్ష్యాలను కొట్టి పారేయడం లేదా వక్రీకరించడం జరుగుతున్నది. అందువల్లనే రాముడి జన్మస్థలం ఏది అనే అంశం చరిత్రకు కాదు విశ్వాసానికి సంబంధించిన సమస్య అని అద్వానీ అంటున్నారు. రాముడి జన్మభూమిని సాధించేందుకై గతంలో జరిగిన 76 ప్రయత్నాలలో నాలుగు లక్షల మంది హిందువులు చనిపోయారని చెబుతున్నారు. బ్రిటిషువారు ఆ ప్రాంతాన్ని ఆక్రమించుకునేందుకు అయోధ్యలో మత కలహం రగిలించారన్నది వాస్తవం.

బరితెగించి చట్టాన్ని ఉల్లంఘించడం, న్యాయవ్యవస్థను కించపరచటం జరుగుతున్నది. పంజాబ్, కాశ్మీర్‌లలో చట్టాలు ఉల్లంఘిస్తున్న వారిని ఉగ్రవాదులు అంటున్నాము. కాని అయోధ్యలో చట్టధిక్కారానికి పాల్పడ్డవారిని అమరవీరులని చెబుతూ జలియన్ వాలాబాగ్ అమరులతో పోలుస్తున్నారు. అంటే భారత స్వాతంత్ర్యం కోసం, సెక్యులరిజం స్థాపన కోసం ప్రాణాలర్పించిన వీరులను - దేశాన్ని వెనక్కు తీసుకుపోయి హిందూ రాజ్యం స్థాపించగోరే వారితో కలిపి చిత్రిస్తున్నారు. పత్రికా ప్రపంచంలో కొన్ని సెక్షన్లు ఇందుకు సహాయపడుతున్నాయి. మరో వంక ఈ కాషాయ ముఠా అనేక ఏళ్ళుగా పదంతుల యంత్రాంగాన్ని పకడ్బందీగా ఏర్పాటు చేసింది. ఈ రెండింటి సాయంతో ఈ అసత్యాలు ప్రచారం చేయబడుతున్నాయి. నేటి మన సమాజంలోకి మత విద్వేష విషాన్ని ఎక్కింపచేస్తున్నాయి.

ఇదంతా హిందూ సంస్కృతిని పునరుద్ధరించడం పేర జరుగుతున్నది. అయితే హిందూ మతం,



హిందూజాతికి గల వైవిధ్యాన్ని కావాలనే త్రోసిపుచ్చుతున్నారు. వింధ్య పర్వతశ్రేణికి దక్షిణాన గల రాజులను ఎప్పుడూ వానరులుగాను; ఉత్తరాదినుంచి వచ్చిన ఆర్యులకన్నా తక్కువ వారుగా చిత్రించడంతో వారెప్పుడూ అవమానాల పాలవుతూ వచ్చారు. కాషాయ మూకలు వారిని హిందువులుగా పరిగణించవు. గోల్వాల్కర్ హిందూ జాతిని నిర్వచించేందుకు భాషను కూడా ఒక కొలబద్దగా పేర్కొన్నారు. భారతదేశంలో గల భిన్నమైన భాషలు మాట్లాడేవారంతా హిందువులుగా పరిగణించబడరన్నమాట.

తనకు అభిమాన పాత్రుడైన బలిచక్రవర్తి పునరాగమన సందర్భంగా కేరళలో ఓనం పండుగ జరుపుకునే వారంతా ఈ ప్రకారం హిందువులు కారు. ఆర్యుల కథనం ప్రకారం బలిని మహావిష్ణువే వామనావతారంలో వచ్చి చంపివేస్తాడు. ఎందుకంటే బలిచక్రవర్తి రాక్షసరాజు. కనుక అతన్ని కొలిచే వారు హిందువులు కారు. ఇలాంటి తేడాలు ఎన్నోవున్నాయి. శైవులకూ-వైష్ణవులకూ మధ్య, అయ్యర్లకూ-అయ్యంగార్లకు మధ్య తేడాలున్నాయి. తీవ్రమైన కుల తగాదాలు, ఘర్షణలు వున్నాయి. కాలక్రమంలో వచ్చిన ఇవన్నీ కలిసి పెనవేసుకొని హిందూ సమాజంలో వైవిధ్యాలుగా నిలిచి వున్నాయి. కాషాయ ముఠాలు నేడు వీటన్నింటిని త్రోసి రాజని, ఒకే విధమైన అగ్రవర్ణ హిందూ భాషాపరమైన హిందూ జాతిగా చిత్రించాలని చూస్తున్నారు.

## తీవ్ర ప్రమాదం

స్వామి వివేకానంద హిందూ మతం గురించి చెప్పినదాన్ని నాడు గోల్వాల్కర్, నేడు కాషాయ ముఠాలు చెప్తున్న రెచ్చగొట్టే ప్రచారాన్ని పోల్చి చూడండి. వివేకానంద ఇలా చెప్పాడు: "ఎవరైనా సరే తన ఒక్కమతమే ఒంటరిగా బతకాలని, ఇతర మతాలు నాశనం కావాలని అనుకుంటే అతన్ని చూసి నేను మనసారా జాలి పడతాను. అతనికి ఒక విషయం చెప్తాను. ఎంత ప్రతిఘటన వచ్చినా ప్రతిమత పతాకం మీద త్వరలో సంఘర్షణ కాదు సహాయం అని, విచ్ఛిన్నం కాదు శాంతి, సుహృద్భావం అని లిఖించడం జరుగుతుంది" ఇలా చెప్పినందుకు వివేకానందుడిని అద్వానీ, అతని కాషాయ ముఠాలు వెలి వేస్తాయా? హిందూ రాజ్యం స్థాపిస్తామని చెప్పే వారికన్నా మిన్నగా వివేకానందుడు చెప్పినదే హిందూ జీవన విధానాన్ని సక్రమంగా వాస్తవంగా ప్రతిబింబించడం లేదా?

ఈరోజు మన చుట్టూ గల పరిస్థితి నిజానికి మనదేశానికి, ప్రజలకు అతి తీవ్రమైన సవాలు. పంజాబ్, కాశ్మీర్, అస్సాం వగైరా చోట్ల వివిధ రకాలైన జాతి వ్యతిరేకశక్తులు సమైక్య భారత దేశపు పునాదులను కదిలించుతున్న తరుణంలో ఈ సవాల్ ఎదురవుతోంది. కాషాయ ముఠాల దృష్టిలో మాత్రం మన దేశముందుగల ఒకే ఒక సమస్య బాబ్రీ మసీదును కూల్చడమే.

అమెరికా మొత్తం జనాభా కన్నా ఎక్కువ మంది భారతీయులు దారిద్ర్యరేఖకు దిగువున బ్రతుకుతున్నారనే విషయం వారికి పట్టదు. అనేక దేశాల జనాభా కలిపి చూసిన దానికన్నా హెచ్చు సంఖ్యలో మనదేశంలో పిల్లలు తమ జీవనోపాధికై కష్టపడుతున్నారనే విషయం వారికి పట్టదు. మొత్తం ఆస్ట్రేలియా జనాభాకన్నా హెచ్చు మంది భారతీయులు ఏటా సరైన తిండిలేక చచ్చిపోతున్నారనే విషయం వారికి పట్టదు. బాబ్రీ మసీదు కూల్చివేత ఒక్కటే భారత ప్రజల ముందున్న సమస్యగా చిత్రీకరించడం ద్వారా ఈ రోజున కాషాయ ముఠాలు మన ప్రజలపై దోపిడీ సాగించే వ్యవస్థను ఇంకా పటిష్టం చేస్తున్నారు.

ఈ సవాల్‌ను సమైక్యంగా తిప్పికొట్టాలి. మతోన్మాదాన్ని గట్టిగా ఎదుర్కోవాలి. లేకపోతే వేలాది మంది ప్రాణాలర్పించి స్వాతంత్ర్యం సంపాదించిన భారతదేశ భవిష్యత్తుకే ముప్పు కలుగుతుంది. దేశ శత్రువులకు అంతరాత్మలు తాకట్టు పెట్టని దేశభక్తులందరూ ఈ ప్రమాదాన్ని గుర్తించాలి. మతోన్మాద భూతానికి వ్యతిరేకంగా బలోపేతమైన ఐక్యత పెంపొందించాలి.

# మత విశ్వాసాలు – న్యాయస్థానాలు – తీర్పులు

అయోధ్యలో బాబరీ మసీదు కూల్చివేతకు మతప్రసక్తి లేకుండా సహృదయులైన ప్రతి ఒక్కరూ ఖండించారు. అంతకుమించి ఇన్నేళ్ళ స్వాతంత్ర్యం తర్వాత కూడా దేశంలో లౌకిక విలువలు పాదుకొనలేదని ఆవేదన చెందారు. మతాన్ని రాజకీయాలను వేరు చేయాలని, లౌకికతత్వాన్ని అమలు పరచాలని ఇప్పుడు చాలా మంది గట్టిగా నొక్కి చెబుతున్నారు. అదే సమయంలో ఇంత జరిగిన తర్వాత కూడా బిజెపి-విహెచ్‌పి- ఆర్‌ఎస్‌ఎస్- హిందూ మతోన్మాద కూటమి తన ధోరణి కించిత్తయినా మార్చుకోకపోగా, దుందుడుకు తనం కొనసాగిస్తోంది. లౌకికతత్వాన్ని కుహనా లౌకికతత్వమని అది నిందిస్తుంది. అంతకన్నా ముఖ్యంగా బిజెపి కూటమి ప్రజల మతవిశ్వాసాలు కోర్టులకు అతీతమని అదే పనిగా వాదిస్తున్నది. దేవుడి గురించి కోర్టులు చెప్పేదేమిటని సవాళ్ళు విసురుతోంది. సుప్రీంకోర్టు కూడా వద్దని వారించినా, బాబరీ మసీదును కూలదోయడం ద్వారా అది తన ఆలోచనా ధోరణిని ఆచరణలో అమలు జరిపింది. అయోధ్య ప్రారంభం మాత్రమేనని, మధుర, కాశీ 'బాకీ' వున్నాయని అంటోంది. అయోధ్య మినహా మిగిలిన ప్రార్థనా స్థలాలన్నింటా 1947 ఆగస్టు 15 నాటి స్థితిని కదిలించరాదంటూ పార్లమెంటు రాజ్యాంగానికి సవరణ తెచ్చిన దృష్ట్యా ఈ నాటకాన్ని పునరావృతం చేయడం దానికి సాధ్యపడకపోవచ్చు. అంతేగాక అయోధ్యలో పరిణామాలు అసంఖ్యాక ప్రజానీకానికి దాని రాజకీయాలలోని ప్రమాదాన్ని తెలియజెప్పాయి. లౌకికశక్తులు కూడా ఏకమవుతున్నాయి. అయినప్పటికీ మతవిశ్వాసాలున న్యాయ స్థానాలకు అతీతమనే వాదలోని అవాస్తవికతను, ప్రమాదాన్ని గుర్తించడం చాలా అవసరం. లేకపోతే ఏదోరూపంలో ఇలాటి సమస్యలే వస్తుంటాయి.

మానవ పరిణామక్రమంలో మతాల పుట్టుక, పెరుగుదల చరిత్రలో వాటిపాత్ర గురించి ఇక్కడ చర్చించడం సాధ్యంకాదు. ఈ లోకానికి సబంధంలేని, అతీంద్రియ విశ్వాసాలకు సంబంధించిన భావాల సముదాయమే మతం అనవచ్చు. అన్ని మతాలు మరణానంతర"మోక్షం" గురించే చెబుతాయి. "మతము" అనే మాట "మన్" (ఆలోచించు) అనే ధాతువు నుండి పుట్టిందని. మతము అనే పదానికి సమ్మతమైనది అని అర్థమని పండితులు చెబుతున్నారు. సాంప్రదాయాన్ని, పారంపర్యంగా సంక్రమించే అంశాలను కూడాస్థూలంగా మతం అంటూ వుంటారు. కొన్ని విధి నిషేధాలను, ఆచారాలను మతం బోధిస్తుంది. వాటిని అమలు జరపాలని శాసిస్తుంది. అన్నిమతాల మూలసూత్రాల, ప్రవక్తలు ప్రబోధాలు అత్యుత్తమమైనవే అయినా ఆచరణలో అవి అనేక తీవ్ర పరిణామాలకు, అన్యాయాలకు కూడా దారితీశాయి. ఉదహరణకు హైందవ మతంలో వర్ణ వ్యవస్థగాని, బౌద్ధ జైనుల చెవుల్లో సీసం కరిగించి పోసిన ఘటనలుకాని మరచిపోరానివి. క్రైస్తవమతాధిపతులు యూరప్ సమాజాన్ని తమ నిరంకుశత్వంతో పీడించిన తీరును మార్టిన్‌లూధర్‌కింగ్ ఎదిరించాల్సి వచ్చింది. ఇస్లాం మతంలో అనేక మంచి అంశాలున్నా, మధ్యయుగాలలో అది అనేక తీవ్ర కలహాలకు కారణమైంది. తమ మతం గొప్పదనిచెప్పుకోవడంతో ఆగకుండా ఇతర మతాలపై దాడికి దిగుతుండడం ప్రతిచోట జరిగింది. మానవుడు మతాభిమానం మత దురభిమానంగా, మతోన్మాదంగా దారితీసింది. క్రైస్తవ-ఇస్లాం మత దేశాల మధ్య క్రూసేడులు (మతయుద్ధాలు) చరిత్రలో నమోదైనాయి. మతంతో ఏ మాత్రం సంబంధం లేకపోయినా రాజ్యవిస్తరణ కాంక్షతో మతాన్ని సాధనంగా వాడుకున్న సందర్భాలు అవి. ఒకేమతంలో వారు శాఖలుగా చీలి గొంతులు కోసుకున్నారు. క్రైస్తవులలో రోమన్‌కాథలిక్‌లు-ప్రొటెస్టెంట్లు, ఇస్లాంలో షియాలు-సున్నీలు, హిందూవులలో శైవ-వైష్ణవుల మధ్య తీవ్ర ఘర్షణలు జరిగాయని మరచిపోలేము.

**భారత రాజ్యాంగంలోని 25వ అధికరణం ప్రజలు తమకు నచ్చిన మతాన్ని అనుసరించే హక్కును ఇచ్చింది. అయితే అది కొన్ని పరిమితులు కూడా విధించింది.**

**"ప్రజాశాంతికి, నైతికతకు, ఆరోగ్యమునకు, మరియు ఈ భాగము యొక్క ఇతర నిబంధనలకు లోబడి, అంతరాత్మ ననుసరించు స్వాతంత్ర్యమును, స్వేచ్ఛగా మతము నవలంభించుటకు, ఆచరించుటకు, ప్రచారము చేయుటకు జనులందరూ సమానంగా హక్కు కలిగి వున్నారు."**

సామాజిక పురోగమనంలో ప్రజలను సరైన ప్రాతిపదికన ఐక్యపరచే శక్తిగా మతం పాత్ర వహించినట్లు ఆధునిక చరిత్రలో దాదాపు కనిపించదు. పైగా దోపిడినిస మర్థించే అభివృద్ధి నిరోధకత్వమే ప్రబోధించింది. (మతాధిపతులుగా వున్నవారు ప్రగతి శీల పాత్ర తీసుకోవడం వేరు. ఒక వ్యవస్థగా మతం ఏమి చేసిందనేది సమస్య) పరలోకానికి సంబంధించిన విశ్వాసాల సముదాయమైన మతానికి ఇహలోకంలో ప్రభుత్వాలు, రాజకీయాల నిర్వహణలో ఎలాంటి పాత్ర వుండకూడదని విజ్ఞులు ఏనాడో అభిప్రాయపడ్డారు. ప్రాచీన కాలంలో భారతదేశంలో కూడారాజులు వ్యక్తిగతంగా ఎలాటి మతాన్ని అనుసరించినా, రాజ్య నిర్వహణలో మాత్రం ఆ ఛాయలు పడకుండా చూచారు.

పాత చరిత్రను అలా వుంచితే- ఆధునిక రాజ్యాంగాల నిర్మాణ సందర్భంలో మతరాజ్యాంగాలు- లౌకిక రాజ్యాంగాలు అని రెండు రకాలు స్పష్టంగా ఏర్పడ్డాయి. మతానికి - రాజ్య విషయాలకు సంబంధం లేకుండా చేసినవి. లౌకిక రాజ్యాంగాలైనాయి. "లోక

సంబంధమైన" అని దీని అర్థం. భారత దేశంలో మనం మతాతీత లౌకిక రాజ్యాంగాన్ని నిర్మించుకున్నాము. ఇది హిందూవుల ఔదార్య ఫలితమని బిజెపి వారు అంటుంటారు. పాకిస్తాన్‌లో ఇస్లాం అధికారమతంగావుందనిచెబుతుంటారు. కాని ఇండోనేషియా, అల్జీరియా వంటి ముస్లిం దేశాలు లౌకిక రాజ్యాలుగా వున్నాయి. నేపాల్ హిందూమత రాజ్యంగావుంది! క్రైస్తవులు అధికంగా వుండే అనేక యూరప్ దేశాలు అమెరికా లౌకిక రాజ్యాంగాలే కలిగి వున్నాయి. కనుక లౌకిక భావనకు ఆయా దేశాల మతాలకు సంబంధం లేదు.

భారతదేశంలో వివిధ మతాల వారు తరతరాలు సోదరత్వంతో మెలిగారు. ముస్లింరాజుల దండయాత్రలు రాజ్య విస్తరణ కోసం జరిగాయిగాని మతవ్యాప్తికోసం కాదు. ముస్లిం రాజుల క్రింద హిందూ సేనాధిపతులు, సైనికులు పనిచేశారు. హిందూరాజులక్రింద ముస్లిం సైనికులూ వున్నారు తప్ప మతానికి కట్టుబడలేదు. (చూడండి - అయోధ్యపై ప్రజాశక్తి సంచిక 6-12-1992) బ్రిటిష్ పాలకులు పెట్టిన చిచ్చు ప్రధానంగా హిందూ ముస్లింలను విడదీసింది. అయినా స్వాతంత్ర్య పోరాటకాలంలో అన్నిమతాల, జాతులవారు భుజం కలిపి పోరాడారు. క్రమంగా మత విభజన పెరిగి దేశ విభజనకు దారితీసింది. అయినా నవభారత రాజ్యాంగాన్ని మనం లౌకికమైనదిగానే రూపొందించుకున్నాము. జాతీయోద్యమ వారసత్వ ఫలితమిది.

భారత రాజ్యాంగంలోని 25వ అధికరణం ప్రజలు తమకు నచ్చిన మతాన్ని అనుసరించే హక్కును ఇచ్చింది. అయితే అది కొన్ని పరిమితులు కూడా విధించింది.

"ప్రజాశాంతికి, నైతికతకు, ఆరోగ్యమునకు, మరియు ఈ భాగము యొక్క ఇతర నిబంధనలకు లోబడి, అంతరాత్మ ననుసరించు స్వాతంత్ర్యమును, స్వేచ్ఛగా మతము నవలంభించుటకు, ఆచరించుటకు, ప్రచారము చేయుటకు జనులందరూ సమానంగా హక్కు కలిగి వున్నారు."

ఇందులో రెండు అంశాలు గమనించదగినవి. ఒకటి - మతావలంబనకొన్ని నిబంధనలకు లోబడి జరగాలి. రెండు - ఈ హక్కు అందరికీ సమానము.

కనుక తమ తమ విశ్వాసం తిరుగులేనిదని ఎవరూ వాదించే అవకాశం లేదు. అన్ని సమానమైనపుడు ఒకరి విశ్వాసం ఇతర మతవిశ్వాసాలకు భంగం కలిగించకూడదు. (అందుకే బిజెపి కూటమి ఈ దేశంలో హిందూ మతానికి పెద్ద పీట వేయాలని ముందు చెబుతుంటుంది.) అది ప్రజాశాంతికి భంగం కలిగించకూడదు.

ఈ అనుచ్ఛేదమునందున్న దేదియు అస్థిత్వములో నున్న ఏదేని శాసనము యొక్క అమలు భంగం కలిగించదు. లేక అట్టి శాసనము చేయుట నుండిరాజ్యమును నివారించదు" అని కూడా రాజ్యాంగం స్పష్టంగాచెప్పింది. అంటే మతాచరణకు సంబంధించిన ఆర్థిక, రాజకీయ, లౌకిక కార్యక్రమాలు అదుపులో పెట్టి శాసనాలు చేయడానికి హక్కు కల్పించింది.

మత వ్యాప్తికి సంస్థలను పెట్టుకోవడానికి, ఆస్తిపాస్తులు నిర్వహించడానికి 26వ అధికరణంద్వారానే హక్కు సంక్రమిస్తుంది. మైనారిటీలకు రాజ్యాంగం కొన్ని ప్రత్యేక రక్షణలు కూడాఇచ్చింది.

ఆచరణలో వివిధ మతాల సంస్థల మధ్య విభేదాలు, వివాదాలు వచ్చినపుడు అవి పరస్పర సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకోలేకపోతే న్యాయస్థానాలలో పరిష్కరించు కోవడం తప్ప మరో మార్గం లేదు. అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు వరకు వెళ్ళి పోరాడవచ్చు. అంతేగాని

ఆచరణలో వివిధ మతాల సంస్థల మధ్య విభేదాలు, వివాదాలు వచ్చినపుడు అవి పరస్పర సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకోలేకపోతే న్యాయస్థానాలలో పరిష్కరించు కోవడం తప్ప మరో మార్గం లేదు. అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు వరకు వెళ్ళి పోరాడవచ్చు. అంతేగాని కోర్టులకు విశ్వాసాలు అతీతం అనేందుకు ఎవరికి అధికారం వుండదు. వివిధ మతాలు, కులాలు, జాతులుగల దేశంలో ఎవరికీ వారు అలా పట్టుపట్టేటట్లయితే శాసనబద్ధ రాజ్య నిర్వహణ స్థానే అరాచకం చోటు చేసుకోకతప్పదు. అయోధ్యలో జరిగిందదే!

కోర్టులకు విశ్వాసాలు అతీతం అనేందుకు ఎవరికి అధికారం వుండదు. వివిధ మతాలు, కులాలు, జాతులుగల దేశంలో ఎవరికీ వారు అలా పట్టుపట్టేటట్లయితే శాసనబద్ధ రాజ్య నిర్వహణ స్థానే అరాచకం చోటు చేసుకోకతప్పదు. అయోధ్యలో జరిగిందదే!

దేవాలయాల ట్రస్టులు, ఆస్తిపాస్తుల వివాదాలపై కోర్టుకు వెళ్ళిన ఉదాహరణలు అనేకం. పూజారుల నియామకాలపైన, తొలగింపులపైన కూడా కోర్టులు ఉత్తర్వులిచ్చాయి. తిరుపతి దేవుని లడ్డు తయారీకి సంబంధించిన మిరాసీదార్లు కోర్టుకు వెళ్ళారు. తమిళనాడులోని ఒక ఆలయానికి చెందిన ఏనుగుకు నామాలు మూడుపెట్టాలా, నాలుగు పెట్టాలా అనేదానిపైన కూడా కోర్టు తీర్పు నివ్వాల్సి వచ్చింది. వక్ఫ్ ఆస్తులపైన, పంజాబులో గురుద్వారా కమిటీల ఎన్నికలపైన కూడా కోర్టులకు వెళ్ళారు. అయోధ్యలో ప్రస్తుత వివాదం గురించికూడా వందేళ్ళ నుంచి వాజ్యాలు నడుస్తూనే వున్నాయి. కనుక విశ్వాసాలు కోర్టులకు అతీతమనే వాదన అంగీకరించరానిది. ఇప్పుడు మసీదు అయింది రేపు ఎవరైనా పౌరుడి ఇంట్లో మా దేవుడు పుట్టాడని వాదనవస్తే అప్పుడు ఏమవుతుంది? ఒక పాఠశాల తమ మత విశ్వాసానికి అడ్డు వచ్చిందంటే ఏమవుతుంది? కనుక దేశానికి ఒక రాజ్యాంగం, ఒక అత్యున్నత న్యాయస్థానం వున్నాక ఎవరైనా దానికి లోబడి వుండాలి తప్ప ఇష్టానుసారం చేస్తామంటే కుదరదు. బిజెపి రాష్ట్ర ప్రభుత్వాలుగాని, ఎం.పి.లు, ఎం.ఎల్.ఎ.లు గాని ఈ రాజ్యాంగ సూత్రాల ప్రకారం ఎన్నికైన వారే. దానికి లోబడివుంటామని ప్రమాణం చేసినవారే. కాని దాన్ని ఇప్పుడు ఉల్లంఘించుతున్నారు. అయినా ముందే ఆ మాట చెప్పే ధైర్యంలేక యు.పి.లో తమ ప్రభుత్వ రక్షణ కోసం తప్పుడు అఫిడవిట్‌లు దాఖలు చేసి తప్పించుకున్నారు. "మీరు ఏది ఏమైనా రాముడి గుడి కడతామని బయట ప్రమాణం చేశారు, రాజ్యాంగానికి కట్టుబడతామని ఎం.పి.గా ప్రమాణం చేశారు మరిదేన్ని అమలు జరుపుతారు" అని కాంగీ ఎం.పి శ్రీ మణిశంకర్ అయ్యర్ 1992 జూలై 29న లోక్‌సభలో అద్వానీని ప్రశ్నించారు. "ఇక్కడ చేసిన ప్రమాణానికి- బయట చేసిన దానికి వైరుధ్యం వస్తే దేన్ని అమలు జరుపుతారని నన్ను అడిగారు. నేను మా పార్టీ రాజ్యాంగం పట్ల అనన్యమైన, అవిభాజ్యమైన విధేయత కలిగివుంటారు. ఈ విషయంలో ఎలాంటి మినహాయింపులు లేవు" అని అద్వానీ చెప్పారు. కాని ఆయనే రాముడి పుట్టుక విశ్వాసానికి సంబంధించినది అన్నారు. అయోధ్యలోని అరడజను దేవాలయాల పూజారులు రాముడు తమ గుడి వున్న చోటేపుట్టాడంటారట! బాబరీ మసీదు వున్న చోటగాక, దానికి కొంత దూరంలోని "రామచబూత్ర' రాముడి జన్మస్థలమని మరికొందరు మహంతులు 40వ దశకం నుంచి వాదిస్తున్నారు. ఇందులో ఏ విశ్వాసం నిజమని ఎవరు చెబుతారు? మా మాటే అమలు జరగాలంటే ఎలా సాధ్యమవుతుంది? వివాదాస్పదమైన విషయాలలో న్యాయస్థానాల తీర్పే అంతిమమవుతుంది. అంతకుమినహా మరో ఆచరణీయ కూడా పరిష్కారం లేదు. విశ్వాసాలు అతీతమనే వాదనను అంగీకరించే ప్రసక్తేవుండదు.

తమ విశ్వాసాలు కోర్టులలో చెల్లవని స్పష్టంగా తెలుసుగనకనే ఆర్.ఎస్.ఎస్. కూటమి ఈ వాదన చేస్తోంది. అయోధ్యలో అది బలప్రయోగానికి పాల్పడింది. ఇలాటి చర్యలను అనుమతిస్తే దేశంలో ఆటవిక రాజ్యమేర్పడడాన్ని అనుమతించినట్లే అవుతుంది. కనుక అయోధ్యలో వారు చేసిన అఘాయిత్యాన్ని చక్కదిద్ది, అంగీకృత పద్ధతిలో మసీదు పునర్నిర్మించడం ద్వారా రాజ్యం తన ఉనికిని నిరూపించుకోవాలి. భవిష్యత్తులో ఇలాంటి ఘటనలు మళ్ళీ జరగకుండా జాగ్రత్త పడాలి.

# అనర్ధదాయక చర్యకు

# అంతర్జాతీయ పర్యవసానాలు

అయోధ్యలో వివాదాస్పదమైన బాబరీ మసీదును బల ప్రయోగంతో కూల్చివేస్తే ప్రపంచ వ్యాపితంగా దాని ప్రభావం పడుతుందని పరిశీలకులు ముందే ఊహించారు.

గత రెండు దశాబ్దాలలో కొన్ని శక్తులు ఇస్లామిక్ ఛాందసం రెచ్చగొట్టిన సంగతి తెలిసిందే. అందులో ఇరాన్‌ది అగ్రస్థానం. మన ప్రక్కనే వున్న పాకిస్తాన్ ఎప్పుడూ భారత వ్యతిరేకతకు మతాన్ని ముసుగు చేసుకుంటుంది. బి.జె.పి. చర్యలు సరిగ్గా ఆశక్తులకే ఆయుధాలు సమకూర్చాయి. భారత దేశంలో ముస్లిం మతానికి రక్షణ లేదని తమ దేశ ప్రజలను రెచ్చగొట్టే వీలు కల్పించాయి.

పాకిస్తాన్‌లో ఇప్పుడు ఆ శక్తులే అయోధ్య ఘటనను సాకుగా చేసుకుని ఆలయాలపైన దాడులు చేశారు. భారత హైకమీషనర్ కూడా దాడికి గురైనారు. దాదాపు యాభై భారతీయ కుటుంబాలు ఢిల్లీ చేరుకున్నాయి. బంగ్లాదేశ్‌లో కూడా ఇలాటి ఘటనలు జరిగాయి. ఇలాటి దాడులు ఎక్కడ ఎవరు జరిపినా ఖండించవలసిందే. పాకిస్తాన్ ప్రభుత్వం కూడా ఈఘటనకు వ్యతిరేకంగా బంద్‌కు పిలుపునిచ్చి పరిస్థితిని మరింత తీవ్రం చేయడం శోచనీయం. దీనిపై భారత ప్రభుత్వం ఇప్పటికే అధికారికంగా విచారం తెలిపింది.

అయోధ్య సమస్యపై అంతర్జా[illegible]ంగా ఇస్లామిక్ దేశాల కూటమి (ఐ.ఓ.సి) చాలాకాలంగా నిరసన తెల్పుతూ వచ్చింది. ఇరాన్, పాకిస్తాన్ దీనిపై బహిరంగ వ్యాఖ్యానాలు చేశాయి. ఇది అంతర్గత వ్యవహారం అని మనం సరిగ్గానే వాదించాము.

అయోధ్య సమస్యపై అంతర్జాతీయంగా ఇస్లామిక్ దేశాల కూటమి (ఐ.ఓ.సి) చాలాకాలంగా నిరసన తెల్పుతూ వచ్చింది. ఇరాన్, పాకిస్తాన్ దీనిపై బహిరంగ వ్యాఖ్యానాలు చేశాయి. అలీనోద్యమ దేశాలలో చాలా భాగం ముస్లిం దేశాలే. అయినా అవి భారత్‌కు స్నేహంగా వున్నాయి. పాకిస్తాన్‌ను పచ్చిగా ప్రోత్సహించింది అమెరికా మాత్రమే! ఇప్పుడు అయోధ్య ఘటనతో ఆ ప్రతిష్టకు తీరని నష్టం కలిగింది.

గత బుధవారం దుబాయ్‌లో ఆలయాన్ని, గురుద్వారాను తగులబెట్టారు. కాని వారు అరబ్‌లుకారని, భారతీయులేనని వెల్లడైంది! బహరీన్‌లో చాలా నిగ్రహం వ్యక్తమైంది. పాకిస్తాన్‌లో వలె గల్ఫ్ దేశాలలో భారత వ్యతిరేక చర్యలు ప్రజ్వరిల్లలేదు. సౌదీ అరేబియా ప్రభుత్వం ఈ ఘటనలను ఖండించినా ముస్లిం ఛాందసులను బలపరచడానికి నిరాకరించింది. ఈజిప్టు, యెమెన్, జోర్డాన్, ట్యూనిషియా ప్రభుత్వాలు కూడా ఖండించినా, భారతదేశం వల్ల వ్యతిరేకత వ్యక్తమవకుండా జాగ్రత్తపడ్డాయి.

అరబ్ దేశాలన్నిటా హిందూ వ్యతిరేకత వుందని బి.జె.పి.చెబుతుంటుంది. కాని బహరీన్, ఒమన్‌వంటి దేశాలలో పాలకులు భారతీయుల క్లబ్బులు వగైరాలకే కాక ఆలయాలకు కూడా స్థలాలు ఇవ్వడం జరుగుతుంటుంది. మత ప్రాతిపదికన అల్లర్లు రెచ్చగొడితే వారు చాలా తీవ్రంగా తీసుకుంటారు.

అయినా ఈఘటనపై ప్రభావాన్ని తక్కువ అంచా వేయలేము. మాజీ విదేశాంగమంత్రి శ్రీ నట్వర్ సింగ్ మాట్లాడుతూ అయోధ్య ఘటనల పర్యవసానాలు చాలా తీవ్రంగా వుంటాయని చెప్పారు. "పాకిస్తాన్ దీనిపై చాలా గొడవ చేస్తోంది. మరో 50 ముస్లిం దేశాలు కూడా మనలను విమర్శిస్తాయి. జరిగిన దాన్ని సర్ది చెప్పలేక మన దౌత్యవేత్తలు నానా తంటాలు పడాలి" అని ఆయన అన్నారు. ఇప్పటి వరకు కాశ్మీర్ విషయంలోనే పాక్ కుంపటిని ఎదుర్కొంటున్న ఇండియాకు ఇప్పుడు మరో సమస్య తోడైంది. వచ్చే నెలలో పాకిస్తాన్ ఐక్యరాజ్యసమితి భద్రతామండలిలో సభ్యురాలవుతోంది. రెండేళ్ళు అది ఆ స్థానంలో వుంటుంది. కనుక ఇండియాకు ఇది చెప్పుకోదగిన సమస్యే.

అమెరికా ప్రభుత్వ ప్రతినిధి అయోధ్యలో మసీదు కూల్చివేతను ఖండిస్తూనే సమస్యను భారత రాజ్యాంగ పరిధిలో పరిష్కరించుకోవడానికి ప్రతి ఒక్కరూ తోడ్పడాలని కోరారు. ఈ విషయంలో నిగ్రహం పాటించాల్సిందిగా పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లకు కూడా అమెరికా సలహా ఇచ్చింది. "వాల్ స్ట్రీట్ జర్నల్" వంటి అమెరికా పత్రికలు బి.జె.పి. నాయకుడు అద్వానీ చర్యలను విమర్శించాయి

బ్రిటన్‌లో భారతీయ జనాభా గణనీయంగా వుంటారు. వారిలో హిందూ, ముస్లింలు సిక్కులు కూడా వున్నారు. అందుకే ఈ ఘటనలు అక్కడ ఘర్షణలకు దారితీశాయి. బ్రిటిష్ ప్రభుత్వం మాత్రం భారత్‌కు సంఘీభావం ప్రకటించింది.

శ్రీలంక కూడా ఈ విషయంలో నిగ్రహాన్ని ప్రదర్శించింది. శ్రీలంక అధికార ప్రసార సాధనాలు పి.వి. ప్రభుత్వాన్ని బలపరచేలా వార్తలు ఇచ్చాయి.

బంగ్లాదేశ్ ప్రధాని ఖలేదా జియా అయోధ్య పరిణామాలు ముస్లింలకు సంతృప్తికరమైన రీతిలో పరిష్కారం కాకపోతే దక్షిణాసియాపై చాలా ప్రభావం చూపుతాయన్నారు, అది భారత దేశ అంతర్గత సమస్య అయినా, తమ దేశంలోని ముస్లింలకు చాలా కష్టం కలిగించిందని ఆమె అన్నారు. అయితే భారతదేశంతో సంబంధాలు పెంపొందాలనే వైఖరిని పునరుద్ఘాటించారు.

పాకిస్తాన్ విదేశాంగ శాఖ ప్రతినిధి కూడా భారత్‌తో సాధారణ సంబంధాలు కొనసాగాలనే తాము కోరుతున్నామని చెప్పారు. పాకిస్తాన్ ప్రధాని నవాజ్ షరీఫ్ ధ్వంసమైన ఆలయాలు ప్రభుత్వ ఖర్చుతో పునర్నిర్మిస్తామని ప్రకటించారు. అయితే అయోధ్య పరిణామాల వల్ల ఏర్పడిన అనిశ్చిత స్థితి ఇంకా కొనసాగుతోందని అంటూ బాబ్రీ మసీదును పునర్నిర్మించాలని, ముస్లిం ప్రార్థనా స్థలాలకు రక్షణ కల్పించాలని కోరారు. ప్రభుత్వం కట్టడం రక్షణకు చర్యలు తీసుకోనందుకు విచారం వెలిబుచ్చారు. ఐరాస ప్రధాన కార్యదర్శి బుత్రోస్ ఘలి కూడా విచారం తెలిపారు.

అయోధ్య ఘటనల వల్ల ప్రజ్వరిల్లిన మత కల్లోలం పూర్తిగా భారతదేశ అంతరంగిక విషయం అనే స్పష్టమైన వైఖరిని చైనా తీసుకున్నది. పొరుగుదేశంగా తాము భారత్ ఈ సమస్యను సవ్యంగా పరిష్కరించుకుని, సుస్థిరతను కాపాడుకోగలదని ఆశిస్తున్నట్లు చైనా విదేశాంగ శాఖ ప్రతినిధి చెప్పారు.

ఆర్.ఎస్.ఎస్.వారు తామే అసలు సిసలు దేశభక్తులమని, జాతీయతకు వారసులమని నిరంతరం చెప్పుకుంటారు. కాని చరిత్రను ఒక్కసారి తిరగేస్తే మతోన్మాదశక్తులు ప్రతి దశలోనూ ప్రమాదకరంగానే వ్యవహరించాయని తేటతెల్లమౌతుంది. విద్వేషాన్ని రగిలించే తమ ప్రయత్నాలకు అడ్డం వచ్చే వ్యక్తులు ఎవరినైనా నిర్దాక్షిణ్యంగా హతమార్చేందుకు, అవసరమైతే వేలాదిమందిని నెత్తురుటేరుల్లో ముంచేందుకు వారు వెనుకాడరు. రాజకీయ భావాలమాట ఎలావున్నా దేశంలో మత సామరస్యాన్ని పెంపొందించడానికి ఎనలేని కృషి చేసిన మహానాయకుడు గాంధీజీ. ఆయన తన ఆచరణలోనూ, తాత్వికచింతనలోనూ అచ్చమైన హిందూవాది. సనాతన భావాలనేకం వ్యక్తంచేసిన వ్యక్తి. అలాటి వ్యక్తిని అమానుషంగా హత్యచేసేందుకు ఆర్.ఎస్.ఎస్.హిందూ మతోన్మాదులు వెనుకాడలేదు. బాబరీ మసీదు కూల్చివేత అనంతర పరిస్థితిని చాలా మంది గాంధీజీ హత్యానంతర స్థితితో పోలుస్తున్నారు. అందుకే ఈ సందర్భంగా గాంధీని హత్యచేయడంలో మతోన్మాదులు ఎంత కిరాతంగా వ్యవహరించారో మననం చేసుకోవాలి. ఈ శక్తుల ఆటకట్టించి, ఆయన ప్రాణాలు కాపాడ్డంలో నాడు కొత్తగా గద్దెక్కిన కాంగ్రెస్ పాలకులు ఏలీనా అలసత్వమూ ప్రదర్శించారు. అలాటి అలసత్వము అవకాశవాదాలే ఈనాడూ దేశానికి ముప్పుగా తయారైనాయి.

బ్రిటిష్‌వారి కుట్ర ఫలితంగా దేశం రెండుముక్కలై, హిందూ ముస్లింల మధ్య ద్వేషానలం బుసలు కొడుతున్న కాలమిది. దేశ విభజన ఒప్పందం ప్రకారం పాకిస్తాన్‌కు ఇవ్వవలసిన 55కోట్లరూపాయలు



వెంటనే యివ్వాలని గాంధీ పట్టుపట్టారు. నిరాహార దీక్ష చేయు మైనారిటీలకు, మహిళలకు రక్షణ కోరారు. ఇరుమతాలవారిలో స్వార్థపరశక్తులు చెలరేగాయి. భారతదేశంలో హిందూ మతతత్వవాదులు విషం గక్కసాగారు.

నాధూరాం వినాయక్ గాడ్సే ఆర్.ఎస్.ఎస్.కార్యకర్త పూనాలో " హిందూరాష్ట్ర" పత్రిక 1947 నవంబర్ 1న స్థాపించాడు. నారాయణ్ ఆప్టే(34సం॥ ) అతని సహచరుడు. ఆగస్టు 15 తర్వాత పూనా పోలీసులు వారి పైన, ఇతర మతోన్మాదులపైన నిఘావేసి వుంచారు. అందుకే ఆ రోజుకూడా ఒక సి.ఐ.డి. కిటికీలోంచి గాడ్సే ప్రసంగం పొంచి వినసాగాడు.

" భారతదేశ విభజన తన శవం పైనే జరగాలని గాంధీ చెప్పాడు. భారతదేశం విభజింపబడింది. కానీ గాంధీ బతికే వున్నాడు" అని గాడ్సే వ్యాఖ్యానించాడు. తర్వాత హిందువులపై జరుగుతున్న దౌర్జన్యాలను ఏకరువు పెట్టి ముస్లిములపైన, మతసామరస్యం బోధిస్తున్న గాంధీపైన విషంగక్కాడు. ఆ వెంటనే సభలో ఉన్మాద పూరితమైన నినాదాలు మారుమ్రోగాయి.

పూనా మొదటనుంచి హిందూ మతోన్మాదులకు కేంద్రంగా వుంది. సావర్కర్ వారికి నాయకుడు. బ్రిటిష్ అధికారులను చంపి, వీరుడుగా పేరు పొందిన వ్యక్తి సావర్కర్. అయితే హిందూ ముస్లిం ఐక్యత అనటం గిట్టక కాంగ్రెసుతో తెగతెంపులు చేసుకున్నాడు. "హిందూత్వాన్ని" చేపట్టాడు. హిందూ మహాసభకు అధ్యక్షత వహించారు. ఆర్.ఎస్.ఎస్.తో సంబంధాలు పెట్టుకున్నాడు. 1942 మే 15న రహస్యంగా పనిచేసే "హిందూరాష్ట్రదళ్" స్థాపించాడు. మొదట గాంధీజీని అనుసరించి గాడ్సే తరువాత సావర్కార్ శిష్యుడైనాడు. పాకిస్థాన్‌కు భారతదేశం చెల్లించవలసిన 55కోట్ల రూపాయలు ఇచ్చేంతవరకు తాను నిరాహారదీక్ష చేస్తానని గాంధీజీ ప్రకటించడం గాడ్సే, ఆప్టే భరించలేకపోయారు. జనవరి 13న ఈ వార్త వచ్చింది. ఆరోజే హిందూ మతోన్మాదులు నలుగురు హిందూ రాష్ట్ర కార్యాలయంలో రహస్యంగా సమావేశమయినారు. అయితే అప్పటివరకు వారిపై నిఘావేసిన పోలీసు ఉద్యోగి పైవారి ఉత్తర్వుల మేరకు నిఘాను విరమించాడు. సరిగ్గా ఆరోజు సమావేశంలోనే గాడ్సే గాంధీని అంతమొందించాలనే తన దుష్టలక్ష్యాన్ని ప్రకటించాడు. మదన్‌లాల్‌పహ్వ అందుకు ఆమోదం తెలిపాడు. వెంటనే వారు బాడ్గే అనే దుకాణాదారునివద్ద ఆయుధాలు సంపాదించారు. అతని నౌకరుకూడా వీరితో కలిశాడు.

హిందూసన్యాసిగా తిరిగే దిగంబర్ బ్గాడే పోలీసు రికార్డుల్లో పేరు మోసిన వ్యక్తి. అతను రహస్యంగా ఆయుధాలమ్మేవాడు. ఆప్టేతో అతనికి ఎప్పటినుంచో సంబంధం. అతనుకూడా ఈహంతక ముఠాతో కలిశాడు.

బొంబాయి వెళ్ళి ఒక దేవాలయం వెనుక ఆయుధాలు కాల్చడం ప్రాక్టీసు చేశారు. పథకాలు సిద్ధం చేసుకున్నారు. ఢిల్లీలోని బిర్లా మందిరం గల హిందూమహాసభ భవన్‌ను తమ కార్యక్రమాల కేంద్రంగా చేసుకున్నారు. ముందే తమ వాళ్ళు నలుగురిని ఆయుధాలతో ఢిల్లీకి పంపించారు.

ఈలోగా నిరాహారదీక్ష ఫలితంగా గాంధీస్థితి రోజు రోజుకు ఆందోళనకరంగా తయారైంది. ఆఖరుకు కోమాలోకి వెళ్ళే స్థితి ఏర్పడింది. అందరి ఒత్తిడిపై జనవరి 18న ఆయన దీక్ష విరమించారు. జనవరి 19న గాడ్సే తమ్ముడు గోపాల్ గాడ్సే గాంధీని, పరిసరాలను గమనించవచ్చాడు. అదే రోజు వారంతా కన్నాట్ సర్కస్‌లోని మెరీనా హోటల్‌లో 40వ నెంబర్ రూమ్‌లో సమావేశమై 20వ తేదీ మధ్యాహ్నం గాంధీని హత్యచేయాలని నిర్ణయించారు. ఆరోజు ఉదయమే వెళ్ళి గాంధీ ప్రార్థన జరిపే ప్రదేశాన్ని, అక్కడ భవనాలు పరిసరాలను పరిశీలించి వచ్చారు. నౌకర్ల గది కిటికీలో నుంచి కాల్చాలని నిర్ణయించారు. ఆయింటివాడికి పదిరూపాయలు యిచ్చి తమను ఉండనివ్వమని కోరారు.

ఆరోజు మధ్యాహ్నం మదన్‌లాల్, బాడ్గే, కార్కే, గోపాల్‌గాడ్సే, ఆప్టే, నాదురాంగాడ్సేలు అక్కడ చేరారు. బాడ్గేగాంధీకి ఎదురుగా వుండాలి. గోపాల్‌గాడ్సే పొగగొట్టం మీదుగా నౌకర్ల ఇంటిపైకి ఎగబాకాడు. అయితే అంచనాలు తప్పటంవల్లవారు ఆరోజు పేల్చిన బాంబు గాంధీని ఏమీచేయలేదు గాని అంతా గందరగోళం చెలరేగింది. మదన్‌లాల్‌ను పోలీసులు పట్టుకున్నారు. తక్కిన వారు తప్పించుకున్నారు.

గాంధీ పై హత్యాప్రయత్నం గురించిన సమాచారం జనవరి 20 సాయంత్రమే డి.ఐ.జి.డి.డబ్ల్యు.మెహ్రాకు చేరింది. దొరికిన మదన్‌లాల్‌ను చావబాది నిజం రాబట్టమని చెప్పి ఆయన సరిపెట్టుకున్నాడు. కేంద్ర నిఘావిభాగం బాధ్యుడైన డి.జి.సంజీవి ఆసంగతి తనకు వదలి పెట్టమని మెహ్రాకు ఆదేశించాడు. పోలీసుల బాదలు భరించలేని మదన్‌లాల్ తమ దళం గురించి చాలా వివరాలు చెల్పాడు. కిర్కే పేరు బయట పెట్టాడు. గాడ్సే పేరు చెప్పకపోయినా మరాఠీబాషలో వెలువడే ఒక హిందూపత్రిక సంపాదకుడికి దీనితో సంబంధముందని చెప్పారు. వెంటనే పోలీసులు వెళ్ళిహిందూమహాసభ ఆఫీసు, మెరీనా హోటల్‌లో గాలించారు. కాక్రే తనకు రూము ఇచ్చిన బాడ్గే నౌకరుతో సహా పూనాకు పయనమై వెళ్ళాడు. తక్కిన వారు మారుపేర్లతో పాత ఢిల్లీలోని ఒక హోటల్‌లో రూములు తీసుకున్నారు. గాంధీని విమర్శించే ఒక డాక్యుమెంటు దొరికింది. హిందూ మహాసభకు చెందిన అశుతోష్‌లహిరి చేసిన ప్రకటన అది.

## అనేక ఆధారాలు లభ్యం

తొలిరోజు జరిపిన ఇంటరాగేషన్‌లోనే పోలీసులకు అనేక ముఖ్యమైన ఆధారాలు దొరికాయి. కుట్ర బయటపడింది. కాని పై అధికారులు దాన్ని గట్టిగా కొనసాగించేందుకు పూనుకోలేదు. గద్దెక్కిన గాంధీజీ శిష్యులుకూడా పట్టించు కోలేదు. 21న గోపాల్‌గాడ్సే, కాక్రేలు దొరికారు. అయితే గాంధీ తన ప్రార్థనా స్థలంలో సాయుధ రక్షణ పెట్టేందుకు అంగీకరించ లేదు. మదన్‌లాల్‌ను విడిచి పెట్టమని కూడా ఆయన కోరారు.

మరోవంక పోలీసు అధికారి సంజీవి బొంబాయి వివరాలు సేకరించేందుకు ఇద్దరిని అక్కడకు పంపించారు. అయితే వారుగాడ్సే, ఆప్టేలను బయట పెట్టేందుకు కావలసిన పరిశోధనా వివరాలు తీసుకుపోలేదు. పైగా బొంబాయి డిప్యూటీ పోలీసు కమీషనర్ జిమ్మీడి నగర్‌వాలా పరిశోధన జరిపి అనంతరం సావర్కార్‌ను అరెస్టు చేయాలని భావించాడు కాని ఆనాటి బొంబాయి హోంమంత్రి మొ... ...మ్ అందుకు అంగీకరించలేదు. అయినా సిగ... ...పడక పరిశోధన కొనసాగించా... పూనా ను... ...గువచ్చారు గనక, ఇందుకు సంబంధించిన


గాంధీజీ హంతకుడు నాథూరాం గాడ్సే

సమాచారం కోరుతూ పూనా పోలీసులకు రాశాడు. వారు కొంత హడావుడి చేశారుగానీ, హంతకుల ముఠాకు ఆయుధాలు ఇచ్చిన వ్యక్తిని పట్టుకోడంలో అప్రమత్తత ప్రదర్శించారు.

## 54 పేజీల ప్రకటన

జనవరి 23న మదన్‌లాల్ అన్ని వివరాలు బయిట పెట్టాడు. 54పేజీల ప్రకటన చేశాడు. 24 సాయంత్రం వరకు అదిసాగింది. ఢిల్లీ పోలీసు అధిపతి సంజీవిగనక పూనాపోలీసులను విచారించివే భావి హంతకులను పట్టుకోగలిగేవాడు. కాని ఆయన, ఇతర పోలీసులు ఎంతో అలసత్వం, అజాగ్రత్త ప్రదర్శించారు. (ఈ విషయాలు విచారించేందుకు 1960లో జస్టిస్ జి.కె.ఎల్.కపూర్ అధ్యక్షతన ఒక విచారణ కమీషన్ నియమించారు. దాని విచారణ వివరాలు ఆరు సంపుటాలుగా 1969 సెప్టెంబరు 30న ప్రకటించారు) ప్రభుత్వాధినేతలు కూడా పెద్ద శ్రద్ధ ప్రదర్శించ లేదు. దాంతో గాడ్సే, ఆప్టేలు మళ్ళీ తమ దుర్మార్గ పథకం కొనసాగించారు. ఈసారి గురితప్పకుండా వుండాలని బిర్లా మందిర్ వెనుక మళ్ళీ ప్రాక్టీస్ కొనసాగించారు. ఈ సారి కాల్చేబాధ్యత గాడ్సేకు అప్పగించారు.

1948 జనవరి 30న గాంధీ ఎప్పటిలాగానే ఉదయాన్నే ప్రార్థనలు చేశారు. నెహ్రూ-పటేల్‌ల మధ్య వివాదాన్ని సర్దుబాటు చేసేందుకు సాయంత్రం చర్చలు జరిపారు.

అప్పటికే హంతకులు గాంధీ గదికి వెనుకతచ్చాడుతున్నారు. అయిదునిముషాల్లో వారు గాంధీజీ ప్రార్థన జరిపే బిర్లాహౌస్‌కు వెళ్ళారు. వారిని ఎవరూ తనిఖీ చేయలేదు. గాడ్సే తుపాకీతో సహా స్వేచ్ఛగా లోపల ప్రవేశించాడు.

## దారుణహత్య

గాంధీజీ మను, అభల భుజాలపై చేయివేసి నడచివచ్చారు. అప్పటికే ఆలస్యం కావటంతో గాంధీ హడావుడిగా నడచివస్తున్నారు. ఇంతలో కిర్కే ఎదురేగి "బాపూజీ, బాపూజీ" అని పిలిచారు. గాడ్సే దూరంగా జేబులో చేయి పెట్టుకుని తుపాకీ పట్టుకున్నాడు. అకస్మాత్తుగా చేతిలోకి తుపాకీ తీసుకున్నాడు. ఒక్కసారి కిందకువంగి "నమస్తే గాంధీజీ" అన్నాడు. అతను గాంధీ పాదాలు ముద్దుపెట్టుకోదలచాడనుకున్న మనూగాంధీ "తమ్ముడూ, బాపూజీకి ఇప్పటికే పదినిముషాలు ఆలస్యమైంది" అని నచ్చ చెప్ప బోయింది. అంతే గాడ్సే ఆమెను హఠాత్తుగా ప్రక్కకు నెట్టేసి, క్రూరంగా గాంధీజీ పై మూడుసార్లు కాల్చాడు. "హేరామ్" అంటూ ఆయన ప్రాణాలు వదిలాడు అది జనవరి 30 సాయంత్రం 5-17ని. హిందూమతాన్ని పూర్తిగా విశ్వసిస్తూనే మతసామరస్యానికై కృషిచేసిన మహాత్ముడు ఆవిధంగా హిందూమతోన్మాది చేతుల్లో ప్రాణాలు వదిలాడు.

గాంధీ హత్యతో ప్రపంచం నిర్ఘాంతపోతే ఆర్.ఎస్.ఎస్.వారు మాత్రం అనేక చోట్ల ఆనందంతో ప్రదర్శనలు జరిపారు. మిఠాయిలు పంచిపెట్టారు.

నారాయణ్‌ఆప్టే, నాథూరాంగాడ్సే, మదన్‌లాల్, కాక్రే, సావర్కార్, ప్రసూర్, దిగంబర్‌బడ్గే ఆయన నౌకరు ఈ ఎనిమిది మందిపై 1948 మే 27న విచారణ ప్రారంభమైంది. గాడ్సే తానే హంతకుడినని చెప్పాడు. చివరకు ఏడుగురికి శిక్షలు పడ్డాయి. సావర్కారును మాత్రం సాక్ష్యాలులేక వదిలిపెట్టారు.

నాథూరాం గాడ్సే, నారాయణ్ ఆప్టేలకు మరణశిక్ష విధించారు. 1949 నవంబర్ 15న వారిని ఉరితీశారు.

అయితే అంతటితో మతోన్మాదుల కుట్రలు అంతంకాలేదు. నాథూరాం గాడ్సే గాంధీజీని చంపటాన్ని చెపుతూ కోర్టులో చేసిన ప్రకటనను ఈనాటికి హిందూ మతోన్మాద ఆర్.ఎస్.ఎస్ వారు పుస్తకాల షాపుల్లో నిస్సిగ్గుగా సగర్వంగా అమ్ముకుంటున్నారంటే మానవత్వానికి అంతకన్నా కళంకం ఏముంది?

("ఫ్రీడం ఎట్‌మిడ్‌నైట్" ఆధారంగా)



# మసీదులు కూల్చి మందిరాలు కట్టడమేనా?

భారతీయ జనతాపార్టీ వారు నిరంతర ప్రచారం చేసే వాదనలలో ఈ దేశంలో తాము తప్ప మిగిలినవ రాజకీయ పార్టీలన్నీ కుహన లౌకికవాద (సూడో సెక్యులర్) పార్టీలు అనేది కూడా ఒకటి. సెక్యులరిజం అనేదాని గురించి రకరకాలు గందరగోళాలను కూడా ఆ పార్టీ ప్రచారంలో పెడుతోంది. ముస్లింల ఓట్ల కోసం ఈ కుహన లౌకిక వాదాన్ని అనుసరిస్తున్నారు అనేది ఆ పార్టీ ప్రధాన ఆరోపణ. కొన్ని పత్రికలు కూడా ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ అందుకు వంతపాడుతుంటాయి. మన రాజ్యాంగంలో కూడా సెక్యులరిజం అనే మాటను 1976లో పొందుపరచినప్పటికీ, దాని అములోనూ, అర్థం చెప్పడంలోనూ అనేక అవకతవకలు జరిగిన కారణంగానే జన బాహుళ్యానికి సరైన అవగాహన లేకుండా పోతున్నది. ఈనాడు చెలరేగే మతోన్మాద శక్తుల దాడిని తిప్పికొట్టాలంటే ముందు "సెక్యులరిజం" అంటే ఏమిటో సవ్యంగా తెలియజెపి, దాని అమలుకు ప్రయత్నించాలి. లేకపోతే అయోధ్య ఘటనల వంటివి పునరావృతమవుతూనే వుంటాయి.

1990లో శ్రీ వి.పి. సింగ్ ప్రధానిగా వుండగా జాతీయ సమగ్రతామండలి సమావేశం జరిగింది. ఆ సమావేశంలో బి.జె.పి. నాయకుడు శ్రీ ఎల్.కె. అద్వానీ మాట్లాడుతూ "సెక్యులరిజం అనే మాటకు అర్థం ఏమిటనే దానిపై జాతీయ చర్చ జరగాలని" డిమాండ్ చేశారు. అంతకు రెండేళ్ళ ముందు తన హయాంలో జరిగిన ఎన్.ఐ.సి. సమావేశంలో మాట్లాడుతూ నాటి ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ మతతత్వం అంటే ఏమిటనే దానికి సరైన నిర్వచనం కావాలని అన్నారు. నిజానికి మతతత్వం, లౌకిక తత్వం అనే రెండింటి అర్థమూ స్పష్టంగానే వున్నా, ఈ విధంగా కొత్త చర్చ లేవనెత్తడంలో వారి ఉద్దేశ్యాలు స్పష్టమే. లౌకికతత్వాన్ని సహించలేని ధోరణి అద్వానీదైతే, మతతత్వంతో రాజీపడే ధోరణి రాజీవ్‌ది. అందుకే వారుభయులు ఆ ప్రశ్న లేవనెత్తారు. ఇలాటి దృష్టితో కాకపోయినా, అన్ని మతాల వారిని ఆకట్టుకోవాలనే తాపత్రయంతో కొంతమంది నాయకులు లౌకికతత్వం అంటే అన్ని మతాల పట్ల సమాన దృష్టి అని చెబుతుంటారు. అదే భారతీయ సెక్యులరిజమని శ్రీమతి ఇందిరాగాంధీ అనేవారు. (అలా అంటూనే ఆమె వివిధ రకాల మతతత్వాలతో రాజీపడుతూ వచ్చారు) లౌకికతత్వానికి కట్టుబడి వున్నామని అంటూనే ప్రధానులు, రాష్ట్రపతులు అధికార హోదాలో గుళ్ళు, గోపురాలు తిరగడమే గాక దైవాంశ సంభూతులుగా చెప్పబడే సాయిబాబా వంటివారి ముందు సాష్టాంగపడుతుంటారు. ఇవన్నీ సెక్యులరిజంగానే చలామణీ అవుతున్నాయి.

కనుక ముందు ఈ భావనకు సరైన అర్థాన్ని నెలకొల్పుకోవడం అవసరం.

మన రాజ్యాంగం పీఠిక యిలా ప్రారంభమవుతుంది:

"భారతదేశ ప్రజలమైన మేము ఇండియా సార్వభౌమిక సోషలిస్టు సెక్యులర్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌గా ఏర్పడాలని, పౌరులందరికి సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయం, సౌహార్థత కల్పించాలని, వ్యక్తిగౌరవానికి హామీ సమకూర్చాలని, దేశ సమైక్యత, సమగ్రతలకు సమాన హోదా అవకాశాలు అందించాలని, ఇది అందరిలో పెంపొందించాలని నిర్ణయించుకొని ప్రకటించుచున్నాము"

లౌకికతత్వమంటే ఏమిటి అనే దానికి 1973లో సుప్రీంకోర్టు ఇచ్చిన ఒక ప్రసిద్ధమైన తీర్పులో వివరణ వుంది. సుప్రీంకోర్టు ఆ తీర్పులో ఇలా పేర్కొంది:

"భారత రాజ్యాంగం లౌకిక రాజ్యం కావాలని చెబుతున్నది. రాజ్యాంగ యంత్రానికి అధికార మతమేదీ లేదు. తమకు నచ్చిన ఏమతాన్నయినా అనుసరించేందుకు, ఆచరించేందుకుగాను అందులో గల నిబంధనలకు పూర్తిపూచీకత్తు వుంది. రాజ్యాంగం వ్యక్తికి మత, అంతరాత్మ స్వాతంత్ర్యం ఇవ్వడమేకాదు. ఏ మతాన్ని అనుసరించని వారికి కూడా స్వాతంత్ర్యం కల్పిస్తున్నది. మత ప్రాతిపదికన రాజ్యాంగయంత్రం ఎలాటి వివక్ష ప్రవర్తించరాదని అది స్పష్టం చేస్తోంది. మత వ్యత్యాసాలతో నిమిత్తం లేకుండా అందరికీ ఒకే పౌరసత్వం కల్పిస్తోంది. పీఠిక కూడా రాజ్యాంగంలో సెక్యులరిజం అనేపదం 1846లో జార్జి జాకబ్ హోల్యాక్ అనే ఆయన సృష్టించారు. సహజ నైతికతపై ఆధారపడిన నీతి సూత్రమిది. వాడుకలో వున్న అన్ని మతాలకు, పరలోక సంబంధమైన అంశాలకు భిన్నమైన దృక్పథమిది.

"మతానికి, చర్చికి సంబంధంలేని ప్రాపంచిక విషయాలకు సంబంధించిన" అని ఆక్సఫర్డ్ డిక్షనరీ సెక్యులరిజం అనే పదానికి అర్థం ఇచ్చింది. "మతాతీత", "మత ప్రసక్తిలేని" అనే ఈ పదాన్ని "సర్వమత సమానత" అనే అర్థంలో వాడుకలే అన్ని అనర్థాలకు దారి తీసింది. ఎవరైనా వ్యక్తి అన్ని మతాలను సమానంగా చూడవచ్చునేమోగాని ఒక రాజ్యాంగ యంత్రం ఆ విధంగా చేయగలగడం ఆచరణ సాధ్యం కాదు. అధికారంలో వున్న వారి అవసరాల మేరకు అన్ని మతాల పట్ల సమాన ఆదరణ అంటూనే అటో ఇటో మొగ్గే అవకాశంఎప్పుడూ వుంటుంది.

ఉదాహరణకు మన ఆర్.టి.సి.బస్ స్టాండ్‌లు ప్రభుత్వ ఆస్థి. కాని అక్కడ వెంకటేశ్వర స్వామి ఆలయాలు వుంటాయి. ఆకాశవాణి ప్రభుత్వ ఆస్తి. కాని రోజు అది హిందూమత శ్లోకాలు. గీతాలు ప్రసారం చేసుతంది. (శుక్రవారం మాత్రం ఖురాన్ని, ఆదివారం బూబిలుగీతాలు వినిపిస్తుంది). ప్రభుత్వ భవనాలు, పాఠశాలలు, ఆసుపత్రులు వగైరాల శంకుస్థాపనలు, ప్రారంభోత్సవాలు పౌరోహితుల ఆధ్వర్యంలో వైదిక పద్ధతులలో జరుగుతాయి. ఇవన్నీ సెక్యులరిజానికి విరుద్ధమైనవే. అలాగే రాజ్యాంగం ప్రకారం పూర్తి ప్రభుత్వ నిధులతో నడిచే విద్యా సంస్థలలో మత బోధలు చేయకూడదు. కాని మన ఎయిడెడ్ విద్యా సంస్థలు సాంకేతికంగా "పూర్తి" సహాయం పొందవు గనుక వాటిలో మతబోధలు సాగుతూనే వుంటాయి. ఆర్.ఎస్.ఎస్. అభిమానుల ఆధ్వర్యంలోనే అనేక విద్యా సంస్థలు నడుస్తున్నాయి. ఇకమైనారిటీలు తమ ప్రచారాలకు గానువిద్యా సంస్థలను పెట్టుకునేందుకు రాజ్యాంగమే అవకాశమిచ్చింది. దాని ప్రకారం క్రైస్తవ, ముస్లిం మతసంస్థలు విద్యాలయాలు స్థాపించి, మత ప్రచారానికి వాడుకుంటూనే వున్నాయి. ఈ విధంగా విద్యార్థిదశలోనే మత భావాలకు బలమైన బీజం పడుతోంది.

లైకికత్వమంటూనే మెజారిటీ మతమైన

# అయోధ్య పరిణామాలు

హిందూ మత భావాలకే పాలకులుపెద్ద పీట వేస్తున్నారు. అదే సమయంలో తమకు అవసరమైనపుడు మైనారిటీ మత సంస్థలనూ వాడుకుంటున్నారు. 1957లో కేరళలో శ్రీ నంబూద్రిపాద్ ప్రభుత్వం మత సంస్థల నుంచి విద్యాలయాలను స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నిస్తే వారంతా కమ్యూనిస్టులపై కత్తి కట్టారు. శ్రీమతి గాంధీ నాయకత్వంలో "విమోచనా సమరం" అంటూ జరిపి ఆ ప్రభుత్వాన్ని కూలద్రోశారు. నాటి నుంచి నేటి వరకు కేరళలో అన్ని కుల, మత శక్తులతో కాంగీ పొత్తు కొనసాగుతూనే వుంది. ఈనాటికి అక్కడ ప్రభుత్వంలో ముస్లింలీగ్ భాగస్వామిగా వుంది. ఇప్పటికి కూడా కేంద్రం దేశంలోని ప్రజలందరికీ ఒకే పౌర స్మృతి (సివిల్ కోడ్) రూపొందించకుండా ముస్లింలకు వారి పర్సనల్ లా అలాగే వుంచింది. ఇది ముస్లింల పట్ల పక్షపాతమని బి.జె.పి. తీవ్రంగా వ్యతిరేకించుతూ వుంటుంది. అందరికి ఉమ్మడి సివిల్‌కోడ్ వుండాలని వామపోఆలు చెబుతూనే వున్నాయి. కాని దేశంలో హిందువుల ఆధిపత్యం రావాలని చెప్పే బి.జె.పి. కోరే 'సివిల్ కోడ్' వేరు. హిందూత్వాన్ని ముస్లింలపై రుద్దాలని దాని భావం! వాస్తవానికి రాజీవ్‌గాంధీ హయాంలోనే ముస్లిం ఛాందసులను తృప్తిపరచడం కోసం ముస్లిం స్త్రీల విడాకుల చట్టాన్ని తేవడం, హిందూ సనాతనుల కోసం రామజన్మభూమి-బాబరీ మసీదు తాళాలు తెరవడం జరిగిందని మరిపోరాదు. 1989లో



రాజీవ్‌గాంధీ తన ఎన్నికల ప్రచారాన్ని అయోధ్య నుంచి "రామరాజ్య" నినాదంతో ప్రారంభించారు. ఈ విధంగా దేశంలో వివిధ మతోన్మాదులు రగిలించడంలో కాంగ్రెస్ పాత్ర చాలా వుంది.

ఈ అవకాశవాదమే బి.జె.పి.కి కొమ్ములు తెచ్చింది. వీలుని బట్టి కాంగ్రెస్ వ్యతిరేక శక్తులతోనూ, కాంగ్రెస్‌తోనూ పొత్తు కలుపుతూ అది బలం పెంచుకుంది. గాంధేయ సెక్యులరిజంతో బయలుదేరిన ఆపార్టీ అయోధ్యలో బాబరీ మసీదు విధ్వంసం చేసే ఫాసిస్టు దశకు చేరుకున్నది. అది మసీదును కూల్చడం ద్వారా భారత దేశ లౌకిక విలువలకే మచ్చ తెచ్చింది. లౌకిక తత్వాన్ని గనుక పునరుద్ధరించకపోతే విచ్ఛిన్నమతాలు, జాతులు గల ఈ దేశానికి మనుగడలేదు.

ఇందుకుగాను మొత్తం మన ఆలోచనల్లో, విధానాలలో మార్పులు రావలసి వుంటుంది. ఈ వ్యాసం మొదట్లో చెప్పినట్లుసరైన సెక్యులరిజాన్ని అనుసరించాల్సి వుంటుంది. మతతత్వం అనే దాన్ని బ్రిటిష్ వారు బాగా పెంచిన మాట నిజమే అయినా, మనదేశ సాంఘిక, సాంస్కృతిక చట్టంలోనే వున్నాయని మరిచిపోరాదు. ఈ దేశంలో హిందూ, ముస్లిం,సిక్కు, క్రైస్తవ, జైన, బౌద్ధ తదితర మతాలు, అసంఖ్యాకమైన ఆచారాలు, సాంప్రదాయాలు, ప్రాంతీయ తారతమ్యాలు వున్నాయి. ఈ వాస్తవాన్ని గురించి, భిన్నత్వంలో ఏకత్వాన్ని అంగీకరించేలా లౌకిక విధానాలను అనుసరించిన నాడే దేశ ప్రజల మధ్య అపోర్థాలు తొలగి, ఐకమత్యమేర్పడుతుంది.

### [illegible] ముస్లిం [illegible]

హిందూ ముస్లిం అలగ్ అలగ్‌హై
దోనో భగవాన్ ఏక్‌హై

హిందూ జీతీహై మందిర్
ముస్లిం జీతీహై మసీద్
ఏ మసీద్, ఓ మందిర్
అలగ్ అలగ్ హై, దోనో భగవాన్ ఏక్‌హై ।హిందూ।

హిందూపడ్‌తీహై భగవద్గీత
ముస్లిం పడ్‌తీహై ఖురాన్
ఏ ఖురాన్, ఓ భగవద్గీత
అలగ్ అలగ్‌హైదోమే యిన్సాఫ్ ఏక్‌హై ।హిందూ।

హిందూ పకాతీహై పులిహోరా
ముస్లిం పకాతీహై భగారా
ఓ పులిహోరా, ఏ భగారా
అలగ్ అలగ్ హైదోమే చావల్ ఏక్‌హై ।హిందూ।

హిందూ బనాతీహై పచ్చిపులుసు
ముస్లిం బనాతీహై కట్టా
ఓ పచ్చిపులుసు ఏ కట్టా
అలగ్ అలగ్ హైదోమే యిమిలీఏక్‌హై ।హిందూ।

హిందూ బన్‌తీహై ధోతి
ముస్లిం బన్‌తీహై లుంగీ
ఏ లుంగీ, ఓ ధోతి
అలగ్ అలగ్ హైదోమే కపడా ఏక్‌హై ।హిందూ।

హిందూ కర్‌తీహై శెక్కర్ పొంగల్
ముస్లిం కర్‌తీహై సేమియా
ఓశెక్కర్ పొంగల్, ఏ సేమియా
అలగ్ అలగ్ హైదోమే మిఠా ఏక్‌హై ।హిందూ।

హిందూ లేతీహై మందుగోలి (ఔషధం)
ముస్లిం లేతీహై దవా
ఓ మందు, ఏ దవా
అలగ్ అలగ్ హైదోమే దవా ఏక్‌హై ।హిందూ।

హిందూ దులా బన్‌తీహై బాషింగం
ముస్లిం దులా బన్‌తీహై సేరా
ఓ బాషింగం, ఏ సేరా
అలగ్ అలగ్ హై దోమే ఫూల్ ఏక్‌హై ।హిందూ।

హిందోంకూ బోల్‌తాహై కార్మికులు
ముస్లిమోంకు బోల్‌తాహై మజ్దూర్
ఓ కార్మికులు, ఓ మజ్దూర్
అలగ్ అలగ్ హై దోమే మెహనత్ ఏక్‌హై ।హిందూ।

-సాబరాజు యాదగిం

# భారత రాజకీయ రంగంలో మతతత్వ శక్తుల పెరుగుదల తీరు

భారతదేశం స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న దశలోనే వివిధ మతాలు, కులాల మధ్య సంబంధాలు సమస్యలు తలెత్తాయి. వాటినన్నింటినీ ఇక్కడ పేర్కొనడం కష్టం. విభజించి పాలించే నీతిని అనుసరించిన బ్రిటిష్ పాలకులు ముస్లింలను, దళితులను జాతీయ స్రవంతినుంచి దూరం చేయాలని కుట్రలు పన్నారు. ఫ్యూడల్ అనుబంధాలు, ఊగిసలాటలు ? కాంగ్రెస్ నాయకత్వం కూడా అందుకు దోహదపడింది. జనబాహుళ్యం చాలా వరకు ఐక్యంగా నిలపడానికి గాంధీజీ అనుసరించిన పద్ధతులు తోడ్పడినప్పటికీ, ఈ సమస్యలు కొనసాగాయి. భారత ప్రజలందరి పక్షాన సాగే పోరాటం ఒక స్రవంతి, వివిధ కుల, మత ప్రతిపత్తి గ్రూపుల ఆధ్వర్యంలో మరో స్రవంతి నడిచాయి. 1930లో జరిగిన మొదటిరౌండ్ టేబిల్ సమావేశంలోనే దానిపై పెద్ద చర్చ జరిగింది. రెండవ స్రవంతిలోని వివిధ గ్రూపులను కలుపుకుని వచ్చేందుకై అనేక రాయితీలు ఇవ్వడానికి జాతీయోద్యమ నాయకత్వం ప్రయత్నిస్తూ వచ్చింది. జాతీయోద్యపు చివరి దశలో ముస్లింలీగ్ నాయకుడు జిన్నాకు గాంధీ అనేక సంధి ప్రతిపాదనలు చేశారు. జాతీయోద్యమ నాయకత్వంలోనే ఈ విషయంలో విభేదాలున్నాయి. చివరకు బ్రిటిష్ పాలకులు అధికార బదలాయింపుకు సిద్ధపడిన తర్వాత ఈ విభేదాలు తీవ్రమైనాయి. మత ప్రాతిపదికన దేశాన్నివిభజించడాన్ని గాంధీజీ గట్టిగా వ్యతిరేకించారు. నెహ్రూ, సర్దార్ పటేల్, మౌలానా అబుల్ కలామ్ ఆజాద్, రాజాజీ వంటివారు మాత్రం ఎలాగో స్వాతంత్ర్యం పొందాలనే వైఖరి తీసుకున్నారు. మొత్తానికి హిందువులు ఎక్కువగా వున్నది ఇండియన్ యూనియన్‌గా, ముస్లింలు ఎక్కువగా వున్నది పాకిస్తాన్‌గా ఏర్పడ్డాయి.

దేశ విభజన సమయంలో దారుణమైన మతకలహాలు సంభవించాయి. లక్షలాది కుటుంబాలు అటు ఇటూ చీలిపోయాయి. అప్పటి వరకు ఒకే దేశంగా వున్న ప్రాంతాలనుంచి లక్షలాది ప్రజలు అటునుంచి ఇటు, ఇటు నుంచి అటు వలసలు జరపాల్సి వచ్చింది. సిక్కులు, హిందువులు ఇండియాకు, ముస్లింలు పాకిస్తాన్‌కు వలసలు వెళ్ళే సందర్భాలలో లక్షల సంఖ్యలో హత్యలు జరిగాయి. కోటానుకోట్ల ఆస్తి దోచుకోబడింది. దహనకాండలు, మానభంగాలు లెక్కకుమిక్కుటంగా సాగాయి. దేశ విభజన ఫలితాలివి.

అయితే విభజన తర్వాత హిందువులు అధికంగా వున్నప్పటికీ భారతదేశం లౌకిక తత్వాన్ని స్వీకరించింది. మైనారిటీలకు రక్షణ హక్కులు కల్పించి, సమాన పౌరులుగా ప్రకటించింది. అందుకు భిన్నంగా పాకిస్తాన్ ఇస్లామిక్ మత రాజ్యంగా ప్రకటించుకుంది మతోన్మాద ముస్లింలీగ్ పాకిస్తాన్‌పై పెత్తనం సాధించిన ఫలితమిది కాగా మాదేవంలో జాతీయోద్యమ లౌకిక వారసత్వం నిలదొక్కుకుంది. హిందూ మతోన్మాదానికి ప్రాతినిధ్యం వహించే హిందూ మహాసభ, ఆర్.ఎస్.ఎస్. వంటి శక్తుల ఆటలు సాగలేదు గనుక ఇది సాధ్యమైంది.

కాని హిందూ మతోన్మాద సంస్థలు ఊరుకోలేదు. మత సామరస్యం ప్రబోధించినందుకే 1948లో గాంధీజీని హత్య చేశారు. అప్పుడు హోంమంత్రి సర్దార్ పటేల్ ఆర్.ఎస్.ఎస్.ను నిషేధించారు. కాని తర్వాత వారితో ఆయనే చర్చలు ప్రారంభించారు. (అద్వానీగారు ఎప్పుడూ పటేల్‌ను పొగడడానికి కారణమిదే) స్వతహాగా పటేల్ మతవాది. కాంగ్రెస్‌కు కొన్ని హిందూ మతోన్మాద సంస్థలకు సంబంధముందని అప్పుడే వెల్లడైంది.

గాంధీజీ కూడా ఈ విషయంలో అర్థం చేసుకున్నారు. కాంగ్రెస్ కొనసాగడానికి మతతత్వ శక్తులపై ఆధారపడవచ్చుననే భయంలోనే ఆయన ఆ పార్టీనుంచి రద్దు చేయమని తన వీలునామాలో రాశారు. కాని ఆ శక్తులే ఆయనను తుదముట్టించాయి.

1952లో జరిగిన మొదటి ఎన్నికలలో హిందూ మహాసభ, రామరాజ్య పరిషత్ వంటి మతతత్వ శక్తులు పాల్గొన్నాయి. తర్వాత ఇవన్నీ జనసంఘంగా ఏకమై, ఆర్.ఎస్.ఎస్. చెప్పుచేతల్లో పనిచేశాయి. జనసంఘమే తర్వాత బి.జె.పిగా మారింది. ఇది ఈ దేశంలో హిందూ మతోన్మాద పార్టీలు పూర్వ రంగం. ఇదే కాలంలో మలబార్, తమిళనాడులలో ముస్లింలీగ్, పంజాబ్‌లో అకాలీపార్టీలకు మత ప్రాతిపదికనే ఏర్పడ్డాయి. 1952లో నాటి "పెప్సు" రాష్ట్రంలో అకాలీలు మెజారిటీ పొంది కొంత కాలం అధికారం చేయగలిగాయి. క్రైస్తవులు ఒక పార్టీగా నిలదొక్కుకోలేకపోయినా, కొన్ని పార్టీలలో వుండి, కొంత ప్రభావం చూపగలిగారు. తిరువాన్కూరు-కొచ్చిన్ (తర్వాత కేరళ) రాష్ట్రంలో వారి సంఖ్య ఎక్కువ గనుక కాంగ్రెస్‌పై బాగా ప్రభావం చూపారు. తర్వాత ప్రత్యేక పార్టీగా ఏర్పడ్డారు. ఈశాన్య రాష్ట్రాలలో కూడా రాజకీయ ప్రభావం చూపగలిగారు.

ఈ విధంగా భారత రాజకీయాలలో మెజారిటీ, మైనారిటీ మత భావాలు చోటు సంపాదించాయి. 1952 ఎన్నికలలో కాంగ్రెస్‌కు 48శాతం, ఇతర పార్టీలకు 52శాతం ఓట్లు వచ్చాయి. వీటిలో వివిధ రకాల మత పార్టీలు వున్నాయి. ఆ విధంగా కొన్ని దశాబ్దాల జాతీయోద్యమ క్రమంలో నిర్మించబడిన భారత ప్రజల ఐక్యత విచ్ఛిన్నం చేయబడింది. జాతీయ సమైక్యతకు ముప్పు ఏర్పడింది. కాంగ్రెస్ పార్టీవీటిని ఎదుర్కోలేకపోగా రకరకాలుగా రాజీలు పడింది.

ఈలోగా భారత రాజకీయ రంగంలో కమ్యూనిస్టు పార్టీ ఒక శక్తిగా ఎదిగింది. అనేక ప్రజా పోరాటాలు సాగించింది. మొదటి పార్లమెంటులో అది ప్రధాన ప్రతిపక్షమైంది. తిరువన్కూరు-కొచ్చిన్, మద్రాసు, హైదరాబాద్, పశ్చిమబెంగాల్, త్రిపుర రాష్ట్రాలలో ప్రధాన శక్తిగా ముందుకొచ్చింది. 1955లో ఆంధ్రలో దాదాపు అది గెలుపొందే స్థితి వచ్చింది. 1957లో కేరళలో అధికారానికి రాగలిగింది. అందుకు వ్యతిరేకంగా కాంగ్రెస్ అన్ని మత శక్తులతో చేతులు కలిపి కూలదోసింది.

అయినా కమ్యూనిస్టు పార్టీ గాని, తర్వాత కాలంలో సి.పి.ఐ (ఎం)గాని తమ పోరాటాన్ని విరమించలేదు. నిరంకుశ కాంగ్రెస్‌ను ఓడించడానికి 1967లో డి.ఎం.కె.వంటి ప్రాంతీయ పార్టీలతో అవగాహన, ముస్లింలీగ్‌తో తాత్కాలికంగా సర్దుబాటు చేసుకున్నా, తర్వాతికాలంలో ముఖ్యంగా 80వ దశకం ప్రారంభంనుంచి మత శక్తులతో ఎలాటి అవగాహనకు వీలులేదనే గట్టి వైఖరి పార్టీ తీసుకుంది. కేరళలో ముస్లింలీగ్‌తో కాని, అఖిల భారత స్థాయిలో బి.జె.పితో గాని ఎలాంటి పొత్తుకు నిరాకరించింది. కాంగ్రెస్, ఇతర బూర్జువా పార్టీలు ఇలాంటి నికరమైన వైఖరి తీసుకొని వుంటే బి.జె.పి. గాని, ఇతర మతతత్వ పార్టీలు గాని ఇంత పెరిగేవి కావు. ఇప్పటికైనా వాటిని ఐక్యంగా ఎదుర్కోవడానికి కృషి చేయగలిగితే సంతోషమే.

# ఆలయాల కూల్చివేతను ఎవరూ ఖండించలేదా?

సత్యంమీద ఆధారపడిన వారికన్నా అసత్యాలను విన్నవించేవారి అంబులపొది అక్షయంగా వుండటం కద్దు. "పాపానికి వేల వేల దారులున్నవి. ధర్మ గోపురానికొక్కటే ద్వారమున్నది" అని ఒక కవి చక్కగా చెప్పారు. పాపిష్టి పనులకు పాల్పడే వారు వాటిని సమర్థించుకోవడానికి ఎప్పటికప్పుడు ఏవో కొత్త కొత్త అసత్యాలు సృష్టిస్తూనే వుంటారు. మైనారిటీలకు వ్యతిరేకంగా హిందూ మతోన్మాదులు విసిరే అడ్డ సవాళ్ళలో కొన్నింటికి లోగడ అయోధ్య అనుబంధంలో జవాబులిచ్చాము. అయితే బాబరీ మసీదు కూల్చివేత తర్వాత వారు తమ అసత్య ప్రచారాలు తీవ్రం చేశారు.

మసీదు కూల్చితే ఖండించేవారు, మన ఆలయాలు కూలిస్తే ఎందుకు ఖండించరు? కాశ్మీర్‌లో యాభై దేవాలయాలు కూల్చితే వీరు ఖండించారా?

హిందూ మతోన్మాదమేగానీ ముస్లిం మతోన్మాదం వీరికి కనిపించదా?

ఎక్కడో బాబరీ మసీదు కూల్చితే మన పూళ్ళో ఆలయాలపై దాడులెందుకు చెయ్యాలి?

బాబరీ మసీదును పునర్నిర్మిస్తే కూల్చిన మన దేవాలయాలు పునర్నిర్మించవద్దా?

ఇవి స్థూలంగా ప్రతిచోటా వారు ప్రస్తుతం లేవనెత్తుతున్న ప్రశ్నలు. ఇవిగాక స్థానికావసరాలను బట్టి మరికొన్ని జోడిస్తుంటారు.

మొదటి ప్రశ్నతో ప్రారంభించి, వాటి నిజా నిజాలు తెలుసుకుందాం.

అయోధ్యలో బాబరీమసీదు కూల్చివేత ఒక విస్తృతమైన, విద్వేషపూరితమైన కుట్ర. కోర్టులను, రాజ్యాంగాన్ని, పార్లమెంటును ధిక్కరించి, పాత్రికేయులను చితగ్గొట్టి, సాగించిన ఫాసిస్టు చర్య. కోట్లాది ముస్లింల మనోభావాలకు ప్రతీకగా వున్న ఆ మసీదును కూల్చితే దాని ప్రభావం తీవ్రంగా వుంటుందని బి.జె.పి. వారికి బాగా తెలుసు. అలా జరగాలనే వారు ఆ పని చేశారు. దాని ప్రభావంతో మైనారిటీ మతస్తులు రెచ్చిపోయి కొన్ని చోట్ల ఆలయాలపై దాడులు చేశారు. ఉద్రిక్తతలు పెరిగినపుడు అది సహజం. మత భావనలోనే అది వుంది. అది తప్పుకాదు అని ఎవరూ అనరు. కాని బాబరీమసీదు కూల్చివేతను, వాటిని ఒకే గాటకట్టగలమా? మసీదు కూల్చివేత అనే క్రియకు ప్రతిక్రియ అది. మొదటి తప్పుచేసి నిప్పు పెట్టిన పాపం ముమ్మాటికి బి.జె.పి. కూటమిది.

ఆలయాల కూల్చివేతను ఎవరో ఖండించడమెందుకు, ముస్లిం మత నాయకులే ఖండించారు.

పార్లమెంటు సభ్యుడు, జమైతే-ఉలేమా-హింద్ అధ్యక్షుడు మౌలానా అసాద్ మందానీ పాకిస్తాన్‌లో జరిగిన పరిణామాల పట్ల తీవ్ర ఆందోళన వ్యక్తం చేశాడు. మైనారిటీ మతస్తులకు అన్యాయం, అణచివేత ఇస్లాం ఆమోదించదని చెప్పారు. శాంతిభద్రతల పునరుద్ధరణకు మతోన్మాదులు, ఇతర జాతి వ్యతిరేక శక్తుల అణచివేతకు చర్యలు తీసుకొమ్మని ఆయన కేంద్రాన్ని కోరారు.

జనతాదళ్ కార్యదర్శి, వసీన్ అహ్మద్ పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లలో ఘటనలు చాలా దురదృష్టకరమని, భారతదేశంలోని ముస్లిములు వాటినెన్నడూ ఆమోదించరని చెప్పారు.

బాబరీ మసీదు యాక్షన్ కమిటీ కన్వీనర్ సయ్యద్ షహబుద్దీన్ ఢిల్లీలో డిసెంబర్ 9 న ఒక ప్రకటన చేస్తూ పాక్, బంగ్లాదేశ్‌లలో ఆలయాలని ధ్వంసం చేయడాన్ని ఖండించారు. ధ్వంసమైన ఆలయాలను బేషరతుగా మరమ్మత్తు చేయాలని, అవసరమైతే పునర్నిర్మించాలని తాము ఆ దేశాల ప్రభుత్వాలను కోరతామని ఆయన చెప్పారు. అదే రో[illegible]ల్లో యాక్షన్ కమిటీ తరపున శ్రీ కచ్చా[illegible] ఉస్తాద్ అహమ్మద్ సాదిక్, కమీర్ అలాల్‌లు ఒక ప్రకటన చేస్తూ అయోధ్య ఘటనలు ముస్లింలను ఎంత కలచివేసినా వారు హింసాకాండకు పాల్పడటం సమర్థనీయం కాదని పేర్కొన్నారు. ప్రతీకార దృష్టితో హిందూ దేవాలయాలను కూల్చవద్దని, అమాయక హిందూ ప్రజలను చంపవద్దని వారు కోరారు.

దేశంలోనూ, విదేశాలలోనూ వున్న ముస్లిం సోదరులు మతతత్వ తీవ్ర శక్తులకు లొంగి బలి పశువులు కావద్దని, శాంతి, సహనం ప్రదర్శించాలని శ్రీయుతులు సలావుద్దీన్ ఒవెసీ, సయ్యద్ షహబుద్దీన్, ఇబ్రహీం సులేమాన్ సేట్, అహ్మద్ హష్మి, జి.ఎం.బనత్‌వాలా, సైఫుద్దీన్ సోజ్, మౌలానా మహ్మద్ సిరాజుల్ హుస్సేన్, మహ్మద్ షఫీ మోనిష్, ముఫ్తీ మహ్మద్ విక్రమ్, అబ్దుల్ హవాబ్ ఖల్జీ తదితరులు సంతకాలు చేశారు.

స్థలాభావం అడ్డు రాకపోతే ఇలాంటి విజ్ఞప్తులు చేసిన ముస్లిం నేతల ప్రకటనలు ఇంకా అనేకం ఉదహరించవచ్చు. కానీ బాబరీ మసీదు కూల్చివేతను సూటిగా ఖండించిన బి.జె.పి. కూటమి నాయకుల ప్రకటన ఒక్కటైనా వుందా? వాజ్‌పాయ్ కూడా దాన్ని తరలించాలని చెప్పేవారే కూల్చివేత ఆవేశంలో అదుపు తప్పి చేసిన పని అని అంటూనే, అది పేరుకుపోయిన హిందూ మత భావాల ఫలితమని పరోక్షంగా సమర్థించుతున్నారు. అక్కడ మసీదు పునర్నిర్మిస్తే ఊరుకోమని బెదిరించుతున్నారు. మధుర, కాశీలలో కూడా మసీదులు పాడు చేస్తామని సవాళ్ళు చేస్తున్నారు.

వారు అమాయక ముస్లింలను చంపకండి, శాంతిని కాపాడండి అని నేరుగా విజ్ఞప్తి చేసిన సందర్భాలు దాదాపు లేవు! పైగా మామీద చర్యలు తీసుకుంటే "తీవ్ర పర్యవసానాలు" తప్పవని, పరిస్థితి చేయి దాటిపోతుందని అంటున్నారు. ఆర్.ఎస్.ఎస్.పై నిషేధం "అగ్నిజ్వాలలు" రగిలిస్తుందని సుందర్‌సింగ్ భండారీ అన్నారు. మామీద చర్య తీసుకుంటే మత కలహాలు రగిలిస్తాము అని బెదిరింపు కాదా ఇది? కనుక చేసిన తప్పుకు చెంపలేసుకోకపోగా ఇంకా చిందులేస్తున్న బి.జె.పి. ఆలయాల విధ్వంసాన్ని ఎవరో ఖండించలేదని అసత్యారోపణలు చేయడంలో అర్థంలేదు. ముస్లింలే వాటిని ఎలా ఖండించారో పైన చూశాం.

ఇక కాశ్మీర్‌లో యాభై దేవాలయాల కూల్చివేత విషయానికి వద్దాం. కాశ్మీర్‌లో ముస్లిం వేర్పాటువాదం ప్రబలి, దేశ సమైక్యతకు చేటుగా తయారైందని అందరూ ఖండిస్తూనే వున్నారు. పాకిస్తాన్ ప్రోద్బలంతో అక్కడ ముస్లిం వేర్పాటువాదం తీవ్ర రూపం దాల్చింది. దాని తాకిడికి అనేక కుటుంబాలు వలస రావలసి వచ్చింది. ఆ రాష్ట్రంలో మైనారిటీగా వున్న హిందువులే ఎక్కువగా వలస వచ్చారు. కాని వచ్చిన వారిలో ముస్లింలు కూడా లేకపోలేదు. ఎవరు వచ్చినా వారిని భారతీయ సోదరులుగా చూడాలిగాని మతాన్ని బట్టి కాదుకదా. ఒక రాష్ట్రంలోకాని, దేశంలోగాని మెజారిటీ మతంగా వున్నవారు ఉన్మాదానికి దిగితే కలిగే ఫలితాలు ఎలా వుంటాయో తెలుస్తున్నప్పటికీ, బి.జె.పి.

వారు తక్కిన చోట్ల మెజారిటీ మతోన్మాదాన్ని ప్రకోపింపచేస్తున్నారు కదా! ముస్లింలు ఎక్కువగా వున్న కాశ్మీర్ భారతదేశంలో విలీనం కావడానికి ప్రధాన కారకుడైన షేక్ అబ్దుల్లాగాని, ఆయన పార్టీ నిర్వహించిన పాత్రనుగాని "హిందూ రాష్ట్ర" సిద్ధాంతకర్తలు ఎలా నిర్వచిస్తారు? భౌగోళికంగా సరిహద్దులలోని ఆ సున్నిత ప్రాంతం మనవైపుకు రావడం వల్ల ఎంతో ప్రయోజనం కలిగింది. అందుకే దానికి 370 వ అధికరణం క్రింద ప్రత్యేక ప్రతిపత్తి నివ్వడానికి అంగీకరించాము. జనతా ప్రభుత్వంలో భాగస్వామిగా వాజ్‌పాయ్‌గారే ఆ అధికరణాన్ని గట్టిగా సమర్థించారు. కాని ఇప్పుడు వారికి అది పెద్ద పెనుభూతంగా కనిపిస్తోంది. కాశ్మీర్ ప్రజలను దేశ ప్రధాన స్రవంతిలోకి తేవడమెలా అని ఆలోచించాల్సింది పోయి, ఉన్న ప్రత్యేక ప్రతిపత్తిని కూడా వ్యతిరేకించడం ద్వారా బి.జె.పి. వారు కాశ్మీరీలలో అనుమానాలు, అపార్థాలు పెంచి, పాకిస్తాన్ వైపు వారిని నెడుతున్నారు అనేది యదార్థం!

మొత్తం కాశ్మీర్‌ను కాపాడుకోవడమెలా అని ఆలోచించాల్సింది పోయి, అక్కడ కూల్చిన ఆలయాల గురించే చెప్పేవారిని ఏమనగలం? వేర్పాటువాదాన్ని ఎదుర్కోవడానికి జోషీగారి "ఏకతాయాత్ర" (అదీ ప్రభుత్వ విమానంలో) ప్రహసనం జరపడం మినహా బి.జె.పి. ఏం చేసింది?

ఇక కాశ్మీర్‌లో ఆలయాల కూల్చివేత సమస్య జైలులో వున్న అద్వానీ విడుదల చేసిన ప్రకటనలో యాభై ఆలయాల కూల్చివేత గురించి ఆరోపణ చేశారు.

జమ్మూ - కాశ్మీర్ నేషనల్ కాన్ఫరెన్స్ మాజీ ఎం.పి. శ్రీ సైపుద్దీన్ సోజ్ ఆ రోజునే అద్వానీ ప్రకటనను ఖండించారు. 1986లో అక్కడ అయిదు దేవాలయాలకు స్వల్పంగా నష్టం జరిగిందని, దాన్ని వెంటనే ప్రభుత్వ వ్యయంతో పునరుద్ధరించడం జరిగిందని ఆయన స్పష్టం చేశారు.

పాకిస్తాన్ ప్రధాని నవాజ్ షరీఫ్ కూడా తమ దేశంలో కూల్చివేయబడిన ఆలయాలు ప్రభుత్వ ఖర్చుతో పునరుద్ధరిస్తామని, నష్టపోయిన మైనారిటీలకు పరిహారం కల్పిస్తామని ప్రకటించడం గమనార్హం. ఈ వార్తలు అన్ని పత్రికలలోనూ వచ్చాయి.

కనుక కూలిపోయినవి ఆలయాలా, మసీదులా అనేది సమస్య కాదు. ఎవరి మత విశ్వాసాలు వారివి. రాజ్యాంగ పరిధిలో ఎవరైనా వాటిని అనుసరించవచ్చు. అందుకు భంగం కలిగించే హక్కు ఎవరికీ వుండదు. ఒకవేళ భంగం కలిగించితే ప్రభుత్వాలు వాటిని సరిదిద్దడానికి పూనుకోక తప్పదు.

అయితే ప్రతి చెదురుమదురు ఘటననూ పూసగుచ్చి ఖండించడం ఎవరికీ సాధ్యం కాదు. 1990లో అద్వానీ రథయాత్ర సందర్భంగా కూడా మన రాష్ట్రంలో కొన్ని మసీదులకు నష్టం కలిగించారు. మత కలహాలు ప్రజ్వరిల్లిన సందర్భాలలోనూ ఇలాటి ఘటనలు జరుగడం కద్దు. వాటిని అప్పటికప్పుడు ఏదో సర్దుబాటు చేస్తుంటారు. బాబరీ మసీదు కూల్చివేత పెద్ద అఘాయిత్యంగా జరిగింది గనకే ఇంతటి ఖండనలు అవసరమైనాయి.

వాస్తవానికి ఈ అయోధ్య పరిణామాల అనంతరం దేశంలో దారుణ మత కలహాల కీలల మధ్యనే కొన్ని ఆశాకిరణాలు కనిపించాయి. ఒకప్పుడు భీకర మారణకాండ చూసిన భివాండీలో ఈసారి హిందూ, ముస్లిం సామరస్యం పరిఢవిల్లింది. (చూడండి ప్రజాశక్తి డిసెంబర్ 20) ముస్లింలు హిందూ దేవాలయాలకు రక్షణగా నిలిచారు. అస్సాంలో హిందూ, ముస్లింలు ఒకరికొకరు రక్షణగా నిలవడమేగాక, ధ్వంసమైన ప్రార్థనా స్థలాలను ఐక్యంగా పునర్నిర్మించుకునేందుకు ముందుకు వచ్చారు. అలాంటి సామరస్య స్ఫూర్తి పెంచడం ద్వారానే బి.జె.పి. సవాళ్ళకు జవాబు చెప్పగలం.

[illegible]

పల్లవిః మసిబారిన చెక్కిలిపై జారుతున్న కన్నీరు
మన ఎదలో సృష్టించెను ఎన్నో ప్రశ్నల హోరు
అది జారుతున్న కన్నీరు ... ఎన్నో ప్రశ్నల
హోరు ॥ |ఆది|

చరణంః అనల వేదికయ్యింది ఆసేతు హిమాచలం
చరిత గొంతులో గరళం అసహాయుల అశ్రుజలం
మనిషి హితం కోరేదే మతం అని చెప్పారే!
మనిషి రక్తాన్ని కోరుతున్న మతాన్ని ఏమంటారు|
|ఆది||

రక్త పంకిలమ్మయిన రామ భక్తి ఇప్పుడు
ప్రేమ సీమలన్నింటిని తగులవేయుచప్పుడు
మత రాజకీయానికి చావులే పావులా?
సమతా, సహజీవనము వట్టి ఎండమావులా?
|ఆది|

మతం పేర, గతం పేర ఘోరంగా దగా చేసి
కలిసివున్న బతుకులపై క్రూరంగా నిఘావేసి
ప్రేమానురాగాల హృదయమందిరాలు కూల్చి
స్మశానాల నేలుతారా? కన్నుల్లో తడిని పిల్చి|ఆది|

మానవతా భారతం గాయాలను కడిగేందుకు
కావాలి సరయినవి నీళ్ళు కావు కన్నీళ్ళు
భక్తి ముసుగు ఉన్మాదులు జాతికిద్రోహం చేస్తూ
మువ్వన్నెల జెండానుతూట్లు పొడుచుటెన్నాళ్ళు?
|ఆది|

ఆత్మగౌరవములేని అధికారం స్థాయి మరచి
కాషాయాలతో భేటీ పాదపూజకై పోటీ
వెన్నులేని నేతలను ఎన్నుకున్న పాపానికి
అయోధ్యలోనే కాదు అంతటా విలువలు లూటీ
|ఆది|

భవిత కొరకు, బతుకు కొరకు పరితపించుమిత్రులారా!
విష సంస్కృతి వారసులను ప్రతిఘటించ
కదలండి
సమ భావన పరిమళాలు విరజిమ్మే భారతాన్ని
నిర్మించే ఘన సేవకు అంకితమవుదామండి
అంకితమవుదామండి |ఆది||

– నల్లి ధర్మారావు

దేశంలో మిగిలిన మూడు బి.జె.పి. రాష్ట్ర ప్రభుత్వాలను రద్దు చేస్తూ రాష్ట్రపతి ఉత్తర్వులు జారీ చేశారు. డిసెంబరు ఆరున కరసేవ అనంతర పరిణామాల దృష్ట్యా ఇలాంటి చర్య తీసుకోవడం జరుగుతుందనే రాజకీయవేత్తలు, పరిశీలకులు భావిస్తూ వచ్చారు. బి.జె.పి. కూడా తమ ప్రభుత్వాల రద్దు అనివార్యమని మానసికంగా సిద్ధపడినట్లు ఆ పార్టీ నాయకుల ప్రకటనలు వెల్లడి చేశాయి. అయోధ్య ఘటనలు, తర్వాత మత కలహాలు, ఆర్.ఎస్.ఎస్. తదితర మత సంస్థలపై నిషేధం తర్వాత బి.జె.పి. పాలిత రాష్ట్ర ప్రభుత్వాలు అధికారంలో కొనసాగే నైతిక, రాజకీయ అర్హత కోల్పోయాయని, అవి వెంటనే తప్పుకోవడం మంచిదని సి.పి.ఐ.(ఎం.), వామపక్షాలు స్పష్టం చేశాయి. ఈ నేపథ్యంలో మంగళవారం నాడు కాంగ్రెస్(ఐ) వర్కింగ్ కమిటి రాజస్థాన్, హిమాచల్ ప్రదేశ్, మధ్యప్రదేశ్‌లలోని బి.జె.పి. ప్రభుత్వాలను రద్దు చేయాలని డిమాండ్ చేయడం, అందుకు కేంద్ర మంత్రివర్గం ఆమోదం తెల్పడం, దాని సిఫార్సుపై రాష్ట్రపతి బర్తరఫ్ ఉత్తర్వులు జారీ చేయడం అన్నీ చకచకా జరిగిపోయాయి. ఇది రాజ్యాంగ విరుద్ధమని ఆ రాష్ట్రాల మాజీ ముఖ్యమంత్రులు, ఇతర బి.జె.పి. నాయకులు పెద్ద ఎత్తున దాడికి దిగడమేగాక, మరోసారి భారత్ బంద్‌కు పిలుపునిచ్చి భంగపడ్డారు. వామపక్షాలు, జనతాదళ్ ఈ బర్తరఫ్‌ను సమర్థించాయి.

రాష్ట్ర ప్రభుత్వాలను 356 వ అధికరణం క్రింద బర్తరఫ్ చేయడం ప్రజాస్వామ్య విరుద్ధమని వామపక్షాలు ఎప్పుడూ చెబుతున్నాయి. అయినా కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం సి.పి.ఐ.(ఎం.)తో సహా తనకు నచ్చని పార్టీల ఆధీనంలోని ప్రభుత్వాల రద్దుకు దాన్ని ఉపయోగించుకున్న సందర్భాలు అనేకం. సి.పి.ఐ.(ఎం.) మాత్రం గతంలో ఎప్పుడూ అందుకు ఆమోదం తెల్పలేదు. ఎంత క్లిష్ట పరిస్థితులు ఏర్పడినా, ప్రభుత్వాల రాజీనామా కోరిందేగాని, కేంద్రాన్ని రద్దు చేయమని చెప్పలేదు. ఆఖరుకు ఈనాడు త్రిపురలో అర్థఫాసిస్టు పాలన సాగించే కాంగీ-టి.యు.జె.ఎస్. ప్రభుత్వ బర్తరఫ్‌ను కూడా అది కోరలేదు. కాని మొదటిసారిగా అయోధ్యలో బాబ్రీ మసీదు రామజన్మభూమి వివాదంలో అవసరమైతే యు.పి.లో కల్యాణ్‌సింగ్ మంత్రివర్గాన్ని బర్తరఫ్ చేసైనా హిందూ మతోన్మాద కూటమికి బ్రేకులు వెయ్యమని అది కోరింది. దేశంలోనే సీనియర్ ముఖ్యమంత్రి అయిన శ్రీ జ్యోతిబాసే ఆ డిమాండ్ చేశారంటే దాని వెనుక చాలా బలమైన కారణాలున్నాయని గమనించాలి. రాజ్యాంగ నిబంధనలు, కోర్టుల ఉత్తర్వులకు తమ మత విశ్వాసాలు అతీతమని, ఏది ఏమైనా మసీదును కూల్చి రాముడి గుడి కట్టి తీరతామని బి.జె.పి. నాయకులు బహిరంగంగా ప్రకటించి, కరసేవకులను తరలించారు. ఎట్టి పరిస్థితుల్లోనూ కరసేవకులపై కాల్పులు జరపవద్దని కల్యాణ్‌సింగ్ ముందే లిఖితపూర్వకమైన ఆదేశాలిచ్చి, అనుమానాస్పదంగా వ్యవహరించారు. కనుక ఆ ప్రభుత్వాన్ని రద్దు చేసైనా పరిస్థితిని అదుపు చేయడం కేంద్రం రాజ్యాంగ బాధ్యత అనేది స్పష్టం. ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు చివరి వరకు అందుకు తటపటాయించి అయోధ్య అనర్థానికి పరోక్షంగా దోహదపడ్డారు. యు.పి. ప్రభుత్వ హామీలు నమ్మి మోసపోయానని ఆయన చెబుతున్నారు. అలా నమ్మించిన వారిలో రాజస్థాన్ ముఖ్యమంత్రి షెకావత్ కూడా ఒక ప్రధాన పాత్రధారి. మౌలిక సిద్ధాంతాల



విషయంలో యు.పి. ప్రభుత్వానికి- మిగిలిన మూడు రాష్ట్రాలలోని బిజెపి ప్రభుత్వాలకు తేడా లేదు. అవన్నీ ఆర్.ఎస్.ఎస్. కూటమిలో నుంచి వచ్చినవే! ఈ రాష్ట్రాల ముఖ్యమంత్రులు అయోధ్యకు కరసేవకులను పంపించడంలో ప్రత్యక్షంగా పాలుపంచుకున్నారు. ఘటన జరిగిన తర్వాత కూడా దాన్ని ఖండించనే లేదు. (అద్వానీ ప్రభృతుల అరెస్టులను మాత్రం ఖండించారు) ఆ తర్వాత చెలరేగిన మత కలహాలను అదుపు చేయడంలో అలసత్వం ప్రదర్శించడమే కాదు, ఆజ్యం పోసేందుకు కూడా ఆ ప్రభుత్వాలు సిద్ధపడ్డాయి. ఆ పార్టీకే చెందిన మధ్యప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి శ్రీ వీరేంద్ర సక్సేనా కూడా ఈ విషయం అంగీకరించారు. కాంగ్రెస్ పాలిత రాష్ట్రాల్లో కన్నా ఈ రాష్ట్రాల్లో చనిపోయిన వారి సంఖ్య ఎక్కువ, తక్కువ అనే లెక్కలు కావు. మొత్తంగా వాటి హిందూ మతతత్వ పోకడలు చాలా ప్రమాదకరమైనవి అనడం నిర్వివాదాంశం.

ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి., భజరంగ్ దళ్‌లను ప్రభుత్వం నిషేధించడంతో ఈ రాష్ట్ర ప్రభుత్వాల ఉనికి రాజ్యాంగ సమస్యగా కూడా తయారైంది. ఈ మూడు రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఆ సంస్థలలో అనేక కీలక స్థానాలు నిర్వహిస్తున్న వారే. ఆర్.ఎస్.ఎస్. పట్ల తమ విధేయతను చాటి చెప్పడానికి గర్విస్తున్నామని వారు నేటికీ చెప్పుకుంటున్నారు. వాజ్‌పాయి నుంచి వెంకయ్యనాయుడు వరకు బిజెపి నాయకులంతా ఈ నిషేధాలను ఖండించారు. కాని తాము పాలించే రాష్ట్ర ప్రభుత్వాలలో మాత్రం వాటిని అమలు జరుపుతామని బుకాయించుతున్నారు. నిషేధంపై విమర్శకు- దాన్ని అమలు జరుపుతామనడానికీ ఎలా పొసుగుతుందని విలేకరులు నిలదీస్తే సుందర్‌సింగ్ భండారీ తెల్లమొహం పెట్టారు! వివాదాస్పద కట్టడాన్ని కాపాడతానని కల్యాణ్‌సింగ్ ఇచ్చిన హామీ విలువ ఎంతో, నిషేధాన్ని అమలు చేస్తామనే మాటలకు విలువ అంతేనని స్పష్టంగా అర్థమవుతూనే వుంది. ఈనాడు దేశమంతటా తమపై పెరుగుతున్న ప్రజాగ్రహం, ప్రభుత్వ చర్యల నుంచి తప్పించుకుని తలదాచుకునే రక్షణ స్థావరాలుగా ఈ రాష్ట్ర ప్రభుత్వాలను వాడుకోవాలని హిందూ మతోన్మాద శక్తులు పథకం వేశాయి. ఈ ప్రభుత్వాలు కొనసాగడమంటే బరితెగించిన మతోన్మాదులు మరింత పెద్ద కుట్రలు జరపడానికి అవకాశమివ్వడమేనన్నమాట. రాజ్యాంగంకన్నా తమ విశ్వాసాలే ముఖ్యమని చెప్పేవారు ఆ రాజ్యాంగ సూత్రాల పరిధిలో తాము చేపట్టిన ప్రభుత్వాధికారాలకు నిజానికి గతంలోనే రాజీనామా చేసి వుండాల్సింది. ఆపాటి నైతిక ప్రమాణాలు లేవు గనుకే చివరి వరకు మూరుపట్టుకు వేళ్ళాడి, బర్తరఫ్ చేయబడ్డారు. ఇప్పుడు ప్రజాస్వామ్యం, రాజ్యాంగం అని గగ్గోలు పెడుతున్నారు. అయోధ్యలో అంతటి అఘాయిత్యం జరిపేనాడు ఈ సూత్రాలు గుర్తు రాలేదా అని వారిని నిలదీసి ప్రశ్నించాల్సి వుంది. పైగా గతంలో కాశ్మీర్‌లో ఫరూక్ అబ్దుల్లా ప్రభుత్వం, ఇప్పుడు పశ్చిమబెంగాల్‌లో జ్యోతిబాసు ప్రభుత్వంతో సహా పెక్కు ప్రభుత్వాల రద్దుకై బిజెపి వారు ఆందోళనలు జరిపిన ఉదాహరణలున్నాయి. కాని దేశంలో శాంతిభద్రతలకు, మతసామరస్యానికి, సమగ్రతకు నేరుగా ప్రమాదం తెచ్చిన తమ ప్రభుత్వాలపైన వేటు పడేనరికి, ఎక్కడలేని ప్రజాస్వామ్యం గుర్తుకొస్తోంది! నేటి అసాధారణ పరిస్థితులను గుర్తించకుండా కేంద్ర-రాష్ట్ర సంబంధాల సమస్యగానే దీన్ని చూసేవారు తీవ్రంగా పొరబడినట్లేనని చెప్పక తప్పదు. వామపక్షాలు, జనతాదళ్ మాత్రం అలా భావించడంలేదు. అయితే మతతత్వ సంస్థల నిషేధం, బి.జె.పి. రాష్ట్ర ప్రభుత్వాల రద్దు సరైన చర్యలే అయినా, అంతటితోనే అంతా అయిపోయిందనుకోరాదు. మతోన్మాద శక్తుల కుట్రలు, పథకాలు కొనసాగుతూనే వున్నాయని వారి ప్రకటనలే స్పష్టం చేస్తున్నాయి. ప్రజలకు వాస్తవాలు వివరించి, మత సామరస్యాన్ని పునరుద్ధరించడానికి లౌకిక శక్తులు విశాల ప్రాతిపదికన తీవ్ర కృషి చేయడం ద్వారానే ఈ కుట్రలను తిప్పికొట్టడం సాధ్యపడగలదు.

ప్రజాశక్తి సంపాదకీయం

డిసెంబరు 17

# దేశానికే మాయనిమచ్చ



## క్షమించరానిది

అయోధ్యలో జరిగింది అత్యంతహీన రూపంలో వెల్లడైన మతోన్మాదమే. వివాదాస్పద మసీదును అనాగరికమైన పద్ధతులలో నేలమట్టం చేయడం మధ్యయుగాల నాటి బర్బరత్వం మాత్రమే. మసీదు కూల్చివేత [illegible], ప్రజాస్వామిక ప్రతిష్టకు పెద్ద విఘాతం. భారత్‌కు ఆదివారం విషాదకరమైనరోజు. రాజ్యాంగ బాధ్యతను లజ్జాకరమైన రీతిలో విస్మరించిన ఉత్తరప్రదేశ్‌లోని బి.జె.పి. ప్రభుత్వం పాలనార్హత కోల్పోయింది. వివాదాస్పద కట్టడాన్ని స్వాధీనం చేసుకునేందుకే ముందుకు వచ్చిన కరసేవకుల వినాశకర, దుర్మార్గ వైఖరితో ఉత్సాహంగా చేతులు కలిపిన తీరు పరిశీలిస్తే తాను రాజ్యాంగ బాధ్యతలను నిర్వర్తిస్తానని, కోర్టు ఉత్తర్వులను ఉల్లంఘించబోనని కేంద్రానికి ఇచ్చిన హామీలో చిత్తశుద్ధిలేదని తేలింది. బి.జె.పి. దాని తీవ్రవాద మిత్రులైన ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి., భజరంగ్‌దళ్‌ల వైఖరి, ఎత్తుగడలు వినాశకరమైన ఫాసిస్టు తరహావనడంలో ఎటువంటి సందేహం లేదు. తాము జాతీయ ప్రయోజనాల రక్షకులమని చెప్పుకునే బి.జె.పి. మాటల్లో నిజంలేదని నేడు తేటతెల్లమయింది.

**–ది హిందూ**

## జాతిద్రోహం

కాంగ్రెస్ పార్టీ తన అసమర్ధతను లజ్జాకరమైన అచేతనత్వ వ్యూహంగా మార్చకుండా వుండి వుంటే, భారతీయ జనతాపార్టీ తన కపట జిత్తుల నుండి రాజకీయ లబ్ధిని ఆశించకుండా ఉండి ఉంటే గత కొన్ని ఏండ్లుగా మందిర్, మసీదు పేరిట సాగిన ఈ ఘోరం నుండి దేశం బయటపడి వుండేది. మసీదును కూలగొట్టడం ద్వారా చారిత్రికపొరపాటును సరిచేయాలనే తమ దుష్ట తలంపును హిందూ మతోన్మాదులు దాచుకోలేదు. అయోధ్యలో జరిగిన దానితో తమకు సంబంధం లేదని బి.జె.పి. నాయకులెంతగా చెప్పుకున్నా వారి మాటలను నమ్మేవారెవరూ లేరు. సడలిన జాతివిశ్వాసాన్ని పునర్నిర్మించాలి. అయోధ్యలో జాతీయ సమైక్యతకు ప్రతీకగా ఓ స్మృతిచిహ్నాన్ని నిర్మించేందుకు భారత రాష్ట్రపతి నేతృత్వంలో నూతన కరసేవ-సృజనాత్మక కరసేవ ద్వారా ఈ పని చేయాలి.

**–ఇండియన్ ఎక్స్‌ప్రెస్**

## అయోధ్యలో విషాదం

అయోధ్య సంఘటనలు గత కొన్నేండ్లుగా భారతీయ జనతాపార్టీ చేపట్టిన ప్రచారానికి పరాకాష్ట. అద్వానీ రథయాత్ర కలిగించిన కదలిక అయోధ్య అంశం ఓట్లు తెచ్చిపెడుతుందన్న నమ్మకాన్ని బి.జె.పి.కి కల్గించింది. అందుకోసమే అది అప్పటి నుండి చేసిన పనులన్నీ బాబ్రీ మసీదును కూలద్రోసి అయోధ్యలో రామాలయాన్ని నిర్మించే లక్ష్యం దిశగా ఎక్కుపెట్టబడ్డాయి. బి.జె.పి. నాయకులు ఎవరేమీ చెప్పినా, ఆ పార్టీ తన ఏకసూత్ర ప్రణాళికకు అనుగుణంగా వ్యవహరించిందన్నది వాస్తవం. అయోధ్య విషయంలో కేంద్రం ఘోరవైఫల్యం చెందింది. గత సెప్టెంబర్ నుండి మూడు మాసాల వ్యవధిలో పి.వి. ప్రభుత్వం చేసింది బహుస్వల్పం. విచక్షణది పైచేయికాగలదని, కోర్టు తీర్పును ఆమోదించడం జరుగుతుందని ప్రభుత్వం ఆశపడింది. కానీ ప్రభుత్వాలు ఆశాసౌధాలపై మనజాలవు. సంక్షోభం తలెత్తి చర్య తీసుకోవాల్సిన తరుణమాసన్నమైనపుడు చర్య తీసుకోలేని అసమర్ధురాలిగా కేంద్ర ప్రభుత్వం నిరూపించుకుంది.

**–ఇండిపెండెంట్**

## కూలిన స్వప్నం

శ్రీ కల్యాణ్‌సింగ్ రాజీనామా, టెలివిజన్‌లో ప్రధానమంత్రి బాధామయ ప్రసంగం, కాంగ్రెస్(ఐ) ఇచ్చిన బంద్ పిలుపు ఇవేవీ జరిగిన కుట్రను కప్పిపుచ్చలేవు. బి.జె.పి. కావాలని కోరుకున్నది దాన్ని దానికి అప్పగించడానికి చాలా జాగ్రత్త పథకం వేయబడింది... ఈ విషయం నుంచి వామపక్షాలు మాత్రమే గౌరవప్రదంగా బయటపడ్డాయి. మేము కావాలో, బి.జె.పి. కావాలో తేల్చుకొమ్మని అవి ప్రధానిపై సరైన సమయంలో ఒత్తిడి తెచ్చాయి. ఆయన ఒక వైఖరి తీసుకోక తప్పదు. మసీదు కూల్చివేతను నివారించి వుండటం సాధ్యమే అని మాత్రం సూటిగా చెప్పొచ్చు.

**– సి.ఆర్. ఇరానీ**
**స్టేట్స్‌మన్, డిసెంబర్ 7.**

## రిపబ్లిక్‌కు కళంకం

అయోధ్యలో అనుకున్నంత అనర్థం జరిగింది. మసీదు విధ్వంసాన్ని నివారించడానికి వారెన్ని విధాలైనా ప్రయత్నించవచ్చు. కాని వారు చట్టాన్ని ధిక్కరించి వ్యవహరించారనే దాన్ని మాత్రం దేశమంతా చూసింది... సంఘ పరివార్ చెప్పే "హిందూత్వ" సిద్ధాంత ప్రమాదకర లక్షణాలను కూడా ఈ పరిణామాలు బట్టబయలు చేశాయి. ద్వేషం, దురభిప్రాయం, మౌఢ్యం, ఆ సిద్ధాంతానికి మూలం. భిన్నత్వాన్ని గుర్తించే, సహనం, నీతిగల హిందూమత భావనకు కట్టుబడటానికి అది మూర్ఖంగా నిరాకరిస్తుంది. ఏమైనా ఆదివారం జరిగిన పరిణామాలకు కేవలం హిందూత్వ శక్తులనే నిందించితే చాలదు. కేంద్రప్రభుత్వం, పార్లమెంటు, కోర్టులు, ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసే ప్రతి ఒక్కరూ తమవంతు భాగం పంచుకోకతప్పదు. రాష్ట్రపతి శంకర్ దయాళ్ శర్మ అసాధారణమైన సూటిదనంతో చేసిన ప్రకటనలో వ్యక్తమైన ఆవేదన, ఆగ్రహాలు దేశ ప్రజలలో అత్యధికుల భావాలకు ప్రాతినిధ్యం వహిస్తాయి.

**– "టైమ్స్ ఆఫ్ ఇండియా"**

## దేశానికి తలవంపులు

అయోధ్యలో జరిగిన పరిణామానికి దేశం సిగ్గుతో తలవంచుకోవాలి. ఆదివారం జరిగిన దారుణ ఘటనలకు బాధ్యత పర్యవసానాలు తెలియకుండా రథాలు ఎక్కిన ఎల్.కె. అద్వానీ వంటి వారిపైనే వుంటుంది..... దేశం ఇప్పుడైనా ఆగి ఆలోచించుకోవాలి. తప్పు ఎక్కడ జరిగిందో పరిశీలించుకోవాలి. రాజకీయాలలో మతాన్ని జొప్పించవద్దు. అలా చేస్తే తర్వాత వాటిని విడదీయలేము అనేది ఒక పాఠం. ఉద్రేకాలు రెచ్చగొట్టవద్దు, తర్వాత వాటిని అదుపుచేయలేము అనేది మరో పాఠం.

కాంగ్రెస్ పార్టీ అయోధ్యలో తాళాలు తెరిచింది. తన ఎన్నికల లాభం కోసం పర్యవసానాలు ఆలోచించకుండా మూడేళ్ళ క్రితం అక్కడ శిలాన్యాస్‌కు అనుమతించింది. ఆదివారం అయోధ్యలో దేశం చాలా కోల్పోయింది. దేశ సమైక్యత నిజంగానే ప్రమాదంలో పడింది.

**హెచ్.కె. దువా**
**'హిందూస్థాన్ టైమ్స్'**

అయోధ్యలో బాబరీ మసీదు విధ్వంసం అనంతరం, చరిత్రలో తొలిసారిగా రాష్ట్రపతి భవన్ నుంచి వెలువడిన బహిరంగ వ్యాఖ్యానంగా రాష్ట్రపతి శ్రీ డాక్టర్ శంకర్ దయాళ్ శర్మ ప్రెస్ కార్యదర్శి విడుదల చేసిన ప్రకటన ఇలా పేర్కొంది:

"అయోధ్యలో మసీదుకు నష్టం కలిగించిన దుండగాన్ని రాష్ట్రపతి డాక్టర్ శంకర్ దయాళ్ శర్మ తీవ్రంగా గర్హించారు. హిందూమతం లేదా ఇతర గొప్పమతాల సిద్ధాంతాలకు, ఆచారాలకు అలాటి పనులు పూర్తి విరుద్ధమని ఆయన అభిప్రాయపడ్డారు. భారతదేశం అనేక శతాబ్దాలుగా పెంపొందించిన నైతిక సూత్రాలకు మసీదును కూలగొట్టిన వారు విఘాతం కలిగించారు. భారత స్వాతంత్ర్యం కోసం జరిగిన పోరాటానికి, తర్వాత పునర్నిర్మాణానికి నాయకత్వం వహించిన అమరవీరులు, మహనీయులు బలోపేతం చేసిన ఆ నైతిక విలువలకు వారు తూట్లు పొడిచారు. వారు ఈ దేశపు చట్టాన్ని - అన్ని మతాలు పరస్పరం గౌరవించుకోవాలనే భారతీయ సాంప్రదాయాన్ని, హైందవజీవన విధానపు మౌలిక సూత్రాల్ని, విలువల్ని ఉల్లంఘించారు.

చట్టాన్ని నిలబెట్టేందుకు, భద్రతను కాపాడేందుకు, చట్టాన్ని గౌరవించే పౌరులందరి రక్షణకు చర్యలు తీసుకోవలసిందిగా రాష్ట్రపతి ప్రధానిని కోరారు. శాంతి, సమైక్యతలను పరిరక్షించాలని, జాతి వ్యతిరేక శక్తులను అణచివేయడానికై పరస్పరం సహకారంతో కృషి చేయాలని రాష్ట్రపతి ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

xxxxx xxxxx

ఎన్.ఐ.సి. గత సమావేశంలో ప్రస్తుత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుకు లభించిన బేషరతు మద్దతులాటిది గతంలో ఎవరికీ లభించలేదు. అంతటి విశ్వాసానికి ఆయనవలె ఎవరూ గతంలో ద్రోహం చేయలేదు. నరసింహారావుకు బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్.లు ద్రోహం చేయడం కాదు. ఆయనే భారతదేశానికి ద్రోహం చేశారు. ఆయన ఇంకా ఎందుకు అధికారంలో కొనసాగుతున్నారు? మరే ఇతర ప్రజాస్వామ్య దేశంలోనూ ఇలాటి బాధ్యతారాహిత్యాన్ని క్షణకాలం కూడా సహించరు.

**- ఎం.జె. అక్బర్**

(కాంగ్రెస్(ఐ) మాజీ ఎం.పి., ప్రముఖ పాత్రికేయుడు)

xxxxx xxxxxx

## రాష్ట్రపతి ప్రభృతుల ఆవేదన

సమస్యను సామరస్యంగా పరిష్కారం చేయాలనే వైఖరితో నేనూ ఏకీభవించాను. ఎందుకంటే ప్రజాస్వామ్య వ్యవస్థలో జటిల సమస్యలను సామరస్యంగా పరిష్కరించుకోవాలనే చూస్తాము. అందులో తప్పులేదు. ఆ ఉద్దేశ్యాన్ని కూడా శంకించలేము. అయితే ఆర్.ఎస్.ఎస్., బి జె పి., వి.హెచ్.పి.ల ఉద్దేశ్యం అది కాదని ఈనాడు స్పష్టమైంది. ఆయన(ప్రధాని) ప్రయత్నాన్ని వారు వంచన కోసం వాడుకున్నారు. అందుకే ఈరోజు ప్రధాని తనకు ద్రోహం జరిగిందని, వారు దేశానికి ద్రోహం చేశారని చెప్పాల్సివచ్చింది.

అధికారంలో వున్న వారెవరైనా ఏమి జరిగినా అందుకు బాధ్యత తీసుకోకతప్పదు. అనేక విషయాలకు పూనత మాదేనని మేము చెప్పుకొంటాము ఏదైనా తప్పు జరిగితే ఆ నింద కూడా మేము తీసుకోక తప్పదు.

**- అర్జున్ సింగ్**

**(కేంద్ర మంత్రి)**

xxxx

ఎవరో కొద్ది మంది బాబ్రీ వ్యతిరేక ఉన్మాదులను మినహాయిస్తే మొత్తం దేశం 'మసీదు' విధ్వంసం పట్ల దిగ్భ్రాంతి చెందింది. ఆ ఘటన మన సాంస్కృతిక వారసత్వాన్నే అగౌరవపరచింది. అత్యున్నత న్యాయస్థానపు స్పష్టమైన ఉత్తర్వులను ఉల్లంఘించింది..... ఈ దుండగం భారతదేశపు లౌకిక ప్రతిష్టకు చెరగని కళంకం తెచ్చిపెట్టింది. మన సాంస్కృతిక విలువల పునరుద్ధరణ, మతబోధనల పవిత్రతను నొక్కి చెప్పడం తక్షణావసరం. ప్రతి భారతీయుడు ఇప్పుడు ఉపశమన ప్రక్రియలో కలవాలి. ఎవరైనా నిజమైన హిందువు అయితే అతను తన ముస్లిం సోదరుల మనసులకు కలిగిన గాయాన్ని మాన్పేందుకు కదలాలి. దేశభక్తి అనేది సాంస్కృతికపరమైనది. తెగ, పూజలు వగైరాలకు అతీతమైంది. ఇందుకుగాను బహిరంగ సభలలో, మత ఉత్సవాలలో కూడా విచారం వెలిబుచ్చాలి. దారితప్పిన ఉన్మాదులు జరిపిన నేరపూరిత దుశ్చర్యను క్షమించమని వారిని కోరాలి. బాబ్రీ మసీదు కూల్చడం ద్వారా శ్రీరాముడిని, ఆయన పేరుచ్చరిస్తూ ప్రాణాలు వదిలిన గాంధీజీని, లౌకికతత్వానికి ప్రతీకగా నిలిచిన నెహ్రూను, అన్ని మతాల సమగ్ర దృష్టి బోధించిన వివేకానంద, రామకృష్ణ పరమహంస వంటి మహావ్యక్తులుగాని వీరందరినీ అతిక్రమించి, అవమానించినట్లే అయింది.

**- జస్టిస్ వి.ఆర్. కృష్ణయ్యర్**

xxxxx xxxxx

మనమంతా ఈనాడు ఆత్మవిమర్శ చేసుకోవాలి. మనలో కొంతమంది ఎక్కువగా చేసుకోవాలి.

అయోధ్యలో జరిగిన పరిణామాలకు ఈనాడు కాంగ్రెస్ విమర్శలకు గురికావలసి వస్తోంది. విగ్రహాల ప్రతిష్టాపన(1949), మసీదు/గుడి తాళాలు తెరిపించడం, శిలాన్యాస్‌కు అనుమతించడం, మసీదు విధ్వంసం - వీటన్నిటికి మనలనే నిందిస్తున్నారు.

**- ఎన్.డి. తివారీ**

**(యు.పి. కాంగి మాజీ ముఖ్యమంత్రి)**

xxxxx

బి జె.పి. అయోధ్యలో తీవ్ర దుస్సాహసానికి పూనుకున్నది. ఘోర తప్పిదం చేసింది. పర్యావసానాన్ని అంచనా వేయడంలో మా పార్టీ ఘోరంగా విఫలమైంది. పార్టీలో మధ్యేవాదుల మాటలకు, హితబోధలకు బొత్తిగా విలువ లేకుండా పోయింది. డిసెంబర్ 6న మసీదును అంటుకోమంటూ సుప్రీంకోర్టుకు, పార్లమెంటుకు, ప్రధానికి ఇచ్చిన హామీని

(మిగతా 31వ పేజీలో)

# చారిత్రక సత్యాలకు దూరం రామజన్మభూమి వివాదం

రామజన్మభూమి–బాబ్రీమసీదు వివాదం గురించి ప్రముఖ చరిత్రకారులు రొమెల్లాథాపర్, సర్వేపల్లి గోపాల్, బిపిన్ చంద్ర, కె.ఎన్.పణిక్కర్‌ల రచనల ఆధారంగా సమాధానాలిస్తున్నాం.

ప్రశ్న: రామజన్మభూమి వివాదానికి చారిత్రక ఆధారాలున్నాయా?

జవాబు: మతతత్వ శక్తులు చరిత్రను తమ స్వార్థ పర రాజకీయాలకనువుగా మలచుకోజూస్తున్నాయి. బాబ్రీమసీదు-రామజన్మభూమి వివాదం చారిత్రక సత్యాలకు సంబంధించింది కాదు. చాలా సార్లు చారిత్రిక సత్యాలు ప్రజల నమ్మికకు భిన్నంగా వుంటాయి.

ప్రశ్న: ప్రస్తుతమున్న అయోధ్య రాముని జన్మస్థలమని చెప్పగలమా?

జవాబు: ఈ వివాదాన్ని తేల్చడానికి చరిత్రను సరిగ్గా పరిశీలించాలి. అయితే చారిత్రక సత్యాలవల్ల ఈ వివాదం పరిష్కారమవుతుందని నమ్మలేము. చరిత్రను మతతత్వ శక్తులు తమ స్వార్థపర రాజకీయాలకు అనువుగా మలచుకోజూస్తున్నపుడు చారిత్రక విశ్లేషణ అవసరమేర్పడుతుంది. రామకథలోని రాముని వివరాలను వాల్మీకి రామాయణ కావ్యంగా రచించారు. ఇది కావ్యం కనుక అందులోని ప్రదేశాలు, పాత్రలూ చాలా వరకు కల్పితాలు కావచ్చు. చరిత్రకు నమ్మదగ్గ ఆధారాలుగా భావించే ఇతర మార్గాల ద్వారా రుజువయితే తప్ప రామాయణంలో పేర్కొన్నవి చారిత్రక సత్యాలు అనలేము. రామాయణం ప్రకారం రాముడు త్రేతాయుగానికి చెందినవాడు. కలియుగమని చెప్పబడుతున్నది క్రీస్తుపూర్వం 3102లో ప్రారంభమైంది. అంటే త్రేతాయుగం ఇంతకన్నా ఎన్నోవేల సంవత్సరాల పూర్వపు కాలము. కాని చరిత్ర ప్రకారము క్రీస్తుపూర్వం 8వ శతాబ్దంలో మాత్రమే అయోధ్యలో మానవసంబంధాలు ప్రారంభమైనాయి. అదికూడా మామూలు ఆదిమ మానవుడుగా సంచరించినకాలం. అంతే కాని రామాయణంలో పేర్కొన్న పెద్దపెద్ద భవనాలు, కట్టడాలున్నట్లు శిథిలరూపాన కాని, మరి ఏ ఇతర చారిత్రక ఆధారాలుగాని లేవు. అలాంటప్పుడు వేలాది



అభినవ రామభక్త అద్వానీ

సంవత్సరాల పూర్వపు 'త్రేతాయుగంలో' రామాయణంలో వర్ణించిన నాగరికతకు నాటి అయోధ్యలో అవకాశమే లేదు. ఇక వివిధ మత గ్రంథాలను కూడా పరిశీలిద్దాం. బౌద్ధమత గ్రంథాల ప్రకారం కోసల రాజ్యంలో శ్రావస్తి, సాకేతలు మాత్రమే పెద్దనగరాలు, అయోధ్య ప్రస్తావన లేదు. జైనగ్రంథాలు కూడా కోసల రాజధానిగా సాకేతనగరాన్నే పేర్కొన్నాయి. అక్కడక్కడ అయోధ్య ప్రస్తావన ఉన్నా అది గంగానది ఒడ్డున ఉన్న నగరంగా చెప్పారు. కానీ, ప్రస్తుత అయోధ్య సరయూనది ఒడ్డున ఉంది. క్రీస్తు శకం 5వ శతాబ్దంలో స్కందగుప్తుడు తన రాజధానిని సాకేతకు మార్చుకుని అయోధ్య అని పేరు పెట్టారు. దీని ప్రకారం చాలా కాలం తర్వాతనే రామాయణంలో పేర్కొన్న అయోధ్య సాకేతకు మారుపేరుగా చలామణిలోకి వచ్చింది. కాబట్టి ప్రస్తుత అయోధ్యను ఒకప్పుడు సాకేతపురిగా వ్యవహరించే వారంటే వాల్మీకి రామాయణంలోని అయోధ్య కల్పితమైనదని చెప్పుకోవాలి. అటువంటప్పుడు ప్రస్తుత అయోధ్య రామజన్మభూమి అంటే అది ప్రజలు నమ్మకమే కాని చారిత్రక సాక్ష్యాలు లేవు.

ప్రశ్న: నేటి అయోధ్య చాలాకాలం క్రితం నుంచి రాముని ఆరాధనకు కేంద్రంగా ఉండేదని మత సంస్థలు ప్రచారం చేస్తున్నాయి. ఇది ఎంతవరకు నిజం?

జవాబు: అయోధ్య కావలం రామభక్తులకే కాక అనేక ఇతర మతస్థులకు కూడా పుణ్య స్థలం. వాస్తవానికి ఈ పట్టణం రామ పూజకు ముఖ్యకేంద్రంగా ఇటీవల కాలంలోనే రూపుదిద్దుకుంది.

క్రీస్తు శకం 5-8 శతాబ్దాల మధ్య, ఆతర్వాత అనేక గ్రంథాలు అయోధ్య వాసులగురించి పేర్కొన్నాయి. కాని, అయోధ్య రామపూజకు కేంద్రమని ఎక్కడా చెప్పలేదు. అయోధ్య ముఖ్యమైన బౌద్ధమత కేంద్రంగా ఉండేదని హుయాన్‌సాంగ్ రాసారు. బుద్ధుడు కొంతకాలం అయోధ్యలో గడిపారని బౌద్ధుల నమ్మకం. అందుకే ఇది వారికి పవిత్ర స్థలం

జైనమత తీర్థంకరులలో మొదటివాడు, నాలుగవారు అయోధ్యలో పుట్టారు. క్రీస్తుపూర్వం 4-3 శతాబ్దాలకు చెందిన అతిపురాతనమైన విగ్రహం త్రవ్వకాలలో అక్కడే దొరికింది. అందుకే అయోధ్య జైనులకు కూడా పుణ్యక్షేత్రమయ్యింది.

క్రీస్తుశకం 11వ శతాబ్దపు గ్రంథాలలో కూడా అయోధ్య సమీపంలో ఇతర తీర్థాలున్నట్లు ప్రస్తావించారు. కాని రామజన్మభూమి ప్రస్తావన లేదు.

రామజన్మకు 13వ శతాబ్దం నుంచే ఆదరణ పెరిగినట్లు తెలుస్తోంది. రామకథ హిందీలో వెలువడడం, రామానంది తెగ ఒకటి ఏర్పడడంతో దీనికి మరింత ఊపు వచ్చింది. అయితే 15-16 శతాబ్దాల వరకు కూడా రామానంది తెగవారు అయోధ్యలో పెద్ద ఎత్తున స్థిరపడలేదు. అప్పటికే శైవమతానికే ప్రాబల్యం ఎక్కువగా ఉండేది. 18వ శతాబ్దం నుంచే రామానంది తెగవారు అయోధ్యలో ఎక్కువగా స్థిరపడడం మొదలైంది. ఆ తర్వాత శతాబ్దాలలోనే వీరు అయోధ్యలోపల రామ మందిరాలు నిర్మించారు. అంటే మత సంస్థలు చెపుతున్నట్లు అయోధ్య చిరకాలంగా రామపూజ కేంద్రంగా విలసిల్లిందనడం సహేతుకం కాదు.

**ప్రశ్న:** రామమందిరాన్ని కూలగొట్టి బాబ్రీమసీదు నిర్మించారన్న వాదన సరైందా?

**జవాబు:** రాముని గుడిని కూలగొట్టి బాబర్ మసీద్ కట్టడానికి ఎలాంటి చారిత్రక ఆధారాలు లేవు. బాబ్రీమసీదుకు రెండువైపులా ఉన్న శిలాఫలకాలపై ఆమసీదును బాబర్ కట్టించాడని పర్షియన్ భాషలో రాసివుంది. ఇది తప్పించి ఈ మసీదును బాబర్ కట్టించాడనటానికి మరే ఇతర ఆధారాలు లేవు. బాబర్‌నామాను తొలుత అనువదించిన శ్రీమతి బివరెడ్జ్ ఈ శిలాఫలకాలోని పర్షియన్ వాక్యాలను దాని అనువాదాన్ని పుస్తకంలో ప్రచురించారు. దీనికి సంబంధించి కీలక వాక్యాలు ఇలా వున్నాయి. "ధర్మ పరిపాలకుడని దిగంతాలవరకు కీర్తిపొందిన బాబర్ [illegible]ర్తి ఆజ్ఞమేరకు సహృదయుడైన మీర్‌భాకీ, ఈ ఎంద్ నిర్మించాడు" అని మాత్రమే రాసివుంది.

మహ్మద్ ప్రవక్త అనుచరుడు కనుక బాబర్ గుడిని కూల్చారని ప్రచారం తప్ప చారిత్రక ఆధారాలు లేవు. కానీ దేవాలయ నిర్మాణానికి, బాబర్ చక్రవర్తి ఉదారంగా గ్రాంట్లు ఇచ్చినట్టు చరిత్ర చెప్తోంది.

అందుకే రాముని గుడిని కూలగొట్టి బాబ్రీమసీద్ నిర్మించారన్న ప్రచారాన్ని చరిత్ర అంగీకరించదు. ఇది కేవలం విద్వేషాలను రెచ్చగొట్టే యత్నమే.

**ప్రశ్న:** బ్రిటిష్ రికార్డు ప్రకారం రాముని గుడి కూలగొట్టి మసీద్ కట్టినట్లు ప్రస్తావన ఉందని వాదన. దానికి మీ సమాధానమేమి?

**జవాబు:** గుడిని కూలగొట్టి మసీద్‌ను కట్టారన్న ప్రచారం 19వ శతాబ్దంలో ప్రారంభమైంది. ఈ కథ ఆనాటి అధికార దస్తావేజులలో కూడా చోటు చేసుకొంది. బాబర్ ముస్లిం కాబట్టి పరమత సహనం తక్కువ కాబట్టి గుడిని పడగొట్టి మసీద్ కట్టించి ఉంటారనడంలో ఆశ్చర్యం ఏమీ లేదని బాబర్ నామా అనువాదకురాలు శ్రీమతి బివరెడ్జ్‌రాసారు. గుడిని పడగొట్టి మసీదునిర్మించి ఉంటారన్న తన అభిప్రాయం తప్పించి శ్రీమతి బివరెడ్జ్ ఇందుకు ఎటువంటి ఆధారాలు చూపలేదు. స్వంత అభిప్రాయానికి ఎలాంటి ఆధారాలు లేకుండా రావడాన్ని చరిత్ర అంగీకరించదు. వాస్తవానికి బాబర్ కాలంలో ఇతర మతస్థుల తీర్థ స్థలాల అధికారులు వారి అధికారంలో విభజించి పాలించు అన్న సూత్రానికి అనుగుణంగా ఉంది. కాబట్టి శ్రీమతి బివరెడ్జ్ నమ్మారు. దాన్ని పనిగట్టుకొని ప్రచారం చేశారు.

మధ్యయుగపు చారిత్రక ఆధారాల ప్రకారం ఈ మసీద్‌ముస్లింలకు మతపరంగా కాని సంస్కృతిపరంగా కాని అంత ప్రాముఖ్యత సంతరించుకోలేదన్నది గమనార్హం.

**ప్రశ్న:** ముస్లిం రాజులు పనిగట్టుకొని మత విద్వేషంతో హిందూ మతపుణ్యక్షేత్రాలు ధ్వంసం చేశారు కదా? దీనికి చరిత్రకారులిచ్చే సమాధానమేమిటి?

**జవాబు:** హిందువుల పూజా స్థలాలను ముస్లిం పాలకులు ఎల్లవేళలా వ్యతిరేకించే వారనడానికి చరిత్రలో ఆధారాలు లేవు. అయోధ్య హిందువుల తీర్థస్థలంగా అభివృద్ధి కావడానికి ముస్లిం నవాబుల దానధర్మాలు ఎంతగానో ఉపయోగపడ్డాయి. నవాబుల పాలన, కాయస్థుల సైన్యంలో అధిక సంఖ్యాకులైన సేనదళాల మీద ఆధారపడి వుండేది. నవాబులు అధికారంలో కొనసాగటానికి హిందువుల పుణ్యక్షేత్రాలకు దానధర్మాలు చేస్తుండే వారు. నవాబ్‌సఫ్దర్ జంగ్ క్రింద దివాన్ గా ఉన్నవ్యక్తి అయోధ్యలో ఎన్నో గుళ్ళను బాగు చేయించాడు. కట్టించాడు కూడా. అయోధ్యలో హన్మంతుని కొండపై గుడికట్టుకోటానికి నిర్మాణ సంఘానికి సఫ్దర్‌జంగ్ భూమినిచ్చాడు. అయోధ్యలోని ఇదే స్థలంలో గుడికోట కట్టటానికి ఆసఫ్‌ద్దౌలా ధన సహాయం చేశాడు. హిందువుల పూజారులు జరిపే పూజలకు నవాబ్‌ల పాలనలో ముస్లిం అధికారులు దానధర్మాలు చేసే వారని పాండా రికార్డులు తెలుపుతునాయి. అందుకే ముస్లిం రాజులందరూ మత విద్వేషంతో హిందూ మతపుణ్య క్షేత్రాలను నాశనం చేశారని సాధారణ సూత్రీకరణ చేయడం పొరపాటు.

**ప్రశ్న:** రామ జన్మభూమి-బాబ్రీమసీదు వివాదానికి పరిష్కారమేమి?

**జవాబు:** అయోధ్య వేరువేరు శతాబ్దాలలో విభిన్న మతాలకు యాత్రా స్థలంగా మారుతూవచ్చింది. విభిన్న మతస్థులకు ఈ పట్టణం పవిత్రమైంది. ఏ ఒక్క మతం దానిపై గుత్తాధిపత్యాన్ని ప్రకటించుకోవడానికి చరిత్ర అంగీకరించదు. ఏ సమాజంలోనైనా చరిత్రను తలక్రిందులు చేయడం ఒక భాగం, అనేక మతాలకు నిలయమైన మన దేశంలో ఈ ప్రక్రియ మత వైషమ్యాలను రెచ్చగొడ్తుంది. గతాన్ని మార్చాలన్న ప్రయత్నాలు తీవ్ర పరిణామాలకు దారి తీస్తాయి. కాబట్టి ఈ సమస్యకు త్వరితగతిన రాజకీయ పరిష్కారం సాధించాల్సిన అవసరం ఎంతైనావుంది.

**ప్రశ్న:** మతతత్వాన్ని వ్యతిరేకించడమంటే మతాన్ని వ్యతిరేకించడమేనా?

**జవాబు:** కాదు, సమాజంలో ఎవరైనా ఇతరుల భావ ప్రకటనా స్వేచ్ఛకు భంగం కలగకుండా మత ప్రచారాన్ని చేసుకోవచ్చు. మత విశ్వాసాలను ఆచరించవచ్చు. అయితే భారత దేశంలో మతతత్వాన్ని విమర్శించడమంటే మతాన్నే విమర్శిస్తున్నట్లుగా తరచూ అపోహ పడ్తారు. మతపరమైన భావాలను రాజకీయ ప్రయోజనాల కొరకు దుర్వినియోగ పరచడమే మతతత్వం. ఇది ప్రమాదకరం.

**ప్రశ్న:** రామమందిరంనిర్మాణానికై మసీదు కూలగొట్టడం పై మీ అభిప్రాయమేమి?

**జవాబు:** రామమందిరాన్ని నిర్మించుకోవటానికి ఇబ్బందిలేదు ఎక్కడైనా నిర్మించుకోవచ్చు. కానీ, సమస్యల్లా ఇప్పటికి ఉన్న మసీద్‌ను కూలగొట్టి గుడి కట్టడం అభ్యంతరకరం. అయితే ఇది మెజారిటి ప్రజల విశ్వాసమని అద్వానీ వాదిస్తున్నారు. ముందుగా భారతదేశంలో ఉన్న అందరి హిందువుల పక్షాన అద్వానీకాని, విశ్వహిందూ పరిషత్ కాని వకల్తానేమైనా పుచ్చుకున్నారా? వీరు చెప్పేదే సమస్త హిందువుల అభిప్రాయమని చెప్పలేం అయినా ఇతరుల విశ్వాసాల పైదాడిచేస్తామనడం, అది తన విశ్వాసమనటం ఏ విధంగాను సరైనదనిపించుకోదు. పటేల్ సోమనాథ్ దేవాలయాన్ని కట్టించాడని, నాగార్జున సాగర్ నిర్మాణానికై అనేక దేవాలయాలను తరలించారని అలాగే రామమందిరం అయోధ్యలో కట్టడం తప్పుకాదని అద్వానీ వాదన. అయితే ఈ రోజు అద్వానీ చేస్తున్నదేమీ? పటేల్ లాగా జీర్ణ దేవాలయాన్ని పునరుద్ధరించడమా? కాదు ప్రజలందరి బాగుకై వారికంత తిండిపెట్టడానికై దేవాలయాన్ని తరలించి నిర్మించడమా అదీ కూడా లేదు. శ్రీరామచంద్రునిపై భక్తిప్రపత్తులతో చేసే పనికాదు. రాజకీయ ప్రయోజనాల కొరకు సాక్షాత్తూ శ్రీ మన్నారాయణులన్నే వాడుకునే కార్యక్రమమిది. మంచి ఆలోచనలు అన్ని దిక్కుల నుంచి రానీయండి అన్న ఉపనిషద్‌లనే కించపరచేపని ఇది. వేదాలు, పురాణాలు, ఏ ఇతర హిందూమత గ్రంథాలు కానీ మసీదును కూలగొట్టి గుడిని కట్టమని ప్రభోదించలేదు. పరమత సహనం సర్వమానవ సౌభ్రాతృత్వం ప్రభోదించిన మన సంస్కృతికి ఇది అవమానకరం. సంస్కృతి, సాంప్రదాయాలను మంట కలిపే చర్యలు హిందూ మత ధర్మానికి, భారతీయ సంస్కృతికి వ్యతిరేకం.

అనేక చోట్ల బౌద్ధ, జైన దేవాలయాల స్థానే హిందూ దేవాలయాలు వెలిశాయి. ఇపుడు వాటిని పునరిద్ధరిస్తాము అంటే సాధ్యమయ్యే పనేనా.

ఒక మతం వారు మరో మతానికి చెందిన ఆరాధనా స్థలాలను నాశనం చేయడమనే మధ్య యుగాలనాటి చరిత్రను పీడకలగా మరచి[illegible]వాలి. చాలా సంవత్సరాల క్రితమే ఈ వివాదం చెలరేగినపుడు బాబ్రీ మసీదులో ప్రార్ధనలు నిలిపి వేశారు. పై అన్ని కారణాల బట్టి చూసి నాగరికతకే తలవంపు తెచ్చే, ఆధునిక సమాజా[illegible] ఆటవిక లక్షణాలను పెంపొందించే చర్య అయిన మసీదును కూలగొట్టి గుడికట్టే యత్నం సరైందికాదు. విభిన్న మతాలకు సహజీవనం విశ్వవ్యాపితంగా పేరొందిన ఈ దేశ ఐక్యత సమగ్రతలకు భంగం కలిగించే చర్యలు గర్హనీయం.

# ముస్లిం మతోన్మాద సంస్థల ప్రమాదకర చరిత్ర

ఆర్.ఎస్.ఎస్. గురించి తెలిసినంత విస్తృతంగా ప్రజలకు జమాతె ఇస్లామీ గురించి తెలియదు. ఇప్పుడు నిషేధానికి గురికావడంతో దాన్ని గురించి తెలుసుకోవాలనే ఆసక్తి పెరిగింది.

ఆర్.ఎస్.ఎస్. ప్రతిరూపం లాటిది జమాతే. పూర్తి ఇస్లాం రాజ్యం స్థాపించాలని అది చెబుతూంటుంది. 1941లో మౌలానామదూది దాన్ని స్థాపించారు. ఆయన తర్వాత పాకిస్తాన్ వెళ్ళి పోయారు. 1948 ఏప్రిల్‌లో మౌలానా అబుల్‌లైస్ఇస్లాహి దాన్ని జమాతే-ఎ-హింద్ అనే పేరుతో పునరుద్ధరించారు. దేశంలో చాలా చోట్ల శాఖలు స్థాపించింది. ఉర్దూలోనూ వివిధ ప్రాంతీయ భాగాలలోనూ పత్రికలు నడుపుతోంది. హిందూ వ్యతిరేక ద్వేషం నూరిపోయడమే జమాతే కార్యక్రమం. దేశంలోని వివిధ ప్రాంతాలలో చెలరేగిన మత ఘర్షణలలో జమాతే పాత్ర వుందని విచారణ కమిషన్లు వెల్లడించాయి.

1975 తర్వాత జమాతే కార్యక్రమాలు తీవ్రమైనాయి. జమాతే క్రింది ప్రధాన నినాదాలిచ్చింది:

1. ఇస్లామిక్ దేశాల సంస్థ చూపేదే దేశాలకు సరైన మార్గం.
2. 'షరియత్' చట్టాన్ని అమలు చేస్తేనే భారత ముస్లింలకు విముక్తి లభిస్తుంది.
3. కమ్యూనిజం ఇస్లాంకు శత్రువు.
4. అన్ని రంగాలలో ముస్లిములు తమ ప్రత్యేక సంస్థలను ఏర్పరచుకోవాలి.
5. ఇతరులను ముస్లిం మతంలో చేర్చే కార్యక్రమం.

పాకిస్తాన్ ప్రోద్బలంతో జమ్మూ కాశ్మీర్‌లో జమాతే కార్యకలాపాలు తీవ్రమైనాయి. 80వ దశకంలో మక్కా మసీదు ఇమామ్‌ను అక్కడకు ఆహ్వానించారు. దేశం మొత్తం మీద అది ముస్లిం బోధకులపై రెండు లక్షల కేంద్రాలు తెరచింది. ముస్లిం ఛాందసాన్ని నూరిపోసే పత్రికా సిలబస్ తయారు చేశారు. సౌదీ అరేబియా తదితర దేశాల నుంచి వారికి సహాయమందుతుంటుంది. జమాతే మొదటి నుంచీ సామ్రాజ్యవాదుల జేబు సంస్థగా వున్నది. స్వాతంత్ర్య పోరాటాన్ని కూడా వ్యతిరేకించింది. పాకిస్తాన్‌లో సైనిక ప్రభుత్వాన్ని అది ఎప్పుడూ బలపరుస్తూంటుంది. మానవ జీవితమంతటినీ ఇస్లాం సూత్రాల పేరుతో శాసించాలని దాని ప్రయత్నం. దేశభక్తి, జాతీయవాదం సైతానులు చేసే ప్రచారమని జమాతే బాహాటంగా చెబుతుంది.

ఇక ఇసామిక్ సేవక్ సంఘ్ (ఐ.ఎస్.ఎస్.) అన బడేది కూడా ఆర్.ఎస్.ఎస్.కు ప్రతిగా కేరళలో ఇటీవల ఏర్పడిన సంస్థ. ఆర్.ఎస్.ఎస్.-ఐ.ఎస్.ఎస్.ల ఘర్షణల వల్ల కేరళలో తీవ్ర ఉద్రిక్తత పరిస్థితులేర్పడ్డాయి. ఈ ఏడాది ఆగస్టు ఆరవతేదీన ఐ.ఎస్.ఎస్. అధ్యక్షుడు అబ్దుల్ నాజర్ మదానిపై హత్యా ప్రయత్నం జరిగిన అనంతరం చాలా ఘర్షణలు జరిగాయి. ఐ.ఎస్.ఎస్. దుందుడుకు ధోరణి పాలక కూటమిలోని ముస్లింలీగ్‌కు కూడా నచ్చలేదు. అయినా లీగ్ జాతీయ అధ్యక్షుడు సులేమాన్ సెయిత్ దాన్ని సమర్థించారు. ఐ.ఎస్.ఎస్.-లీగ్‌లు కలిసి ఒక సందర్భంలో కేరళలో విమానాశ్రయంల వద్ద సంయుక్త ధర్నాలు కూడా నిర్వహించాయి. లీగ్ రాష్ట్ర నాయకులు మాత్రం దాన్ని మంచిగా వుంచుతామని ప్రకటించారు. తన అస్థిత్వం కోసం కూడా లీగ్ ఈ పని చేయాల్సి వచ్చింది.

అయోధ్య ఘటనల అనంతరం దేశంలో మతకలహాల ప్రమాదం పెరిగింది. జమాతే ఇస్లామీ, ఐ.ఎస్.ఎస్. వంటి సంస్థలు నిస్సందేహంగా మతకలహాల ప్రజ్వలనకు దోహదం చేశాయి. కనుక వాటిని కూడా నిషేధించడం సరైన చర్య.

మెజారిటీ మతోన్మాదం లాగే మైనారిటీ మతతత్వం కూడా ప్రమాదమే. ఇటీవల కాలంలో జామియా మిలియా విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ ముసూరల్ హసన్‌పై ముస్లిం మతోన్మాదుల దాడి పెరుగుతున్న ఈ ముప్పుకు ఒక సూచిక.

సి.పి.ఐ. (ఎం) మైనారిటీల హక్కుల రక్షణకై ఎప్పుడూ నిలబడుతుంది. మత కలహాలు వంటి సందర్భాలలో వారిని రక్షించడానికి కృషి చేస్తుంది. విద్య, ఉద్యోగాలు, సాంఘిక సదుపాయాలు వంటి విషయంలో వారి పట్ల ఎలాటి వివక్ష చూపరాదని పోరాడుతుంది. అయితే మైనారిటీ వర్గాలకు చెందిన పీడిత ప్రజలు అభివృద్ధి వివిధ తరగతుల శ్రామిక ప్రజల ఉమ్మడి ఉద్యమాలలో భాగం పంచుకోవడం ద్వారానే సాధ్యమవుతుంది. ముస్లింలలో గల అభద్రత, తమకు అన్యాయం జరుగుతుందనే భావనలను ఉపయోగించుకొని మత ఛాందస నాయకులు, జమాతే ఇస్లామీ వంటి సంస్థలు లాభం పొందుతున్నాయి. ముస్లిం జన బాహుళ్యం అభివృద్ధికి ఈ శక్తులు గుదిబండలవుతున్నాయి. మతం పేరుతో, ముస్లిం స్త్రీల వల్ల అనమానతను ప్రదర్శించాలని చెప్పడం కూడా ఇందులో భాగమే. సి.పి.ఐ. (ఎం) మైనారిటీ మతతత్వంతో కూడా నిరంతరం పోరాడుతుంది. కాశ్మీర్‌లో జమాతే ఇస్లామీ అయినా పంజాబ్‌లో ఖలిస్థానీ ఉన్మాదులనయినా ఎదిరించి పోరాడుతుంది. మతమౌఢ్యం, మతతత్వం ఏ రూపంలో వున్నా ప్రమాదకరమే!

## ముఖచిత్రవివరణ

**అయోధ్యలో విధ్వంసం జరిగిన తీరు**

1) 11.45: పోలీసులు ప్రాంగణాన్ని వదిలి వెళ్ళారు.
2) 12.20: కాంపౌండ్ వాల్ కూలింది
3) 1.30: ప్రధాన ద్వారం కూలింది.
4) 2.45: మొదటిగోపురం కూలింది.
5) 4.30: రెండవ గోపురం కూలింది.
6) 4.45: మూడవ గోపురం కూలింది.
7) సాధువులు, ఆర్.ఎస్.ఎస్.ల ఆనందోత్సాహాలు
8) విధ్వంసాన్ని వీక్షిస్తున్న అద్వానీ, జోషీలు.

—వీక్ పత్రిక సౌజన్యంతో



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | **KRSA101M260** |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | **23 February 2025** |
| ముందు అట్ట | |
| వెనుక అట్ట | |
| మొత్తం పేజీలు | 63 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | ke sowmya |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |